బుద్ధజయంతి శుభాకాంక్షలు

1993-2013 నడుస్తున్న చరిత్ర

సంపుటి : 2
సంచిక : 3
రు. 20/-లు
తెనాలి

తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

నుడి నాడు నెనరు

మే 2016



సురవరం ప్రతాపరెడ్డి
పుట్టినరోజు మే 28
'తెలుగుజాతి
వారసత్వ దినోత్సవం'



'అలెమారియ అంతరంగ'
కన్నడ పుస్తక రచయిత, తెలుగుబిడ్డ
కుప్పె నాగరాజుతో ముఖాముఖి




- బుద్ధజయంతికి మూడు వ్యాసాలు
- అభివృద్ధికి అధికార పక్షాల సరికొత్త భాష్యాలు!
- రెండు కతలు : గురువైన సంబళగాడు
  శంకరానిక్కొంచెం తిక్కుంది!

తెలుగులో తెలుగు నుడికట్టు (వ్యాకరణం)

# ఆం.ప్ర. సచివాలయ ప్రారంభం :



ఫోటో : తమ్మా శ్రీమన్నారెడ్డి

# తెలుగులోనే కనువిందు చేసిన పేరు పలక (శిలాఫలకం)!

## ఇకపై పరిపాలనను తెలుగులోకి తెస్తారా?

**భా**షోద్యమకారుల ఆందోళన ఫలితంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ నేతల తీరులో కనీసం ఒక విషయంలోనైనా మార్పు వచ్చింది. తెలుగు భాషోద్యమ సమాఖ్య, అమ్మనుడి పత్రిక వెలికి తెచ్చిన ఆంగ్ల ఫలకాల అంశం క్రమంగా ప్రజల్లోకి వెళ్ళింది. పలువురు పెద్దలు నోళ్ళు విప్పకపోయినా చెవులు కొరుక్కున్నారు. యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ గారయితే రాజధాని శంకుస్థాపనకు, సచివాలయ శంకుస్థాపనకు ప్రభుత్వం నిలబెట్టిన ఇంగ్లీషు శిలాఫలకాలకు అచ్చంగా ప్రతిరూపాలను తెలుగులో చెక్కించి వాటిని ఊరేగింపుగా తీసుకువెళ్ళి ప్రజల తరపున అమరావతి అభివృద్ధి సంస్థ కమీషనర్ గారికి బహూకరించడం, ఉగాదినాడే ఆవేదనా దీక్షను చేశారు. ప్రభుత్వం తన ధోరణిని మార్చుకోకపోతే ఉద్యమిస్తామని తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షుడు డా॥సామల రమేష్‌బాబు ప్రకటించారు కూడా. ఇవన్నీ అమ్మనుడి సంచికలలో వచ్చాయి.

మొత్తమ్మీద ఇంతవరకు–రాజధానికి, సచివాలయానికి శంకుస్థాపన రాళ్ళను తెలుగులో వెయ్యలేదు. నామోషీ అనిపించిందో ఏమో! ప్రభుత్వాధికారులు ఇప్పటికైనా వివేకం తెచ్చుకొని ఏప్రిల్ 25న బ్రాహ్మీ ముహూర్తంలో జరిగిన సచివాలయ భవన ప్రారంభోత్సవానికి మాత్రం తెలుగులోనే శిలాఫలకాన్ని వేశారు. వేదికపైన కూడా తెలుగు అక్షరాలే కనిపించాయి. ఇది సంతోషదాయకమైన మార్పు. ఇందుకు కారకులైన ఉద్యమకారులకు జేజేలు. ప్రభుత్వ నేతలకు, అధికారులకు అభినందనలు.

ఇక్కడొక మాట. కీ.శే.ఎన్టీఆర్ ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు ఉగాది నుండి రాష్ట్ర పరిపాలనను అంతా తెలుగులోకి తెచ్చి భారతదేశం మొత్తమ్మీద సంచలనం కలిగించారు. ఇంగ్లీషు ఫైళ్ళను తిరస్కరించి అధికారులకు స్పష్టమైన ఆదేశాలిచ్చారు. అధికారులకు తెలుగులో శిక్షణ ఇచ్చి సచివాలయం నుండి జిల్లా స్థాయి వరకు పరిపాలన తేవడానికి ఆయనకు అప్పట్లో కొద్దిరోజులు మాత్రమే పట్టింది. మన ముఖ్యమంత్రి గౌరవనీయ నారా చంద్రబాబునాయుడు గారు కూడా ఈ ఆదర్శాన్ని తీసుకొని తమ పరిపాలనను, పార్టీని నిజమైన తెలుగు రక్షకులుగా రూపొందిస్తారా? కొత్త సచివాలయం నుండి పరిపాలనను పూర్తిగా తెలుగులోకే తెస్తారని ఆశించవచ్చునా? ఆయన తలచుకుంటే ఇది చాలా చిన్నపని. తలచుకుంటారా లేదా అన్నదాన్ని బట్టే ప్రజల భాష తెలుగు విషయంలో ఆయన చిత్తశుద్ధి నిరూపితమవుతుంది.

–సంపాదకుడు



## తెలుగు వైతాళికుడు సురవరం ప్రతాపరెడ్డి

నిజాం రాష్ట్రాంధ్రులకు రాజభాష యగు హిందూస్థానీయమనిన మిక్కిలి గౌరవము కలదు. ఆ భాషను స్వీకరించుచునే యున్నారు. కానీ తమ మాతృభాష యగు ఆంధ్రమును గురించి ఉపేక్ష చేయ లేదు. తల్లియొడిలో నుండగా నుగ్గుపాలతో నేర్చిన భాష నెవడు మరువగలడు? ఎవరు మరువమని చెప్పగలరు? మైసూరు విద్యాశాఖా డైరెక్టరు మొన్నటి కన్నడ సాహిత్య పరిషత్తులో యిట్లు వచించెను. "స్వగృహమందు స్వచ్ఛముగ యర్థమగునట్లును మాతృభాషను సామాన్య ప్రజావళికి యందుబాటులో నుండునట్లును మన భాషను వాఙ్మయమును వృద్ధి చేయవలెను. మన ఉద్యమముల న్నింటి యొక్క తత్వార్థము పల్లెటూళ్ళలో నివసించుచున్న మన సోదర సోదరీ మణులకు తెలియజేయుట త్యావశ్యకమై యున్నది. విద్యావిధానంలో మాతృభాషలను పోషించు బాధ్యత విశేషముగ నున్నది". రెవరెండు ధర్ అను మహనీయుడు ఈ విధముగ మాతృభాష యొక్క యుత్కృష్టతను వర్ణించెను. "ప్రతి మానవునకు మాతృభాష అతి పవిత్రమై, వ్యక్తిగతమై, సన్నిహితమై అన్యుల కొసంగబడ జాలనిదైన ఆత్మీయమగు అమూల్య సంపద. ఈ హక్కును పరులు ధిక్కరించారు. దానిని ఎన్నడును విడనాడ కూడదు. మన మానసిక వికారము, విజ్ఞాన నైతిక ఆధ్యాత్మిక పరిణామము కును, మాతృభాషకును అవినాభావ సంబంధము. మన స్వాతంత్ర్యమునకు మాతృభాషా స్వాతంత్ర్యము మూలాధారము. భాషా స్వాతంత్ర్యమును తొలగించినచో మన స్వాతంత్ర్యము భగ్నమగును. పరిపూర్ణమగు మాతృభాషా ప్రచారము మానవుని ప్రధాన హక్కులలో పరిగణింపవలె".

ఆంధ్రుల సాంఘిక చరిత్ర రచనతో కేంద్రసాహిత్య అకాడమీ తొలి పురస్కారాన్ని అందుకొన్న తెలుగు వైతాళికుడు సురవరం ప్రతాపరెడ్డి పుట్టినరోజు మే 28ని తెలుగుజాతి వారసత్వ దినోత్సవంగా జరుపుకుంటున్నాం. మే 21న బుద్ధజయంతి. వీటికి తగిన వ్యాసాలతోపాటు తెలుగు సంచారకులాలకు చెంది కన్నడ సాహిత్యంలో పేరుగాంచిన కుప్పె నాగరాజుతో ముఖాముఖి...




## లోపలి పుటలలో....




ఫొటోలు : **తమ్మా శ్రీనివాసరెడ్డి**

కైసేత-ముఖచిత్రం : **కలిమిశ్రీ**

రేఖాచిత్రాలు : **బాలి** పకపకలు : **సరసి, కందికట్ల**

తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

మాసపత్రిక

• నుడి • నాడు • నెనరు

సంపాదకుడు డా॥ సామల రమేష్‌బాబు

శాలివాహన శకం 1938 : దుర్ముఖినామ సంవత్సర చైత్ర ***(ముత్తాపి)** బహుళ నవమి ఆదివారం మొదలు వైశాఖ ***(కొంగాపి)** బహుళ దశమి మంగళవారం వరకు

*** ముత్తాపి * కొంగాపి** : తెలుగు నెలలు


## చందా వివరాలు

| | | వ్యక్తులకు | సంస్థలకు | విదేశీయులకు |
|---|---|---|---|---|
| శాశ్వత చందా | : | రూ.5000 | రూ.7500 | -- |
| 5 సం॥ | : | రూ.1000 | రూ.1500 | 150 డాలర్లు |
| 3 సం॥ | : | రూ. 700 | రూ.1000 | 75 డాలర్లు |
| 1 సం॥ | : | రూ. 240 | రూ. 400 | 25 డాలర్లు |

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు డి.డి.ని **'అమ్మనుడి'** పేర పంపాలి. చెక్కు పంపేట్లయితే దయచేసి అదనంగా రు.30 లు చేర్చి పంపండి.

ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు NEFT / RTGS ద్వారా **'అమ్మనుడి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.

**AMMA NUDI - AXIS BANK, TENALI**

అక్కౌంట్ నెం. **915020010550189**

**IFSC Code : UTIB0000556**

ఆన్‌లైన్‌లో చందాను పంపినవారు, ఆ వెంటనే దయతో - చిరునామా, ఫోన్ నెం. తదితర వివరాలను జాబుద్వారాగాని, ఫోన్ మెసేజి ద్వారాగాని తెలుపగలరు.


చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలకు చిరునామా

**డా॥ సామల లక్ష్మణబాబు,** ప్రచురణకర్త, 'అమ్మనుడి'

8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు, **తెనాలి**

గుంటూరు జిల్లా - 522 211. ఫోన్ : 9440448244

ఇ-మెయిల్ : ammanudi@gmail.com


**చందాదారులు కోరినట్లయితే ఆన్‌లైన్‌లో కూడా పత్రికను పంప గలము. ఇందుకోసం మీ ఇ-మెయిల్ ఐడిని తప్పక తెలుపగలరు.**

### చందాదారులకు సూచనలు

1. చందా కాలం ముగింపు తేదీ - పత్రిక కవరుమీద మీ చిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
2. చందా పూర్తయ్యేందుకు ఒక నెల ముందే దయచేసి మీ చందాను పంపించండి.
3. మీ ఇంటి నెంబరుతో పూర్తి చిరునామాను, పిన్‌కోడ్ నెంబరుతో సహా తెలియపరచాలి. మీ ఫోన్ నెంబరును, వుంటే మీ మెయిల్ ఐడి ని తెలపాలి.
4. మీ చిరునామా మారినట్లయితే దయచేసి వెంటనే తెలియజేయండి.

## రచయితలకు సూచనలు

1. విభిన్న అంశాలపై వ్యాసాలను పంపవచ్చు. ముద్రణలో 1 నుండి 3 పుటలకు మించకుండా ఉండాలి. అన్నిరంగాలలో తెలుగువారి శ్రేయస్సుకు సంబంధించిన రచనలను పంపండి. విమర్శలు విషయం పైనే ఉండాలి గాని వ్యక్తులపై గురిపెట్టి చేయరాదు. అప్రజాస్వామిక రచనలను తీసుకోలేము. సరళమైన తెలుగులో వ్రాయాలి. 2. రచనలను యూనికోడ్‌లో గాని, అను ఫాంట్స్ లో గాని టైప్ చేసి లేదా ఎ4 సైజు కాగితంపై వ్రాసి, స్కాన్ చేసి ammanudi@gmail.com కు పంపాలి. లేదా కొరియర్ / రిజిష్టర్డ్ / సాధారణ పోస్టులో పంపవచ్చు. 3. రచనతోపాటు రచన స్వంతమేనని, ఇతర పత్రికలకు గాని, ఇంటర్నెట్ పత్రికలకు గాని పంపలేదని, పరిశీలనలో లేదని, ఇంతవరకు ఎక్కడా ప్రచురణ కాలేదని హామీపత్రాన్ని స్పష్టంగా వ్రాసి పంపాలి. పోస్టల్ చిరునామా, ఫోన్ నెం., ఇ-మెయిల్ కూడా ఇవ్వాలి. ఈ వివరాలు లేని రచనల్ని తీసుకోలేము. 4. మాకు పంపే రచన నకలును మీ వద్ద ఉంచుకోండి. ప్రచురణకు ఎంపిక చేయని రచనలను తిప్పి పంపడం వీలుకాదు.

## కథారచయితలకు, కవులకు విన్నపం

1. మాట్లాడుకొనే తెలుగులో వ్రాసిన కథల్ని **'నడుస్తున్న చరిత్ర'** ప్రచురించిన సంగతి చదువరులకు, రచయితలకు తెలిసిందే. ఈ సంప్రదాయాన్ని **'అమ్మనుడి'** పత్రిక కొనసాగిస్తున్నది. పాత్రల సంభాషణలు తప్పనిసరిగా మీ ప్రాంతంలో మాట్లాడుకొనే తెలుగు తీరులో ఉండాలి. కథాచిత్రణ కూడా మీ తెలుగు తీరులోనే ఉంటే మంచిది. కఠినమైన సమాసాలను ఉపయోగించవద్దు. తేలికైన తెలుగు మాటలు కుదరకపోతే జనం వాడుకలోని ఇతర ప్రాంతాల తెలుగు మాటల్ని వ్రాయవచ్చు. తప్పనిసరి అయితే తప్ప ఏ ఇతర భాషల మాటలను ఉపయోగించవద్దు. ఈ సూచనలే కవితలకూ వర్తిస్తాయి.

2. **'అమ్మనుడి'**లో ప్రచురణకు తీసుకొనే కథలు, కవితలు తెలుగువారి సామాజిక, భాషాసంస్కృతుల వికాసానికి తోడ్పడేవిగా ఉండాలి.

3. ప్రతినెలా ఒకటి లేక రెండు కథలను మాత్రమే ప్రచురించగలం. ముద్రణలో 2 లేక 3 పుటలకు మించకుండా ఉండేవాటినే తొలి ఎంపికకు తీసుకుంటాము. కవితలు 20 నుంచి 30 వరుస (లైను)లకు మించకూడదు. ప్రతినెలా 4 లేక 5 కవితలకు మించి పత్రికలో చోటుండదు.


రచనలు, ఉత్తరాలు పంపుటకు చిరునామా

**డాక్టర్ సామల రమేష్‌బాబు,**

సంపాదకుడు, **అమ్మనుడి,**

జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి,

మాచవరం, విజయవాడ-520004.

e-mail : ammanudi@gmail.com

దూరవాణి: కార్యాలయం : *0866-2439466*

సంపాదకుడు : *9848016136*

# తెలుగుజాతి (ట్రస్టు) విన్నపం

'నడుస్తున్న చరిత్ర' ప్రోత్సాహంతో ఆంధ్రప్రదేశ్‌లోనే కాక, పొరుగు రాష్ట్రాల్లోనూ నివసిస్తున్న తెలుగువారి శ్రేయస్సుకు, తెలుగు భాషోద్యమ నిర్మాణానికి కృషి జరిగింది. దక్షిణ భారతదేశమంతటా చిక్కగా అల్లుకొని, మొత్తం దేశంలోనేకాక, అనేక ఇతర దేశాల్లో కూడా భాషా సాంస్కృతిక మూలాలను విస్తరించుకొనివున్న తెలుగుజాతిలో చైతన్యాన్ని పెంపొందించి, వారిలో సంఘీభావాన్ని, భావసమైక్యతను బలపరచవలసిన అక్కరను గుర్తించిన కొందరు కార్యకర్తలు అందుకోసం పనిచేస్తున్నారు. అయితే, అనివార్య కారణాల వల్ల నడుస్తున్న చరిత్ర పత్రికను 2013 నవంబరు నుంచి నిలిపి వేయవలసి వచ్చింది. మళ్ళీ పత్రికను ప్రచురించడంతోపాటు తెలుగు నుడి, చరిత్ర, జాతి ముందడుగుకు అవసరమైన పుస్తకాల ప్రచురణను, ప్రచార కార్యక్రమాలను చేపట్టాలని తలపెట్టాము. ఇందుకోసం 'తెలుగుజాతి' పేరిట ఒక ట్రస్టును నమోదు చేయించాము. (92/2014). తెలుగు 'అమ్మనుడి"గా కలిగినవారు ఎక్కడ నివసిస్తున్నా, వారి శ్రేయస్సు కోసం ఈ సంస్థ పనిచేస్తుంది.

2015 మార్చి నుంచి **అమ్మనుడి** పత్రికను ప్రచురిస్తున్నాము. పుస్తకాల ప్రచురణ కార్యక్రమంలో భాగంగా తొలుత స.వెం.రమేశ్ వ్యాసాల సంకలనం **'ఎల్లలు లేని తెలుగు'**ను విడుదల చేశాము. త్వరలోనే మరికొన్ని ప్రత్యేకమైన పుస్తకాలను వెలువరించ బోతున్నాము. ఈ ట్రస్టును బలమైన పునాదులపై, తగినన్ని వనరులతో బలపరచటానికి మీ అందరి చేయూత కావాలి. ట్రస్టు నిర్మాణంలో తోడ్పడాలని విన్నవిస్తున్నాము.

**ట్రస్టుకు విరాళాలనిచ్చి తోడ్పడ గోరుతున్నాము.**

| | |
|---|---|
| రాజ పోషకులురు. 1,00,000/–లు | పోషకులు రు. 25,000/–లు |
| విశిష్ట పోషకులు రు. 50,000/–లు | ప్రోత్సాహకులు రు. 10,000/–లు |

దాత ఫొటోను, క్లుప్తంగా పరిచయాన్ని **'అమ్మనుడి'** పత్రికలో ప్రచురిస్తాము. పత్రికను, ట్రస్టు ప్రచురించే పుస్తకాలను ఉచితంగా పంపిస్తాము.

సొమ్మును చెక్ / డ్రాఫ్టుగా / ఆన్‌లైన్‌లో 'TELUGUJAATHI' పేర పంపాలి. యాక్సిస్ బ్యాంక్, సికిందరాబాదు.
అక్కౌంట్ నెం. 914020020387880 I.F.C.Code : UTIB0000068

**డా॥ సామల రమేష్‌బాబు,** మేనేజింగ్ ట్రస్టీ, 9848016136 ట్రస్టీలు : **పారుపల్లి కోదండరామయ్య** 9505298565, **డా॥వెన్నిసెట్టి సింగారావు** 9393015584, **స.వెం.రమేశ్** 8500548142, **సామల లక్ష్మణబాబు** 9440448244




తెలుగుజాతి ట్రస్టు ప్రచురణం
పుటలు : 254
వెల : రు.200/–లు

**మీరు చదివారా? చదవకపోతే, వెంటనే చదవండి.**

రెండు తెలుగు రాష్ట్రాలకు బయటి రాష్ట్రాలలోని తెలుగువారి గురించి ఎన్నో విశేషాలు తెలుసుకోండి. తెలుగు సమాజ పరిశోధకుడు, నిరంతర అన్వేషి **స.వెం.రమేశ్** వ్యాసాల సంపుటి.

**'ఎల్లలు లేని తెలుగు'**

పుస్తకం కావలసినవారు రు.200/–లను ఎం.ఓ గాని, బ్యాంక్ డ్రాఫ్టు గాని పంపాలి. సొమ్ము చేరిన వెంటనే పుస్తకాన్ని కొరియర్ ద్వారా గాని రిజిస్టర్డు బుక్‌పోస్టుగా గాని పంపగలము. చిరునామా, ఫోన్ నెంబరుతో సహా తెలియపరచాలి.

డా॥సామల లక్ష్మణబాబు, ట్రస్టీ, తెలుగుజాతి (ట్రస్టు), 8–386, జీవక భవన్, అంగలకుదురు, తెనాలి–522 211, ఫోన్ : 94404 48244

హైదరాబాదులో : నవోదయ బుక్‌హౌస్, ఆర్యసమాజ్ ఎదురు సందు,
కాచిగూడ క్రాస్‌రోడ్స్ దగ్గర, ఆర్ట్స్ అండ్ లెటర్స్, ఇందిరాపార్క్ క్రాస్‌రోడ్స్ వద్ద లభించును.

అమ్మనుడిపై నెనరు లేనివాడు
కన్నతల్లినీ, పుట్టిన నేలనీ ప్రేమించలేడు..

# భాషోద్యమానికి పనికొచ్చే కతలు కావాలి

## అమ్మనుడిలో ప్రచురించే ప్రతి కతకు రు.500/-లు నగదు కానుక

1. 'అమ్మనుడి' పత్రికలో ప్రతినెలా ఆయా ప్రాంతీయ తెలుగునుడి పలుకుబడిలోనే కతల్ని అచ్చు వేస్తున్నాం. వాటిని చదువరులు మెచ్చుకొంటున్నారు. వాటిలో కతల రచయితలకు చెందిన ప్రాంతాల తెలుగు పలుకులు ఇతర ప్రాంతాల వారికి తెలుస్తున్నాయి. ఇందుమూలంగా ఎన్నో సిసలైన తెలుగు మాటలు అందరకూ అందుతున్నాయి. ఈ కతల నుండి మేము కోరుకుంటున్నది అదే. సహజంగా ఆ కతల్లో అక్కడి బతుకు వెతలు వెల్లడవుతున్నాయి. పేరొందిన తెలుగు కతల రచయితలు వాటిని మెచ్చుకుంటున్నారు. అయితే ఈ కతలు అన్ని ప్రాంతాల నుండి అందడం లేదు. తెలంగాణ జిల్లాల నుండి, కళింగాంధ్ర, కోస్తా జిల్లాల నుండి ఈ విధమైన కతలు కావాలి. సంస్కృతం, ఆంగ్ల, హిందీ తదితర భాషల ప్రాబల్యం పుస్తకాల్లో, పరిపాలనలో పెరిగిపోతున్నందున ఎన్నో తెలుగు మాటలు బడుగు, సగటు తెలుగువారి గొంతుల్లోనే ఇంకిపోతున్నాయి. వాటిని వెలికి తీసే ప్రయత్నంలో భాగమే ఈ స్థానిక స్థాయి తెలుగు పలుకు తీరుల్లో రచించిన కతల్ని మేం ప్రచురిస్తున్నాం. వీటిలో చేయి తిరిగిన రచయితల కతల్నే గాక, కొత్త కొత్త రచయితల కతల్ని కూడా ప్రోత్సహిస్తున్నాము.
   అందినవాటిని బట్టి ఇలాంటి ఒక కతను ప్రతినెలా ప్రచురించడాన్ని కొనసాగిస్తాము. **ఇకపై జూన్ నెల నుండి ప్రతినెలా ఎంపికయిన కత రచయితకు రు.500/-లు నగదు కానుకగా పంపిస్తాము.**
2. ఇకపై ప్రతినెలా ఇలాంటి కతనే గాక, పత్రికాభాషలో/మీకు అలవాటైన భాషలోనే భాషోద్యమానికి పనికొచ్చే కతల్ని కూడా ప్రచురించాలని తలపెట్టాం.

ప్రభుత్వాల పట్టనితనం వల్ల, విధ్వంసకర విధానాల వల్ల తెలుగుజాతి క్రమక్రమంగా తమ ఉనికి గుర్తింపునే కోల్పోయే ప్రమాదం పొంచి వుంది. విద్యారంగంలో పరిపాలనలో ఈ భాషా విధ్వంసానికి, తద్వారా జాతి విధ్వంసానికి ప్రభుత్వాల చర్యలు దారి తీస్తున్నాయి. వీటిని కతల రూపంలో ప్రచారం చెయ్యాలి; ప్రశ్నించాలి. ప్రజల్లో ఈ అంశంపై చైతన్యం తేవాలి. వివరాల కోసం 'అమ్మనుడి' సంపాదకుణ్ణి సంప్రదించవచ్చు.

ఇంతేకాదు, భాషా రాష్ట్రాలు ఏర్పడినా, తెలుగు ప్రభుత్వాలు తెలుగును పట్టించుకోకపోవడమే గాక, తెలుగు వ్యతిరేక చర్యలకు పాల్పడడం వల్ల ప్రజల్లో భాషా స్వాభిమానం దెబ్బతింటున్నది. అమ్మనుడిని అన్నిరంగాల్లో వినియోగపరచనందువల్ల సహజంగానే ప్రజల చూపులో పరాధీనత చోటుచేసుకొంటూ, భావదాస్యంలోకి జారిపోతూ సొంతదనాన్ని కోల్పోతున్నారు. ప్రజా జీవన రంగంలో, సాంస్కృతిక రంగంలో ప్రచార ప్రసార మాధ్యమాల్లో ఈ పతనం కళ్ళకు కట్టినట్లు కన్పడుతున్నది. ఈ అంశాలను కతల్లో, కథనంలో, పాత్రల రూపకల్పనలో చూపిస్తూ చదివించగల కతల్ని – అవి ఏ రస ప్రధానంగా వున్నా– ప్రచురిస్తాము. అవి చదువరులను ఆలోచింపజేయాలి. ఆనందింపజేస్తూనే, నవ్విస్తూనే ఆలోచింపజేయాలి. అటువంటి కతల్ని రచయితల్నుంచి మేము కోరుతున్నాం. ఒక్క అదనపు సూచన : పాత్రల సంభాషణల్లో వీలైనంతవరకు పాత్రోచితభాషనే వాడండి. కథనంలో ఇతర భాషల మాటల్ని కాకుండా వీలైనంత వరకు జన తెలుగునే వాడండి. అక్కర వుంటేనే, తప్పక పోతేనే ఇతర భాషల మాటలకు చోటు!

ఎంపికైన ప్రతి కత రచయితకూ రు.500/-ల నగదు కానుకగా పంపుతాము.

3. **ప్రతి ఏటా ప్రచురించిన అన్ని కతల్లోనూ ఉత్తమమైన కథా రచయితకు ప్రత్యేక పురస్కారాన్ని ఉగాదికి ప్రకటిస్తాము.**

ఇంకా వివరాలకు, నేరుగా 'అమ్మనుడి' పత్రిక సంపాదకుడు
డా॥సామల రమేష్‌బాబు, 98480 16136కు ఫోన్ చేసి మాట్లాడండి.

చిరునామా : సంపాదకుడు, 'అమ్మనుడి' నెల పత్రిక, జి-2, వాయుపుత్ర రెసిడెన్సీ,
హిందీ కళాశాలవీధి, మాచవరం, విజయవాడ-520004.
e-mail : ammanudi@gmail.com

సంపుటి : 2 సంచిక : 3
అమ్మనుడి
మే 2016

సంపాదకీయం

# వైవిధ్యంతోనే తెలుగునుడి, జాతి ముందడుగు

ప్రకృతి నుండి మనిషి పొందిన వరం – మాట్లాడగలగడం. దానితో ఎక్కడి మానవ సమూహాలు అక్కడే తమదైన పలుకునూ, పలుకుతీరునూ, పెంపొందించుకొన్నాయి. ఇలా ప్రపంచంలో కొన్నివేల నుడులు ఉనికిలోకి వచ్చాయి. ఇవే అమ్మనుడులు లేదా మాతృభాషలు. మానవ నాగరికత వికసించడంతోపాటు ఈ నుడులు కూడా ఎదిగాయి. అనేక కారణాలవల్ల కొన్ని నుడులు కనుమరుగై పోగా, మరికొన్ని అత్యంత సమర్థంగా, శక్తివంతంగా ఎదిగాయి. అలా ఎదిగిన భాషలు భారత భూఖండంలో చాలా ఉన్నాయి. అనేక చీలికలు, పేలికల తర్వాత, మిగిలిన భారత దేశంలోనూ కొన్ని పెద్ద భాషలు, కొన్ని చిన్నభాషలు కుదురుకొన్నాయి. తమతోపాటు ఆ భాషాజాతులు తమ వారసత్వ జ్ఞానసంపదను, జీవన వైవిధ్యాన్ని పెంపొందించుకున్నాయి.

మనుషుల్ని కలిపివుంచగల శక్తి ప్రేమకు మాత్రమే ఉంది. విడదీసి నాశనం చెయ్యగలశక్తి ద్వేషానికి ఉంది. ఈ రెండింటికీ మధ్యన ఉండే సున్నితమైన అంశం – సహనం. సహనశీలతను పెంపొందించుకోవడంతో ప్రేమానుబంధానికి దారి ఏర్పడుతుంది. సహకారం, సమైక్యత, పురోగతి సాధ్యపడతాయి. ఇదంతా వారి పలుకుపైనా, పలుకు తీరుపైనా ఆధారపడివుంటుంది. అందుకే భాషకు మనుషుల్ని కలిపివుంచే శక్తి ఎంత ఉందో విడదీసే శక్తి కూడా అంతే ఉంది. ఇందుకు నడిచిన, నడుస్తున్న చరిత్రే సాక్ష్యంగా నిలుస్తుంది.

మన నేలమీద ఎంతో ప్రాచీనకాలం నుండి విలసిల్లిన జనభాష తెనుగు (తెలుగు). తెలుగు జనులు విస్తరించే కొద్దీ వారి భాషావికాసంలోనూ, బతుకు తీరుల్లోనూఎంతో వైవిధ్యం కూడా చోటు చేసుకుంది. అనేక ప్రత్యేకతలను కలిగివున్న వివిధ ప్రాంతాల తెలుగు జనులను నాటికీ నేటికీ కలిపి వుంచుతున్నది– తెలుగు మౌలికత. రాజకీయ చారిత్రక పరిణామాలవల్ల ఒకే పాలనలోవున్నా విడిగావున్నా ఆ తెలుగు మౌలికతే అందరికీ ఒక జాతిగా గుర్తింపు నిచ్చింది. సహజంగా వచ్చిన ఈ జాతిభావన ఎన్ని ఆటుపోటులను తట్టుకొని అయినా నిలిచే వుంది.

తెలుగు జాతి అన్నంతమాత్రాన వీళ్ళంతా కట్టగట్టుకొని ఒకే రాష్ట్రంలో ఒకే పాలనా ప్రాంతంలో ఉంటారనే / ఉండాలనే నియమం ఏమీ లేదు. కలిసి ఒకే పాలనా వ్యవస్థలో వుండటం, ఉండకపోవటం అనేది ఒకప్పుడు రాజరిక, జమీందారీ పెత్తనంలోని అంశం కాగా ఇప్పుడది ఒక రాజ్యాంగ బద్ధమైన పార్లమెంటరీ ప్రజాస్వామిక వ్యవస్థలో నిర్ణయమయ్యే అంశం. స్వాతంత్ర్యానంతరం భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుకు కారణం ఒక భాష మాట్లాడేవారంతా ఒకే పాలనా రాష్ట్రంలో వుంటే వారి భాషలోనే పరిపాలనసాగి, ప్రజలు మరింత చైతన్యవంతులై, ప్రజాస్వామ్యం మూడు పూవులు, ఆరుకాయలుగా వర్ధిల్లుతుందని, ఒక జాతిగా వారు తమకు తోచినట్లు సర్వతోముఖాభివృద్ధిని సాధించవచ్చునని ఆశించడమే. బ్రిటిష్ వలస పాలన నుండి విముక్తం అయిన దశలో భాషాజాతులు కూడా స్వేచ్ఛను అభివృద్ధిని కోరుకోవడం తప్పుకాదు. ఆ ఉద్దేశ్యంతోపాటు, రాజకీయ స్వార్థాలు, తొందరపాటు నిర్ణయాలు, చారిత్రక అవగాహనలేమి, ఆధిపత్య స్వభావాన్ని వంటపట్టించుకొన్న పెత్తందారీ రాజకీయాలు భాషారాష్ట్రాల ఏర్పాటును అడ్డగోలుగా ఉపయోగించుకొన్నాయి. దీనివల్ల తీవ్రంగా నష్టపోయింది తెలుగుజాతి.

నైజాం పాలనలోవున్న తెలుగువారి బానిసత్వ బ్రతుకు ఒక పక్కన కొనసాగుతుండగా, దక్షిణాంధ్రులను (నేటి తమిళనాడులోని తెలుగువారిని) వదులుకొని, తమచేతికి పాలనను చిక్కించుకోవాలన్న కోస్తాంధ్రుల రాజకీయ అవసరం నాటి ఆంధ్రరాష్ట్ర ఉద్యమానికి దారితీసింది. ఆ ఉద్యమఫలితంగా – మన సంస్కృతీ ప్రతిరూపాలను, చారిత్రక కర్మభూములను చేజేతులా జారవిడుచుకొని, తోటి ప్రజలను తమిళరాజకీయాలకు బలిపెట్టి, కుదించుకుపోయిన ఆంధ్రరాష్ట్రాన్ని సాధించుకున్నాం. ఆ తర్వాత జరిగిందేమిటి? నిజాం రాష్ట్ర ప్రజలు బానిసత్వం నుండి విముక్తి అయి, తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు అయిన తర్వాత ఆంధ్రరాష్ట్రాన్నీ, తెలంగాణనూ కలిపి ఆంధ్రప్రదేశ్‌ను ఏర్పరచుకున్నాం. 60 ఏళ్లు సమైక్యరాష్ట్రంగాసాగి, తుదకు రాజకీయ ద్వేషాలకు, ఉద్యమాలకు దారితీసి, మళ్ళీ తెలంగాణ, ఆంధ్రగా విడిపోయాం.

ఒక భాషాజాతి ఎందుకు ఇలా చీలిపోయింది? భాష ఎందుకని వీరిని కలిపి వుంచలేక పోయింది ? ఆంధ్రరాష్ట్రం

# సంపాదకీయం

ఏర్పాటువల్లగాని, ఆంధ్రప్రదేశ్ ఏర్పాటువల్లగాని, తెలుగు ఏమీ బలపడలేదు. ప్రజల భాషలో పాలన చెయ్యాలనే ప్రజాస్వామ్య సూత్రం కాలరాచి వేయబడింది. అమ్మనుడిలోనే అనంతవిజ్ఞానాన్ని పొందాలనే శాస్త్రీయ, హేతుబద్ధ, మానవీయ అంశం మరుగున పడిపోయింది. మనిషికీ, మాతృభాషకు ఉన్న సంబంధం, భాషా జాతుల వికాసానికీ, వారి భాషకీ ఉన్న అనుబంధం అవహేళనకు గురి అవుతున్నది. మనిషి తన స్వంతదనాన్ని కోల్పోయి పరాధీనుడై పోతున్నాడు.

ఇందుకు కారణమేమిటో మనం ఆలోచించాలి. అన్ని ప్రాంతాల తెలుగువారిలో అంతఃసూత్రంగా భాషామౌలికత ఉన్నప్పటికీ, దానిలోవున్న వైవిధ్యం, ప్రజల పలుకులోని స్వంతదనం నిర్లక్ష్యం చెయ్యబడింది. ఈ నిచ్చెనమెట్ల సమాజంలోని, కులవ్యవస్థలోని అసమంజసత, అమానవీయత ప్రజలను అన్నివిధాలా విభజిస్తూ పెత్తందారీ రాజకీయాల క్రింద నలిపివేశాయి. జాతిని కలిపి ఉంచాల్సిన సహనం, ప్రేమ, కనుమరుగయ్యాయి. అలాంటి పరిస్థితుల్లో ప్రజలను భాష కలిపి వుంచలేకపోయింది. ప్రత్యేకించి ఈ వైరుధ్యాలకు, పెత్తందారీ తనానికి అన్ని స్థాయిల్లోనూ తెలుగు భాష, తెలుగుజాతి బలైపోయాయి. తెలుగును తెలుగుగా ఎన్నడూ ఎదగనివ్వలేదు. తెలుగులో మాట్లాడితే ఎగతాళి చేయడంఅంటే తెలుగుతనాన్నే అవమానించడం నిరాటంకంగా సాగింది. జాతి ఆత్మన్యూనతకు లోనయింది. సంస్కృతం పెత్తనం హద్దులుమీరి, సంస్కృతంతోనే తెలుగు బ్రతుకుతుందనే ప్రచారం తరతరాలుగా జరుగుతూనే ఉంది. మన భాషాపండితులు, రచయితలు ఆ మూసలో తయారవడంతో ఇప్పుడు సరైన తెలుగులో వ్రాయలేని, ఆలోచించలేని, ఏది సంస్కృతమో ఏది తెలుగో చెప్పలేని స్థితి వచ్చేసింది. తెలుగమ్మ ఒడిలో కుదురుకున్న సంస్కృతం, ఆమె సాంస్కృతిక సామ్రాజ్యాన్ని ఆక్రమించింది. చివరికి తెలుగంటే సంస్కృతాంధ్రమే అనే భావన నిలబడిపోయింది. ఇప్పుడు తెలుగు క్రియాపదాలపై, నుడి కట్టుపై ఆధారపడి ఒక్క తెలుగు మాటను కూడా ముందుకు తేలేని దురవస్థలో మన బోధన, పాలన వ్యవస్థలున్నాయి. కొత్తమాట కావాలంటే సంస్కృతంవైపో, హిందీవైపో చూడడం అలవాటయిపోయింది. అంటే తెలుగుజాతి తన భాషనుకూడా కోల్పోతున్నది. ఏ భాషా మౌలికత ఆధారంగా తెలుగుజాతిగా మనం గుర్తింపబడ్డామో ఇప్పుడు దాన్నే కోల్పోతున్నాము. ఎవరికివారు తమభాష గొప్పదనుకొనే స్థితికి వివిధ ప్రాంతాల తెలుగు ప్రజలు చేరి ఉద్వేగాలకు లోనవుతున్నారు తప్ప, తమ ప్రత్యేకతలను కాపాడుకొంటూనే తమదైన తెలుగును అభివృద్ధి చేద్దామని అటు తెలంగాణ, ఇటు ఆంధ్రప్రదేశ్ రెండు ప్రభుత్వాలూ అనుకోవడం లేదు. ఇన్నేళ్ళుగా శక్తిమంతమైన ప్రజల భాష తెలుగును విధ్వంసం చేస్తూ, అంతర్జాతీయ స్థాయిని అందుకోవాలంటే ఆంగ్లమే దిక్కు అంటూ ఉభయ ప్రాంతాల పాలకులు, మేధావులు నైతికంగా దివాళాకోరు స్థితికి జారుకొన్నారు.

ఇప్పుడు మనకున్నవి రెండు తెలుగు రాష్ట్రాలుమాత్రమే కాదు. తమిళనాడులో ఉన్న 42 శాతం తెలుగువారిలో తెలుగుతనాన్ని పెంచుకోవడానికి ఉద్యమస్థాయిలో ప్రయత్నం జరుగుతున్నది. తెలుగువారి ఆత్మాభిమానాన్ని వ్యక్తిత్వాన్ని రక్షించుకోవడానికి భాషను కాపాడుకోవలసిందే అనే పట్టుదల అక్కడి తెలుగువారిలో చోటు చేసుకుంటున్నది. అక్కడ రాజకీయాలను ప్రభావితం చెయ్యగల జనసంఖ్య వున్నా తెలుగువారు ఇంతవరకూ ఆకోణంలో ఆలోచించలేదు. ఇప్పుడు తమలోని కులభేదాలకు అతీతంగా భాషా మౌలికత సూత్రాన్ని ఆధారంగా చేసుకొని తమ శక్తిని రాజకీయ రంగంలో నిరూపించుకోవడానికి సిద్ధపడుతున్నారు. కర్ణాటక, ఒరిస్సా, ఛత్తీస్‌ఘడ్, మహారాష్ట్ర వంటి రాష్ట్రాలలోని తెలుగువారు ఇంట్లో మట్లాడుకోవడమే తప్ప, తెలుగును రాయగల, చదువగల శక్తిని ఏనాడో కోల్పోయారు.

తెలుగు అంటే పాఠ్య పుస్తకాల్లో బోధిస్తున్న సంస్కృతాంధ్రాన్నే చదవాలనే ఆలోచన నుండి మనం బయటకు రావాలి. వివిధ ప్రాంతాల పలుకుబడులను, పలుకుతీరులనూ గౌరవించాలి. అవన్నీ అసలైన తెలుగు సంపదలని తెలుసుకోవాలి. తెలుగు మూలసూత్రాలపై చూపునిలిపి భాషను పెంపొందించుకోవడానికి ఇదే మూలసూత్రం. ఇతర భాషలనుంచి మాటలను తీసుకోకూడదని తెలివి వున్నవారెవరూ అనరు. తెలుగు మూలసూత్రాలపై ఆధారపడి ఇతర భాషల మాటలను తీసుకోవాలి. అదీ మనవైన మాటలు లేనిచోట మాత్రమే. ఈ మౌలికాంశం మీద ఆధారపడి మనం మన భాషతో ఎదగాలి.

తెలుగుజాతి విశాల భూభాగాల్లో విస్తరించి ఉన్నందున ప్రాంతాలవారీగా ఆవైవిధ్యం భాషలో వ్యక్తమవుతుంది. అందువల్ల తెలుగు నుడికూడా ప్రాంతాలపేర్లతో ప్రత్యేకగుర్తింపు కోసం ఆరాటపడటంలో తప్పులేదు. తెలంగాణ తెలుగు అన్నా, కోస్తాంధ్ర తెలుగు అన్నా, రాయలసీమ తెలుగు అన్నా, తెన్నాటి తెలుగు అన్నా – అంతా తెలుగే. సహనం, ప్రేమ, పరస్పర అభివృద్ధిని కోరుకుంటే – ఈ వైవిధ్యమంతా తెలుగు భాషను, జాతిని బలోపేతం చేసుకోవడానికి తోడ్పడుతుంది.

సామల రమేష్‌బాబు

**1-5-2016**

-ప్రొ॥ఎస్వీ.సత్యనారాయణ

## తెలుగుజాతి వారసత్వ దినోత్సవం : మే 28

# జనచైతన్యదీపం- సురవరం

*"భాండాగారమె నడచిన -పగిది నడుచు నాతడు*
*గత చరిత్ర రూపొందిన- కరణి దోచునాతడు*
*శిఖరంలా శిరస్సెత్తి- నిఖరంగా నిలచినట్టి*
*భాషా భామా రమణుడు - ప్రతాప దీపధ్వజుండు"*

అంటూ ప్రజాకవి దాశరథి నివాళులందుకున్న తెలుగు ప్రజల సాంఘిక చైతన్య సంకేతం, జనచైతన్య దీపం-సురవరం ప్రతాపరెడ్డి.

1896 మే 28న అప్పటి గద్వాల సంస్థానానికి ముఖ్యకేంద్రంగా వున్న 'బోరవెల్లి' గ్రామంలో శ్రీమతి రంగమ్మ-శ్రీ సురవరం నారాయణ రెడ్డి దంపతులకు పుట్టిన బిడ్డ ప్రతాపరెడ్డి. ఏడు సంవత్సరాల వయసు దాకా తమ స్వగ్రామంలోనే తండ్రిగారి శిక్షణలో విద్యాబుద్ధులు నేర్చు కున్నాడు. చిన్నప్పట్నుంచీ తెలుగుభాష, సాహిత్యం, సామాజిక శాస్త్రా లను అధ్యయనం చేయడం ప్రారంభించాడు. పినతండ్రి రామకృష్ణారెడ్డి గారి ప్రోత్సాహంతో బి.ఏ.బి.ఎల్ పూర్తి చేశాడు. ఇంటర్ విద్యార్థిగా వున్న రోజుల్లోనే (1915) బూత్బీ రచించిన 'ఇన్‌ఫ్రీడమ్ స్ట్రగుల్') ఆంగ్ల నవలను తెలుగులోకి అనువదించాడు. విద్యార్థి దశలోనే సంస్కృత పురాణ, ఇతిహాసాలను, శాస్త్ర మీమాంసాదులనూ పఠిం చాడు. తెలుగు సాహిత్య గ్రంథాలను విశ్లేషణాదృష్టితో అధ్యయనం చేశాడు. ప్రతాపరెడ్డి తెలివితేటలు న్యాయవాద వృత్తికి పరిమితం కాకూడదని భావించిన కొత్వాల్ వెంకట్రామిరెడ్డి, ఇతనికి రెడ్డి హాస్టల్ నిర్వహణ బాధ్యతలు అప్పగించాడు. తర్వాత మాడపాటి హనుమంత రావు, రాజా బహద్దూర్ వెంకట్రామిరెడ్డి ప్రారంభించిన 'గోలకొండ పత్రిక' సంపాదక బాధ్యతలను సురవరం ప్రతాపరెడ్డికి అప్పగించారు. సంపాదకుడిగా, ప్రూఫ్‌రీడర్‌గా, గుమస్తాగా, కాగితాలు మడతపెట్టే జవానుగా సకల బాధ్యతలు నిర్వర్తిస్తూ ప్రతాపరెడ్డి తన జీవిత సర్వ స్వాన్నీ గోలకొండ పత్రిక నిర్వహణకు అంకితం చేశాడు. తెలుగు భాషపట్ల అభినివేశాన్నీ, ఆసక్తినీ పెంచే విధంగా పత్రికను నడిపాడు. ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆదిరాజు వీరభద్రరావు, చెలమచెర్ల మొదలైన ఎందరో సాహితీవేత్తలు ఈ పత్రిక ద్వారా రూపొందారు.

శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం, వేమనాంధ్ర భాషానిల యంతో పాటు నిజామాంధ్ర ప్రాంతంలోని మారుమూల గ్రామాల్లోని గ్రంథాలయాల అభివృద్ధికి సురవరం కృషి చేశాడు. ఎన్నో గ్రంథాలయ మహాసభలకు అధ్యక్షత వహించడంతో పాటు గ్రంథాలయోద్యమ సంఘానికి ఉపాధ్యక్షుడిగా బాధ్యతలు నిర్వహించాడు.

ఆయుర్వేద విద్యాలయం, సంస్కృత విద్యాలయం, ఆంధ్ర విద్యా లయం వంటి విద్యాసంస్థల ఆవిర్భావానికి తోడ్పడ్డాడు. స్త్రీ విద్యను, స్త్రీ జనాభ్యుదయానికి పాటుపడ్డాడు. హనుమకొండలోని పద్మాక్షి దేవాలయం, సిద్ధేశ్వరాలయం, సహస్ర స్తంభ దేవాలయం, ఓరుగల్లు కోటలను సందర్శించి అనేక చారిత్రాకాంశాలను వెలికి తీసి తెలుగు ప్రజలకు అందించాడు.



ప్రాథమిక సౌకర్యాలు లేని ప్రతికూల పరిస్థితుల్లోనే ప్రామాణిక పరిశోధన గ్రంథాలు రూపొందించాడు. 1934 లోనే 'హిందువుల పండుగలు' శీర్షికన దాదాపు యాభై ఐదు పండుగల పూర్వాపరాలను సోపపత్తికంగా వివరించాడు. రామాయణంలోని అనేక సూక్ష్మాతి సూక్ష్మఅంశాలను, కథా కథనంలోని విశేషాలను చారిత్రక దృష్టితో వివేచించిన ప్రతాపరెడ్డి 'రామాయణ విశేషములు' గ్రంథాన్ని రచిం చాడు. 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' గ్రంథం నాటికీ, నేటికీ ప్రామాణి కమే. నిజామాంధ్ర ప్రాంతంలోని 354 మంది ఆనాటి సమకాలీన కవుల రచనలనూ, 183 మంది ప్రాచీన కవుల జాబితాను సేకరించి 'గోలకొండ కవుల సంచిక'ను వెలువరించాడు. పది జిల్లాలకు, 16 కులాలకు, నాలుగు మతాలకు, పన్నెండుమంది మహిళలకు, రెండు భాషలకు ఈ సంచికలో సురవరం స్థానం కల్పించాడు.

చారిత్రక పరిశోధకుడిగా, పత్రిక సంపాదకుడిగా, విమర్శకుడిగా గుర్తింపునూ, గౌరవాన్నీ పొందిన ప్రతాపరెడ్డి మౌలికంగా ఒక సృజ నాత్మక రచయిత. చక్కటి భావుకత ఉట్టిపడే కవిత్వాన్నీ, ప్రజల జీవితాలకు అద్దం పట్టే కథలనూ, సంభాషణా చాతుర్యం గల 'భక్త తుకారాం', 'ఉచ్చల విషాదము' వంటి నాటకాలనూ, 'శుద్ధాంత కాంత' నవలనూ రచించాడు.

మల్లంపల్లి సోమశేఖరశర్మగారి మాటల్లో...'శ్రీ సురవరం ప్రతాపరెడ్డి గారు గొప్ప మేధోసంపన్నులు. వాఙ్మయ రంగంలో ఆయన ప్రతిభ, ప్రజ్ఞ కానరాని పొలమే లేదు. విమర్శకులలో ఆయన గొప్ప

విమర్శకుడు. కవులలో కవి, పండితులో పండితుడు. రాజకీయవేత్తలలో రాజకీయవేత్త. పత్రికారచయితలలో పత్రికా రచయిత. నాటక కర్తలలో నాటకకర్త. వీటి అన్నింటినీ మించి పరిశోధకులలో మహాపరిశోధకుడు. దేశాభిమానులలో మహా దేశాభిమాని. సహృదయులలో సహృదయుడు'. ఇంతటి బహుముఖ ప్రజ్ఞావంతుడి జన్మదినోత్సవాన్ని 'తెలుగుజాతి వారసత్వ దినోత్సవం'గా జరుపుకుంటున్నాం.

నిరంతర అధ్యయనశీలి, నిర్విరామ పరిశోధకుడు, నిత్య సాహిత్య కృషీవలుడు సురవరం ప్రతాపరెడ్డి యాభై ఏడు వత్సరాల వయసులోనే 1953 ఆగస్టు 25న అస్తమించాడు.

'నీ మాట బంగారు మూటగా, నీ సత్యం విమర్శనా సాహిత్యంగా, నీ వ్రాత ముద్దులకైతగా, నివాళించావు ఆంధ్రభారతికి అతి పవిత్రమైన నీ చరిత్రం, ఆంధ్రులందరికీ ఆదర్శప్రాయం' అంటూ శ్రీ వేముగంటి నరసింహాచార్య 'అశ్రుపూజ' అర్పించారు.

నేడు ఆ మహామనిషి మనమధ్య లేడు. అతడి ఆదర్శాలున్నాయి, లక్ష్యాలున్నాయి. అతడి జీవితం స్ఫూర్తిదాయకం. అతడి వ్యక్తిత్వం ఆదర్శప్రాయం.

అతడి పరిశోధనాసక్తి అనుసరణీయం. అతడి సాహిత్యం ప్రాతః స్మరణీయం.

# మన తాత ముత్తాతలు

**ఆంధ్రప్రభ సంపాదకీయం** (**1945 నవంబర్ 22, మంగళవారం**)

ఏ రాజు ఎప్పుడు పాలించాడు? ఎక్కడ? ఏ విధంగా? అతడు ఎన్ని యుద్ధాలను చేశాడు? ఎవరెవరిని గెలిచాడు? లేదా, ఎవరి చేతిలో ఓడిపోయాడు? అతడెందరిని వివాహమాడాడు? మరెందరిని ఉంపుడుగత్తెలను చేసుకున్నాడు? బహుభార్యాత్వపు సాధక బాధకాలను ఏ విధంగా ఎదుర్కొన్నాడు– ఇదే ఇప్పటి వరకు మనచరిత్ర.

"నా విష్ణుః పృథివీపతిః" అని విశ్వసించబడినంతవరకు రాజుల రాజాస్థానాల కథలే, రాణుల, రాణి వాసాల గాథలే చరిత్ర కావడం ఎవ్వరికీ ఎబ్బెట్టుగా తోచలేదు కూడా.

కాని, రాజు దైవాంశసంభూతుడన్న గుడ్డి నమ్మకం రోజులుపోయాయి. చివరికి జపానులో కూడా (మొన్నటి యుద్ధము తర్వాత) హిరోహిటో సయితం సాక్షాత్తూ అపరబ్రహ్మ స్వరూపుడన్న మూఢవిశ్వాస ప్రాబల్యం సడలింది.

రాజుల రోజులు పోయినందున, ప్రజలే రాజులౌతున్నందున, ఇక చరిత్ర స్వరూపమే మారిపోవాలి. ఇక మీదట చరిత్రకారులు మనకు చెప్పవలసింది ముసలిమగడు రాజరాజనరేంద్రుని పడుచు పెండ్లాం చిత్రాంగి–సవతి కుమారునిపై కన్నువేసిందో, లేదో–ఈ సంగతి కాదు. ప్రతాపరుద్రుని ఉంపుడుకత్తె (ప్రతాపరుద్రుని ఉంపుడుకత్తె చరిత్రను "ఆడుదురు, నాటకంబుగ నవనిలోన" అన్నాడు క్రీడాభిరామకర్త) విషయమై కాదు. కృష్ణదేవరాయల దేవేరుల విషయమై కాదు; ఆ దేవేరుల మధ్య వివాదాలను గురించి అంతకంటే కాదు.

ఈ ప్రజాయుగంలో వెలువడవలసిన ప్రజా చరిత్రలు. వీటికే మరొక పేరు 'సాంఘిక చరిత్రలు'.

నామమాత్రానికి మనదేశంపై ప్రస్తుతం బ్రిటీషు రాజుకు మిగిలివున్న పెద్దరికం కూడా తొలగిపోనున్న ఈ సమయంలో కొన్ని శతాబ్దాల తర్వాత ఆంధ్రులకు తిరిగి ఒక ప్రత్యేక ప్రభుత్వం ఏర్పడనున్న ఈ సమయంలో ఇట్టి ఒక చరిత్ర గ్రంథం వలువడ్డం ఎంతైనా సమయోచితం.

దాదాపు వెయ్యి సంవత్సరాల పాటు (క్రీస్తుశంక 1050 నుండి 1907 వరకు) తెలుగుజాతి ఏ విధంగా బ్రతికిందో ఈ చరిత్ర కళ్ళకు కట్టినట్లు చిత్రిస్తున్నది. మన తాత, ముత్తాత, లెట్టివారై యుండిరో, మన అవ్వలు ఎట్టి సొమ్ములు దాల్చిరో, యెట్టి అలంకరణములతో నుండిరో మన పూర్వులే దేవరలను గొలిచిరో, ఏ విశ్వాసాలు కలిగియుండిరో, ఏ యాటపాటలతో వినోదించిరో, దొంగలు, దొరలు దోపిడీలు చేసినప్పుడు క్షామాదీతి బాధలు కలిగినపుడెటుల రక్షణము చేసుకొనిరో, ఏ జాడ్యాలకే చికిత్సలు పొందిరో, ఎట్టి కళలయందు ప్రీతి కలవారై యుండిరో, ఏదే దేశాలతో వ్యాపారాలు చేసిరో" –ఇట్టి అనేక విషయాలు ఈ చరిత్రలో వర్ణితం.

తప్పెట్లు, కాహళములు, కాలిబొమ్మలు, దమాయీలు, బూరలు, శంఖములు, సన్నాయిలు, డోళ్ళు, రుంజలు, చ చేగంటలు–ఇవి చేరగా ఏర్పడినదే మన పూర్వీకుల మిలటరీ బ్యాండ్.

తుమ్మెద పదాలు, పర్వపదాలు, శంకర పదాలు, నివాళి పదాలు, వాలేశుపదాలు, వెన్నెల పదాలు, రోకటి పాటలు, బొమ్మలాటలు, కోలాటం, గొండ్లి, చిందు, జక్కిణి, పేరణీ, ప్రేంఖణము, ఉప్పెన పట్టెలాట, బొంగరాలాట, కోళ్ళపందెము, పులిజూదం, పచ్చీసు, సిడి–ఇవి మన పూర్వీకుల గాన నృత్య క్రీడావినోదాలు.

ముక్కర, నెత్తిబిళ్ళలు, దండెకడెములు వంకీలు, జోమాల దండలు, తాటంకములు, ముత్యాల కమ్మలు, కాంచీ నూపురకంకణములు, త్రిసరములు, మొరవంక కడియములు, వడ్డాణము ముక్కుసత్తు– ఇవి మన అవ్వలు పెట్టుకొన్ననగలలో కొన్ని మాత్రం.

వెంజావళి, జయరంజి, మంచుపుంజము, మణికట్టు, భూతిలకము, శ్రీవన్నిమ, చీని, మహాచీని, పట్టుపొంబట్టు, నెరపట్టు, వెలిపట్టు, పచ్చనిపట్టు, నేత్రంపట్టు, సంకుపట్టు, భావజతిలకము, రాయశేఖరం రాయవల్లభం, వాయుమేఘం, గజనాళం, గండవరం, వీణావళి–ఇట్టివన్నీ ఒకనాడు మన తెలుగునాట వేయబడిన వస్త్రవిశేషాలు.

ఒకనాడు మన తెనుగుసీమలో ప్రతి బ్రాహ్మణ గృహంలో ఒక గ్రంథాలయం ఉండేది. ధనికులు తివాసీలపై కూర్చొనేవారు. ''బురునీసు దుప్పటులు కప్పుకునేవారు. అప్పులవారిని 'పొగడదండల'తో శిక్షించేవారు. దొంగలను పట్టి "బొండకొయ్యలో"

వుంచేవారు. రెండవ భార్యను చేసుకుంటే ఆమెకు 'సవతి కడెము' తొడిగేవారు. యుద్ధంలో ఓడినవారు 'ధర్మధార' పట్టేవారు; తాంబూలం వేసుకోవటానికి 'పాన్‌దానులు' ఉపయోగించేవారు; రైతులు ఏరువాకన, "వింతటి పండుగను" చేసుకొనేవారు; కరణాలు 'వహి' అనే పుస్తకాలలో లెక్కలను వ్రాస్తుండేవారు. పీనుగులను కాల్చిన బూడిదమచ్చు మందుగా పనిచేస్తుందని దొంగలు నమ్ముతుండేవారు. ఈ రీతిగా శ్రీ ప్రతాపరెడ్డి గారు వ్రాసిన 'సాంఘిక చరిత్ర' మన పూర్వీకుల జీవిత విధానాన్ని గురించి చెప్పే విశేషాలకు అంతేలేదు.

ఈ చరిత్ర దాదాపు ఒక జీవిత కాలపు పరిశోధనా ముక్తాఫలం. సాంఘిక చరిత్రకు పనికివచ్చే గ్రంథాల సంఖ్య పరిమితమైనా, ఇందుకు శాసనాలుపయోగం నామమాత్రమైనా, ఆచార వ్యవహారాలకు, క్రీడా వినోదాలకు సంబంధించిన అనేక ప్రాంతీయ పదాల విషయంలోను, పారిభాషిక పదాల విషయంలోను నిఘంటుకారులు "ఒక భక్ష్యవిశేషం", "ఒక క్రీడా విశేషం" అని అర్థం చెప్పి నిరర్థకుల వలె వ్యవహరించినా, ఇట్టి ప్రతిబంధకాలన్నింటిని అధిగమించి, ఆంధ్రజాతి చరిత్రను ప్రతిభా పూర్వకంగా చిత్రించిన శ్రీ రెడ్డిగారు సంస్తవనీయులు.

ఆంధ్రజాతి గత చరిత్రను తెలుసుకొనడానికి ఉపకరించడమే కాక, ఏయే కారణాలు దాని అభ్యుదయానికి తోడ్పడినవో మరేవేవి దాని పతనానికి దోహదమిచ్చినవో సందర్భానుసారంగా వివరిస్తున్న ఈ మహద్గ్రంథం ఆంధ్రులకు భావికర్తవ్య పథాన్ని నిర్దేశిస్తున్నది కూడా.

"నాకీ యీ గ్రంథము తృప్తినొసగలేదు' అని విచారం శ్రీ రెడ్డి గారికి కూడదు. సకలాంధ్రావనికి వారి రచన అపారతృప్తి నివ్వగలదు.

**త**న పరిశోధనాత్మను పిండి "ఆంధ్రుల
సాంఘిక చరిత"గా సంతరించె
తన నేల సారస్వతశ్రీల "గోల్కొండ
కవుల సంచిక"లోన నవధరించె
తన కవితా చణత్వమును "హంవీర
సంభ" కావ్య ఖండాన పాదుకొల్పె
తన రాజకీయ నైపుణమును పత్రికా
సంపాదకత్వాన చాటిచూపె
తన ప్రజాహిత మని గ్రంథాలయోద్య
మ ప్రసారమ్ము కొరకు ధామమ్ము జేసె;
మా తెలంగాణమును సంభ్రమము గొల్పె
తనదు సర్వమునొడ్డి ప్రతాపరెడ్డి.

**–సినారె.**

**"త**నదు జీవితమంత ఇంధనము సేసి
ఈ ప్రజాభ్యుదయేష్టికి నిచ్చినాడు
తనదు కలమును నా యుధమ్ముగ సేసి
దౌష్ట్యగళనాళముల నెల్ల తిరిగినాడు"

**–శ్రీ సంపత్కుమార**

**"అ**ఖిల విద్యల సమాహార మాతడు విజ్ఞానఖని
మూగవడిన తెలంగాణ–మూల్గిన తొలినాటి ధ్వని.

**–దాశరథి**



-స.వెం.రమేశ్

# తెలుగులో తెలుగు నుడికట్టు

ఒక నుడి కట్టుబాటునూ అందుకు చెందిన తీరు తెన్నులనూ వివరించేది వ్యాకరణశాస్త్రం. దాన్నే 'నుడికట్టు' అని తెలుగులో అనుకొందాం. అసలు, ఒక నుడికి చెందిన వ్యాకరణాన్ని మరొక భాషలో వ్రాయడమెందుకు? తెలుగు వ్యాకరణాన్ని సంస్కృతీకరించి, తెలుగుకొక మర్యాదను తేవడానికే ఆనాటి పండితులు తమదైన శైలిలో కష్టపడ్డారనుకుందాం. ఇప్పుడా చర్చ అక్కరలేదు. కాని కొందరు తెలివిపరులు అడుగుతున్నట్లు - ఏం, తెలుగు వ్యాకరణాన్ని - అదే - నుడి కట్టును కమ్మటి తెలుగులోనే వ్రాసుకోలేమా? నేర్చుకోలేమా? అటువంటి ప్రయత్నాన్ని లోగడ కొందరు చేశారేమో! ఇప్పుడు మాత్రం 'అమ్మనుడి' (నడుస్తున్న చరిత్ర) పత్రిక చదువరులకు చిరపరిచితుడైన స.వెం.రమేశ్ ఆ పని చేశాడు. చక్కని తెలుగులో కతలు, వ్యాసాలువ్రాసి ప్రసిద్ధుడైన తెలుగు నుడి పోరాట కార్యకర్త, తమిళనాడులో తెలుగువారికి తెలుగును చదువనూ, వ్రాయనూ నేర్పుతున్న 'తెలుగు వాణి' ట్రస్టీ ముఖ్య కార్యకర్త స.వెం.రమేశ్ - ఎవరినీ ఏమీ విమర్శించకుండా ఎంతో తేలిగ్గా తెలిసేట్లు 'తెలుగులో తెలుగు నుడికట్టు'ను వ్రాశాడు. ఇంతవరకు ఉన్న వ్యాకరణ సూత్రాన్నే అసలైన తెలుగులో మనకు అందిస్తున్నాడు. దీనిలో తప్పులను ఎత్తిచూపితే సరిదిద్దు కొంటానంటున్నాడు. సూచనలు, సలహాలను వినయపూర్వకంగా కోరుతున్నాడు. తెలుగు పండితులు, తెలుగు భాషాశాస్త్రజ్ఞులు దయతో దీనిని మనసు ఉంచి చదవాలని, తమ విమర్శలను, సూచనలను, సలహాలను తెలియజేయాలని కోరుతున్నాం. వాటిని 'అమ్మనుడి' పత్రికలో ప్రచురించడానికి అనుమతిస్తే 'ప్రచురిస్తామని కూడా మనవి చేస్తున్నాం. - సంపాదకుడు

## మునుపలుకు

పుడమిమీద ఉన్న పలు ఉసురులలో, మనిసి కూడా ఒక ఉసురే. మిగిలిన ఉసురులకు ఉన్నట్లే మనిసికి కూడా, కునుకూ ఆకలీ వెరపూ కవతా వంటి చవిగోలులు ఉన్నాయి. ఇవి కాకుండా ఏ ఉసురుకూ లేని విడితలు కొన్ని మనిషికి మట్టుకే ఉన్నాయి. ఆ విడితలలో వంచమయినది నుడి, చాలా ఉసురులకు తలపులను పంచుకొనే చప్పుడులు ఉన్నాయి. అయితే అవి నిండయిన చప్పుడులు కావు, కొద్ది తలపులను వెలిపుచ్చే అరుపులూ కూతలూ మట్టుకే. అందుకే వాటిని నుడి అనలేము. పలు తలపోతలను వెలిపుచ్చుటకు పనికివస్తూ, తనదయిన కట్టడిని కలిగి ఉన్నదానినే నుడి అంటారు.

**తెనుగు; తెలుగు :-**

పుడమి మీద ఏడువేల నుడులు ఉన్నాయి. ఇవన్నీ పది పన్నెండు నుడి కూటువులుగా నెలకొని ఉన్నాయి. వీటిలో ఒకటి తెనుగు కూటువు. తెన్ అనే కుదురు నుండి పుట్టిన మాట తెనుగు. తెన్ (south) కడ ఎక్కువ నుడులు ఉండే కూటువు కాబట్టి దీనిపేరు తెనుగు. దీనిని 'ద్రావిడ' అనే పేరుతో పిలుస్తూ ఉంటారు. తెనుగు కూటువులో: తెలుగు, కన్నడం, తమిళం, మలయాళం, తుళు, కొడగు, కోత, తొద, బడుగ, ఇరుళ, కొరగ, గోండి, కుయి, కువి, కుబి, కొండ, మండ, పెంగొ, ఇంది, కొలామి, నాయికి, పరిజి, గదబ, కురుక్, మాల్తో, బ్రాహుయి వంటి నుడులు ఉన్నాయి. పై నుడులు అన్నీ ఒక కుదురునుండే పుట్టినాయి. కుదురుపేరే తెనుగు.

తెనుగు కూటువు, పుడమిలోని పాత కూటువులలో ఒకటి. క్రీ॥ము॥ 4000 ఏండ్ల నాటి పాతనుడి సుమేరియన్, ఇదే మిక్కిలి పాతనుడి అని కొందరి మాట. అయితే, సుమేరియన్ నుడిలో తెనుగు మాటలు కొన్ని కనపడుతున్నాయనీ కొంగొత్త అరయికలు చెపుతున్నాయి.

క్రీ॥ము॥ 500 నాటి లాటిన్, క్రీ॥ము. 800 నాటి గ్రీక్, క్రీ॥ము. 3000 నాటి సంసుక్రుతం, క్రీ॥ము. 3500 నాటి ఈజిప్టు, పాతచీనీ, క్రీ॥ము. 4000 నాటి సుమేరియన్. వీటి అన్నిటి మీదా తెనుగు వెలుతురు పడిందని, తెనుగు కూటువు అప్పటికే గొప్ప మట్టుకు చేరినదనీ కొంగొత్త అరయికలు తెలియచేస్తున్నాయి.

తెనుగు కుదురునుండి మొట్టమొదట చీలి విడివడిన నుడి- తెలుగు. క్రీ॥ము. 1500 నాటికే తెలుగు విడివడిందని నుడి ఎసవరుల మాట. అంటే తెలుగుకు 3,500 ఏండ్ల ఈడు.

**నుడి ఎదుగుదల :-**

నుడి ఎదుగుదలలో ఎనిమిది మట్టులను చూడవచ్చు. అవి వరుసగా 1. తొలిమట్టు 2. నెరవుమట్టు 3.కనుబడి మట్టు 4. కవర మట్టు 5.త్రోవమట్టు 6. ఏలుబడి మట్టు 7. ఎరుకువ మట్టు 8.కొనమట్టు.

**1) తొలిమట్టు :-** నుడి మొట్టమొదట పొడకట్టినపుడు, కొద్దిమందికీ చిన్నతావుకూ నిలిచి ఉంటుంది. ఈ మట్టులో కొద్దిమాటలు మటుకే ఉంటాయి. వంపులు కూడా తక్కువగా ఉంటాయి. మచ్చు: తల,

**2) నెరవుమట్టు :-** నుడి మెల్లమెల్లగా పెరుగుతూ తనతావునుండి పక్కతావులకు నెరవుకొంటూ పోవుట రెండవమట్టు. ఈమట్టులో కొత్తకొత్త ఉరువులు ఎదురుపడి, వాటికి కొత్త మాటలు పుడుతుం టాయి. వంపులు కూడా పెరుగుతాయి. మచ్చు: తల, తలకట్టు, తల పాగ, తలగడ, తలవాకిలి, తలపోటు, తలవంపు.

**3) కనుబడిమట్టు :-** మొదటి రెండుమట్టులలోని నుడిగుంపు తిండిని వెతుకుకొనే నిలమలో ఉంటాయి. ఆ నిలిమను దాటి తిండిని కను బడించే నిలమకు చేరుకొనుటే ఈ మూడవమట్టు. ఎసరకలో దొరికిన రాయి, కొయ్య, ఎముక వంటి వాటినే కొద్దిగా తీర్చుకొని పనిముట్టుగా పోటుముట్టుగా, మొదటి రెండుమట్టులవారు వాడుకొంటారు. కనుబడి మట్టుకు అవి సరిపోవు. కనుబడికి మెరుగయిన ముట్టులు ఎన్నెన్నో అక్కరపడుతాయి. వాటిని అవనించుకొనాలె, ముట్టులకూ, వాటితో చేసే పనులకూ కొత్తకొత్త పేర్లను పొందించుకొనాలె. అందుకే

ఈ మట్టులో నుడి ఇబ్బడి ముబ్బడిగా పెరుగుతుంది. మచ్చు: తల పోయు, తలపోత, తలకట్టుచిట్టె, తలకట్టు తాడు, తలపు, తలకర్ర, తలకొడి, తలకాలువ, తలకొయ్య, తలకొరివి, తలకొవ్వు, తలకోల, తలగుంజ, తలచాటు, తలంటు, తలతిక్క, తలదాపు, తలదిమ్ము, తలనొప్పి, తలపండు, తలపొగరు, తలబరువు, తలబిరుసు, తల మనిసి, తలమునక, తలమూట, తలంబ్రాలు, తలరాత, తలారి, తలవర, తలలో నాలుక, తలకాచు, తలకుమించు, తలదన్ను...

**4) కవరమట్టు :–** కనుబడిమట్టులో కనుబడులు ఎక్కువయి, నిలువ పెరిగినపుడు, ఆ నిలువను అమ్ముట, లేనివాటిని కొనుట జరుగు తుంది. ఆ అమ్మకాలనూ కొనుగోలులనూ కలిపి కవరము అంటారు. ఈ మట్టు నుడిగుంపు, కవరం కోసం ఎంతెంతో దవ్వులకు తిరుగుతూ ఉంటుంది. అందుకే నుడుల నడుమ ఇచ్చిపుచ్చుగోలు ఉంటుంది. నుడి మరిన్ని నంపులతో మరింతగా ఎదుగుతుంది. ఈమట్టులోనే నుడిగుంపు నగరమయం అవుతుంది. చదువులు పెరుగుతాయి. నుడి ఇక్కడి నుండి త్రోవ, ఏలుబడి, ఎరుకువ మట్టులకు చేరుతుంది. ఈ మూడు మట్టులలో ముందువెనుకలుగా దేనిలోకయినా చేరు కొంటుంది నుడి.

**5) త్రోవమట్టు :–** త్రోవకు చెందిన ఏరుపాటు, కట్టుపాటు, పాటిడి, తెలివిడి, మొక్కుబడి, చాగుబడి వంటివి అన్నీ కలిగి ఉండుట. ఈమట్టుకు ఎదిగిన నుడిని, ఆత్రోవను తొడరే వేరే నుడులవారు కూడా వాడుతుంటారు.

మచ్చు : పుడమిలోని ముస్లిముల అందరి మొక్కుబడి నుడిగా అరబిక్ ఉండుట. పెరుమాళ్లు త్రోవను నమ్మేవారు అందరూ తమిళంను పాడుట. వీరశివ త్రోవను తొడరేవాళ్లు అందరూ కన్నడకరదను చదవుట.

**6) ఏలుబడి మట్టు :–** ఏలుబడికి చెందిన ఉత్తరువులూ చెక్కింపులూ రాతకోతలు అన్నీ నుడిలో నడిచి కొలువు నుడిగా ఎదగుట ఒక నుడి ఏలుబడి ఎంతవరకూ సాగుతుందో, ఆ తావులలో అంతా ఆ నుడి పరచుకొంటుంది.

మచ్చు : ఇంగిలీసువారు ఏలిన తావులలో అంతా ఇంగిలీసు పరచు కొనుట.

**7) ఎరుకువ మట్టు :–** పలుతీరుల ఎరుకువ అంతా నుడిలో పుట్టుట, లేదా నుడిలోనికి మార్చుకొనుట.

మచ్చు : పాత ఇందియనాటి ఎరుకువ సంసుక్రుతంలో ఉండుట. కొంగొత్త ఎరుకువ అంతా ఇంగిలీసులో దొరుకుట.

**8) కొనమట్టు :–** అన్ని తావుల ఎరుకువను అంతా తెలియచేయుట. అన్ని నుడులకూ లేదా కొన్నినుడులకు పెన్‌నుడిగా ఆనునుడిగా మారుట. ఎక్కడనుండి ఎటువంటి కొత్తమాట వచ్చినా, తన కుదురు నుండే దానికి మాటను పుట్టించుకొనుట: ఇదీ నుడికి చెందిన కొన మట్టు. ఇంగిలీసు, పరాసు, చీనీ వంటి కొద్ది నుడులు మట్టుకే ఈ మట్టుకు చేరుకొని ఉన్నాయి. మననాడులోని హిందీ, తమిళం, ఈ మట్టుకు చేరుటకు పూనుకొంటున్నాయి.

**తెలుగు నిలవరం :–** 3500 ఏండ్ల కిందట తెనుగు కూటువు నుండి విడివడే నాటికే తెలుగు, మొదటి రెండు మట్టులనూ దాటింది. ఇప్పటివరకూ, దొరికిన ఆనవాలులను పట్టి, రెండువేల ఏండ్ల కిందటే మూడవ మట్టును దాటి, నాలుగవ మట్టుకు ఎదిగింది. ఆ తరువాత తెలుగు అడుగు ముందుకు పడలేదు, రెండువేల ఏండ్లుగా తెలుగునుడి ఆ నాలుగవ మట్టులోనే నిలిచిపోయింది.

ఒక నుడి ఎదుగుదలకు అడ్డు తగిలేవి ఎన్నో ఉంటాయి. తెలుగు దగ్గరకు వచ్చేసరికి దాని ఎదుగుదలకు తొట్టతొలుత అడ్డు తగిలింది త్రోవ.

**పెత్తనం :** రెండువేల మూడునూరుల ఏండ్ల కిందటే తెలుగువారు ఏలుబడికి వచ్చినారని కోటలింగాల తవ్వకాలు తెలుపుతున్నాయి. దానికి కొద్దిగా ముందర బుద్ధ త్రోవ తెలుగునేల మీదకు వచ్చింది. వస్తూ వస్తూ ఆ త్రోవనుడి అయిన ప్రాక్రుతాన్ని వెంటపెట్టుకొని వచ్చింది. బుద్ధుడు చూపిన త్రోవను తలకు ఎత్తుకొనింది తెలుగునేల. త్రోవతో పాటు ఆ త్రోవనుడి అయిన ప్రాక్రుతాన్ని కూడా మోసింది. ఏలుబడికి వచ్చినవారు కొలువు నుడిగా ప్రాక్రుతాన్నే ఎంచుకొన్నారు. అంతకు ముందు తెలుగునేలమీద, ఎరుకువనుడిగా తెలుగు ఉండి ఉండవచ్చు. ఎందుకంటే అంతకు 1200 ఏండ్లకు ముందే తెలుగు పుట్టింది కనుక. తెలుగుకు తల్లి అయిన తెనుగు అప్పటికే గొప్ప నగరనుడిగా ఎదిగిఉంది కనుక.

త్రోవనుడిగా వచ్చి, ఏలుబడి నుడిగా కుదురుకొన్న ప్రాక్రుతం, ఎరుకువనుడిగా కూడా తెలుగుకు తావు లేకుండా చేసింది. తెలుగు సాతవాహనుల, నానూరు ఏండ్ల ఏలుబడి తరిలో, తెలుగు ఆన వాలులు, కొద్ది పేరులలో మట్టుకే నిలిచినాయి. తెలుగు నేలమీద గొప్ప గొప్ప రాతికట్టడాలూ నుడి చెక్కింపులూ వెలసినా, అవన్నీ ప్రాక్రుతపు జాడలుగా నిలిచినాయి. ఇదే నిలవరాన్ని సాతవాహనుల తరువాతి దొరలు కూడా కొనసాగించినారు. బుద్ధ త్రోవకు మేవడి ఉండినంత వరకూ, అంటే దాదాపు అయిదారు నూరుల ఏండ్లు, తెలుగునేల మీద ప్రాక్రుతానిదే చెల్లుబడి.

**సంసుక్రుత పెత్తనం :–** పల్లవుల ఏలుబడి రాకతో బుద్ధత్రోవకూ ప్రాక్రుత నుడికి అడ్డుకట్ట పడింది. పల్లవులు మినుకుతోవను తల కెత్తుకొన్నారు. మినుకునుడి అయిన సంసుక్రుతాన్ని కొలువు నుడిగా చేసుకొన్నారు. అప్పటివరకూ గుడి, బడి, ఏలుబడులలో పెత్తనం చేసిన ప్రాక్రుతానికి మారుగా సంసుక్రుత పెత్తనం మొదలయింది. ఇది మరికొన్ని నూరేండ్ల పాటు కొనసాగింది.

క్రీ॥శ॥ 6వ నూరేడు నుండి తెలుగునుడిలో రాతి చెక్కింపులు మొదలయినాయి. క్రీ॥శ॥ 9వ నూరేడు నాటికే తెలుగు చెక్కింపులలో కొలువడితో కూడిన పాడికలు వచ్చినాయి. కానీ అప్పటికే సంసు క్రుతం, తెలుగులోకి లోతుగా చొచ్చుకొనిపోయింది. సంసుక్రుతపు మాటలే గొప్పవి, తెలుగు మాటలు తక్కువని అనే అనిపింపు వచ్చే సింది.

ఒకనుడి ఇంకొకనుడి నుండి మాటలను తీసుకొనవచ్చు, అయితే తన దగ్గర లేనివాటినే తీసుకొనాలె. కానీ తెలుగులో వాడుకలో ఉన్న ఎన్నో మాటలకు మారుగా పెరనుడి మాటలు చొరపడినాయి. తెలుగులోకి మరొక వింత చొరపాటు కూడా జరిగింది. ఒకనుడి మరొకనుడి నుండి మాటలనే తీసుకొంటుంది కానీ చప్పుడులను తీసుకొనదు. తెలుగులోకి, సంసుక్రుతపు మాటలే కాకుండా సంసు క్రుతపు చప్పుడులూ, ఆ చప్పుడులకు కావలసిన వ్రాపొడలూ చొర పడినాయి. సంసుక్రుతపు చప్పుడులే గొప్పవి అనీ, వాటిని తెలుగు తీరుతో పలికితే తప్పు అనీ, చాటింపులూ ఈసడింపులూ మొదయి నాయి. వాటికి ప్రకృతులూ వికృతులూ అనే పేరులను వాడుకలోకి తెచ్చినారు.

మన పొరుగునుడులు అయిన తమిళ కన్నడాలకు, పెరుమాళు, శివ(త్రోవలు ఆనుగా నిలిచినాయి. తమిళానికి పెరుమాళు త్రోవలో గుడిమేవడి దొరికింది. తమిళం లోనికి సంసుక్రుతపు మాటలు దూరినా, సంసుక్రుతపు చప్పుడులు దూరలేదు.

11వ నూరేడు నుండి తెలుగుకు కొలువుకూటంలో చోటు దక్కి, ఏలుబడినుడి అయింది. అట్లా చోటు దక్కించుకొన్న తెలుగులో, తెలుగుతనం కంటే పెరతనమే ఎక్కువ. 'దు ము వు లు' వంటి కూరుపులతో సంసుక్రుతపు మాటలే పెత్తనం చేసినాయి.

తరువాత ఉరుదు, **ఒళంద, బుడతకీచు, పరాసునుడుల** మాటలు మరిన్ని వచ్చి కలిసినాయి. అయితే అవి తమ చప్పుడులను దిగుమతి చేయలేదు (ఒక్క అనే చప్పుడు తప్పు) తెలుగు చప్పుడులోనే ఒదిగినాయి.

ఒకనుడి గొప్పతనాన్ని తెలిపేది అందులోని అగవనికల లెక్క. తెలుగులో దాదాపు రెండువేల అగవనికలు ఉన్నాయి. ఇన్ని అగవనికలు ఉన్న నుడులు చాలా అరుదు. తెలిసో తెలియకో అగవనికలను కూడా పోగొట్టుకొంటున్నాము. పేరనికలకు పెరమాటల రాక పెద్ద ముప్పు కాదు కానీ, అగవనికలకు పెరమాటల రాక, నుడికి పెనుముప్పు. మచ్చులు:

| **తెలుగు** | **పెరఅగవనిక** |
|---|---|
| ఆపు | నిరోధించు |
| ఒదవు | సిద్ధించు |
| దక్కు | ప్రాప్తించు |
| తిను | భోంచేయు |
| బెదిరించు | దబాయించు |
| మోపు | బనాయించు |
| మోగించు | బజాయించు |
| కాపాడు | బచాయించు |

ఇప్పుడు ఇంగిలీసు మాటల వెల్లువ వచ్చి, ఈ తీరు ఎక్కడవరకూ పోయిందంటే, 'అగు- చేయు' వంటి రెండుమూడు అగవనికలు మటుకే మిగిలే నిలవరం వచ్చేసింది. మచ్చులు :
నడుచు-వాక్‌చేయు, తోలు-డ్రైవ్‌చేయు, ఉతుకు-వాష్‌చేయు, కలుపు -మిక్స్‌చేయు, దిగు-డౌన్‌అగు,ఎండు-డ్రై అగు, మండు-ఫైర్‌అగు....

రాచ ఏలుబడిని దాటి నుంది ఏలుబడికి చేరుకొన్నాము. తెలుగు నుడి కోసమే ఒక విడినాడును ఏరుపరచుకొన్నాము. అయినా తెలుగు నిలవరం మారలేదు. 1970లలో తెలుగు పేరోలగం ఏరుపడినపుడు అయినా పెరమాటల చొరపాటుకు అడ్డకట్ట వేయలేదు. పైగా, వెయ్యి ఏండ్ల తెలుగునానుడి ఎన్ని సంసుక్రుతపు మాటలను తెచ్చిపెట్టిందో, అంతకంటే ఎక్కువగానే ఆ పెరమాటలను తెలుగులోనికి చొప్పించినారు పేరోలగంవారు.

ఇప్పుడు **మరమయగింత** పెరిగింది. కొంగొత్త పనిముట్టులు ఎన్నో వచ్చేసినాయి. ఎసవు ఎరుక బాగా పెరిగింది. మూలమయగింత తరిలోకి చేరుకొన్నాము. రాబోవు నూరు ఏండ్ల తరిలో ఈ పుడమి మీద పదిపన్నెండు నుడులు మటుకే మిగలవచ్చు అని తెలివిపరుల మాట. ఇందియనాడులో అయితే, హిందీ నుడి ఒక్కటే కానీ, హిందీ వంగ తమిళ నుడులుకానీ మిగలవచ్చు అంటున్నారు. పేరనికలే కాదు అగవనికలు కూడా విరవిర కనుమరుగు అవుతున్నది చూస్తున్నవారు, తెలుగు నిలుస్తుంది అని చెప్పలేరు కదా!

**చేయవలసిన పనులు :-**

తెలుగును కనుమరుగు కానివ్వకుండా నిలుపుకొనాలె అంటే, తెలుగు తెలివిపరులు వెంటనే పనిచేయాలె. రాబోవు పదిఏండ్లు చాలా వంచవయినవి. ఈ పది ఏండ్లు గట్టిగా కింది పనులను చేయాలె.
1) అన్ని నుడులలోని ఎరుకువను అంతా తెలుగులోనికి తెచ్చుకొనాలె. తెలుగును తెలుగు మాటలతోనే నేరుపాలె. తెలుగులో అక్కర లేకుండా ఉన్న పెరమాటలను తీసివేసి, తెలుగు మాటలతోనే బడి పొత్తాలనూ ఎసవు పొత్తాలనూ తిరిగి రాయాలె. పొందించుటకు వీలుపడని అప్పుడు మటుకే పెరనుడి మాటలను తీసుకొనాలె. అప్పుడు కూడా వాటిని తెలుగు చప్పుడుకు అనువుగా మారుచుకని వాడాలె.
2) తెలుగును త్రోవనుడిగా చేయాలె. బుద్ధ, జిన, మినుకు, పెరుమాకు, శివ, క్రీస్తు, ఇస్లాం వంటి ఏ త్రోవవారు అయినా తమ వేడికోలులను, తెలుగులో చేసుకొనకలిగేటట్లు తెలుగునుడిని అవనించాలె.
3) తెలుగును ఏలుబడి నుడిగా చేయాలె. ఏలుబడి అంతా తెలుగులోనే జరుగునట్లు చూడాలె. దొరతనపు అగవిలులలో తెలుగే వినపడాలె. కనపడాలె. దొరతనాన్ని ఒప్పించి అయినా, వంచి అయినా ఈ పని జరుగునట్లు చూడాలె.
4) కొంగొత్త అరయికలు తెలుగులో జరుగునట్లు చూడాలె. తెలుగు నేలమీద ఎటువంటి ఎసవు అరయిక జరుగుతుందా అని అందరూ తమికొనేలా అన్ని అరుగులలోనూ పని జరుగాలె.
5) 2011 నాటికే 18 కోట్లమందితో, పుడమిమీద ఎక్కువమందికి తల్లినుడిగా కలిగిన తొలి అయిదు నుడులలో తెలుగు ఒకటి అని చాటాలె. 3,500 ఏండ్ల తెలుగు మెలననూ, విందెమలల నుండి వానమామల వరకూ పరచుకొన్న తెలుగు తావునూ గురించి లోకానికి చాటాలె.

**నుడికట్టునోయి :** బడి, గుడి, ఏలుబడులలో, తెలుగును నిలిపే పనిలో తెలుగుజాతి అరణి కూడా పాలుపంచుకొంటున్నది. ఆ పూనికలో వేసిన అడుగే ఈ తెలుగు నుడికట్టు నోయి. తెలుగు పిల్లలకు తెలుగులో నుడికట్టును చెప్పలేని నిలమలో ఉన్నాము. నుడికట్టు పేరుతో నేరుపుతున్నఇ ఎక్కువగా పెరనుడినే కానీ తెలుగును కాదు.

ఏ ఎసవునోయిని రాయాలెనన్నా ఎన్నో అనిమి మాటలు కావలసి వస్తాయి. ఆ ఆనిమి మాటలను పుట్టించుకొనుటలోనే నుడిచేవ బయట పడుతుంది. నుడి ఎసవరులు, ఆనిమి మాటలకు రెండు తెరగులు ఉండాలె అంటారు. అవి 1) విడమరచి చెప్పినట్లుగా కాకుండా చిరుపలుకుగా ఉండాలె 2) తననుండి మరిన్ని మాటల పుట్టుకకు తావు ఇచ్చేదిగా ఉండాలె. ఈ రెండు తెరగులు తెలుగు మాటలకు లేవుకావున ఆనిమి మాటలకు తెలుగు పనికిరాదని పక్కకు పెడుతున్నారు. ఇది నిక్కంకాదు, తెలుగుకు ఆ చేవ ఉంది అని మా నమ్మకం. తొంబయి తొమ్మిది నూరుపాలు తెలుగు మాటలతోనే ఏ ఎసవును అయినా రాసుకొనవచ్చు అని నిక్కపరచుటకే ఈనోయిని తెలుగుమాటలతో తెస్తున్నాము.

తెలుగుకోసం తల్లడిల్లిన ఆదిబట్ల నారాయణదాసు, మారేపల్లి రామచంద్ర శాస్త్రిరి, బిగువు బంగారయ్యలను తలచుకొంటూ నుడికట్టులోనికి పోదాము.

**(తరువాయి రాబోయే సంచికలో)**

-డా॥వావిలాల సుబ్బారావు

# చలం గారు-సోషలిజం



వైశాఖమాసం గుర్తుకు రాగానే మామిడిపండ్లు, బుద్ధజయంతి, చలంగారు జ్ఞాపకం వస్తారు. చలం గారు వైశాఖ పూర్ణిమనాడు పుట్టారు. వైశాఖమాసంలోనే కాలం చేశారు. చలం గారి పేరును స్త్రీ పురుష సంబంధాల సమస్యలకు మాత్రమే పరిమితం చేసి గుర్తుంచుకోవటం అలవాటు అయింది సాధారణంగా. అది చలం గారిలో ప్రధాన విషయమే గాని ఆయన అనేక ఆలోచనల కూడలి. చాలా ప్రధానాంశాల గురించి మౌలిక ప్రశ్నలు వేశాడు. సమాధానాలు వేటికీ చెప్పని మాట నిజం. ఎవరు ఏ పరిష్కారం చెప్పినా లోకం పాటించదు. స్వయంగా తానే వెతుక్కుంటుంది. అందుకని ఆయనా చెప్పలేదు. అసలు ఏదో ఒక విషయం మీద సమగ్ర గ్రంథం వ్రాసే స్వభావం చలానికి లేదు. అయినా మనం వాటిని గూర్చి ఆలో చించకపోవటం తాత్విక అపచారం అవుతుంది.

లోకానికి చలాన్ని మళ్ళీ మళ్ళీ అనేక కోణాల నుండి జ్ఞాపకం చేయటమే లక్ష్యంగా పెట్టుకున్న శ్రీ ఆళ్ళ గురుప్రసాదరావుగారు 'చలం చింతన-సోషలిజం' అనే పుస్తకం అచ్చువేసి ఆవిష్కరించారు. అందులో సోషలిజంపై చలం అభిప్రాయాలను ఏర్చి మాలకట్టారు. చలంలో ఇంకా ముఖ్యమైనవి జీవిత పరిశోధనగా తీసుకున్న అంశాలు వున్నాయి. చలం ప్రేమ పరిణామం, ఆధ్యాత్మిక సాధన, సౌందర్యాన్వే షణ- రసానుభవం వంటివి.

లలిత కళావిమర్శ, రసదృష్టి మొదలైన చర్చలు మ్యూజింగ్సు లోను, లేఖలలోను ముఖ్యంగా సంజీవదేవ్ గారికి వ్రాసిన లేఖలలో దండిగా వున్నాయి.

చలంతో ఆధ్యాత్మికత ఒక విశ్వాసం కాదు. స్వీయ అనుభవం. సౌందర్యాస్వాదన ఎట్లా వ్యక్తిగతమైన అనుభవమో అట్లాగే ఆధ్యాత్మికత అనుభవం గూడ. అంతరంగ పరీక్షకు మాత్రమే గాని బాహ్య పరీక్షకు తగినది కాదు. చలంలో సాగిన లోలోపలి అన్వేషణ రమణ మహర్షి దగ్గరకు వచ్చి సమాధానం పొందింది. అట్లాగే సర్వజన సర్వహిత సంక్షేమం కోసం శతాబ్దాలుగా సాగిన సామాజిక తత్వవేత్తల అన్వేషణ సోషలిజంలో సిద్ధాంతరూపం పొందిందని చలం గారికి ఓ గౌరవం. ఆచరణలో ప్రయాణంలో ఎగుడు దిగుళ్ళు కొండొకచో దారి తప్ప డాలు అనివార్యం. ఆధ్యాత్మిక ప్రయాణంలో వ్యక్తుల మీద, విగ్రహాల మీద నిలిచే విశ్వాసాలు, బాటలో మజిలీల వంటివి. వాటిలో తప్ప టడుగులు-తప్పుడు అడుగులు-తప్పని అడుగులు కూడా వుంటాయి. అంతమాత్రాన గమ్యాన్ని నిరాకరించము. సరిచూచి సవరించు కుంటాము.

సోషలిజమూ అంతే. సోషలిజం గమ్యం అనివార్యం. అది సమాజం యొక్క సంపూర్ణ వికాస స్వరూపం. అందమైన స్వప్నం. అబద్ధమైన స్వప్నం కాదు. 'హంతకుడు' అనే చిన్న నాటకంలో ధనిక పాత్రలతో చలం అనిపిస్తాడు. "ఊరికే వాదించాం గానీ ఎట్లానూ ప్రజలకే విజయం చాలా దగ్గరలో వుంది.." ధనానికి, సౌఖ్యానికి అలవాటుపడ్డాం. చూస్తూ చూస్తూ వదులుకోలేం...వెళ్ళ..ఈనాడు మాది..రేపు ఎట్లాగో మీది. సంతోషంగా వెళ్లు", "ఎట్లానూ కొత్త ప్రపంచం వస్తోంది. ఇంత త్యాగం చేసి తెచ్చుకొనే ఆ మరోప్రపంచాన్ని నివాసయోగ్యం చేసుకొమ్మని నా వాదం..చలం తర్కం..." అని చెప్పిస్తాడు. సోషలిజం మీద అంత ఆశ చలానికి. కాని ఏదయినా పొరపాటు చేస్తారేమోనని హెచ్చరిక చేస్తారు. వాటిని మన సామ్యవాద నాయకులు గూడ పట్టించుకోలేదు.

ఆధ్యాత్మిక యాత్రలో వేసే తప్పటడుగుల దుష్ఫలితాలు వ్యక్తి జీవితానికే పరిమితం. సామాజిక పోరాటం దారి తప్పితే ఆ దుష్ఫ లితం కొన్ని వందల తరాలను దారి తప్పిస్తుంది. అదే చలం దిగులు. అందుకే సోషలిజం ఆశయాన్ని ఆహ్వానిస్తూనే ఆచరణ పద్ధతులను సందేహించాడు. సామాజిక పోరాటం ఒకరివల్ల కాదుకదా! నాయక శ్రేణి కావాలి. ఆచార సద్భావన ఆ శ్రేణి అంతటా కొనసాగాలి. అదే సందేహాస్పదం. దారి తప్పితే సమూహాలు సమూహాలు నష్టపోతాయి. నాగరాజు నెత్తిన ఉండే దివ్యమణి పొరపాటున కప్ప నెత్తిన పడితే, కప్ప బుడుంగున బురదలో మునుగుతుంది. మణికి మలినం అంటుకుంటుంది. అదే చలం భయం. ఆకాశంలో ఉండే ఏ ఆదర్శమయినా నేలమీదకు వచ్చేటప్పుడు వాతావరణ ధూళి అంటక తప్పదు. కాని ఆ ధూళి గురించే చలం నిర్వేదం.

సత్యం మీద గౌరవమే- కానీ సంసార కష్టం పట్టించుకోని హరిశ్చంద్రుని మీద కోపం.

రాముని కన్న సీత ప్రేమ మీద గౌరవం- కాని, అగ్ని పరీక్ష



గంగవ్వ

## పోస్ట్‌మార్టం....చీరిపారకం

మా గంగవ్వ ఈరోజు పనికి చాలా ఆలస్యంగా వచ్చింది. "ఏంది గంగవ్వా! ఇంత ఆలస్యం చేశావు. పెద్దబాబు బెంగుళూరు నుండి వచ్చాడు కదా వెళ్ళాలని తొందర పడుతున్నాడు. రైలులో తినటానికి రొట్టెలు చేసియ్యాలి. తొందరగా పని గానియ్యి" అన్నా.

"ఏమి చెబుదునవ్వా బేగి అద్దామనే బైలెల్లిన, మా ఇళ్ళ దగ్గరుండే ఓ పెద్దాయన మందు తాగి సచ్చిండు. ఆణ్ణి చూసొద్దామని పోయిన. నేను పోయి టాలకే ఆడి శవాన్ని చీరి పారకానికి పోలీసులు దవాఖానాకి కొంచవోయుండ్రు. వో మంది అంటే మంది' అన్నది. నాకు అర్థం గాక "ఎక్కడికి తీసుకుపోయారవ్వా" అన్నా. చీరి పారకానికవ్వా...అదే పోస్ట్‌మారకానికి" అన్నది.

పోస్ట్‌మార్టం= చీరిపారకం=అంటే శవాన్ని చీరి తేరిపార చూడటం= నిశితంగా పరిశీలించటం! వెంటనే నిఘంటువు తీసి చూస్తే పారకం అంటే పూర్తి చేయటం, పాలించటం, ప్రీతి గావించటం అనే అర్థాలు కనిపించాయి. స.వెం.రమేశ్ గారిని అడిగితే పారచూడటం, పరిశీలించటం అనే అర్థాలు కూడా వున్నాయన్నారు. అంటే శవాన్ని చీరి చూసి తిరిగి కుట్టివేయటం పూర్తి చేయటం.

తెలంగాణ పల్లెల్లో మనసుపెట్టి వింటే బడుగుజీవుల దగ్గరే అపారమైన పదసంపద దొరుకుతుంది. ఈ రోజు పోస్ట్‌మార్టం అనే ఇంగ్లీషు పదానికి **'చీరిపారకం'** అనే అచ్చతెలుగు పదం విన్నందుకు చాలా సంతోషించాను. ఇలాంటి మాటలను పత్రికలు, టీవీలు వాడకంలోకి తెస్తే ఎంత బాగుంటుందో కదా!

**-పూదోట శౌరీలు,** బోధన్, నిజామాబాద్, 9010153505

మీద కోపం

సౌందర్యం అంటే యిష్టం- కాని, 'అది నాకే' అనే స్వార్థం మీద కోపం

ప్రేమ మీద గౌరవం..కానీ లోభం మీద కోపం

ఊర్వసి మీద గౌరవం కానీ, మళ్ళీ ఎప్పుడు వస్తావు అని దేవిరించే పురూరవుని మీద కోపం

ప్రేమపాదాలు కడిగినట్లు- సోషలిజం పాదాలు కడుగుతాడు

కానీ తొంగి చూసే నీడల మీద సందేహం.

"అయితే ఏంచేద్దామంటారు?"- అని గురుప్రసాదరావు గారే అడిగితే- ఏ సమాధానమూ రాదు. ఏ ప్రశ్నకు సిద్ధాన్నం లాంటి సమాధానాలు లేవు చలం దగ్గర. ఆదర్శాన్ని భుజాన వేసుకున్నవాడే సాహసించాలి. సాహసించినవారే కష్టసుఖాల శిలువ మోయాలి అంటాడు. నీ క్షేమం గురించి నీ అభిరుచి గురించి ఎంత గౌరవించుకుంటావో-సమాజ జీవితంలో అందరి అభిరుచి క్షేమం గురించి అంతే గౌరవించు..అంటాడు.

మానసిక స్వేచ్ఛ, సౌందర్యం, ఆధ్యాత్మికం, విశ్వాసాలను అదుపు చేయటం అంగీకరించడు. మీ సోషలిజానికి దేవుడు ఎట్లా అడ్డం అవుతాడు అన్నది ఆయన ప్రశ్న. మూఢవిశ్వాసాలు వేరు. అతీతానుభవం వేరు. (religious experience).

ఎన్నో తరాల తర్వాత రాబోయే సామాజిక ఆదర్శం కోసం ఇప్పటి తరాలు కొంత త్యాగం చేయటం అవసరం కావచ్చు కానీ స్వీయ జీవితాలకు గూడ సాఫల్యత, తృప్తి (fulfilness) ఉండాలి అన్నదే చలం గోల అంతా.

చలంలోని వివిధ ఆలోచనలను వింగడించి వేర్వేరు పుస్తకాలుగా తెచ్చే పూనికలో ఉన్న చలం ఫౌండేషన్ గురుప్రసాదరావు గారికి అభినందనలు.

*-రచయిత సెల్ : 98664 02973*

## మెలట్టూరులో తెలుగు భాగవత ప్రదర్శన

వైశాఖపూర్ణిమ (మే 21)నాడే బుద్ధజయంతి, నృసింహ జయంతిని జరుపుకొంటారు. తమిళనాడు తంజావూరు జిల్లాలోని మెలట్టూరు, శాలియమంగళం, తేపెరుమనల్లూరు-గ్రామాల్లో తెలుగు భాగవతాలు నడుస్తాయి. ఆరోజు సంప్రదాయ పద్ధతుల్లో నూనె దీపాల వెలుగులో ప్రదర్శనలు జరుగుతాయి.

ఈసారి మెలట్టూరులో-భక్త ప్రహ్లాద తెలుగు భాగవతాన్ని దేవనాగరి లిపిలో అచ్చువేస్తున్నారట!



-మధురాంతకం నరేంద్ర

# మాండలిక భాష- ప్రామాణిక భాష

దాదాపు మూడు దశాబ్దాల క్రితం వో పెద్దాయన నన్ను శ్రీకాకుళం జిల్లాలో వుండే వో చిన్న పల్లెటూరికి తీసుకెళ్ళాడు. వాళ్ళ యింట్లో భోజనం వడ్డించిన స్త్రీతో నేను "మరికొంచెం పొడి వేయండి" అన్నారు. ఆవిడ చెంగును ముఖానికడ్డంగా పెట్టుకుని, పొట్టచెక్క లయ్యేలా నవ్వసాగింది. నా పక్కన కూచున్న యువకుడు "అది పొడి కాదండీ...గుండా..." అన్నాడు. యీసారి పగలబడి నవ్వడం నా వంతయింది. మా వైపు గుండా అంటే పెద్ద పాత్ర అని అర్థం. మేమిద్దరమూ మా మాండలిక భాషలో మాట్లాడుతున్నామనీ, ఆ భాషల్లో చెప్పలేనంత తేడా వుందనీ తరువాత అర్థమయింది.

తెలుగుభాషలో ఎన్నో రకాల మాండలికాలున్నాయి. ఆ మాట కొస్తే ప్రతి వూరికీ తనదైన మాండలిక భాష వుంటుంది. వినగలిగే చెవులకు వాటిమధ్య వుండే తేడాలు స్పష్టంగానే తెలుస్తాయి. పాత్రల మాటల్ని, వాళ్ళు మాట్లాడుకునే మాండలిక భాషలోనే రాసినప్పుడు వాస్తవికత తోడవుతుంది. అలా పాత్రలకు, వాటివైన మాండలిక భాషను గుర్తించడం మొదలుపెట్టిన తర్వాత రచయితలకు వేర్వేరు మాండలిక భాషల మధ్య వుండే పోలికలూ, తేడాలూ బాగా తెలిసివస్తాయి.

దాదాపు 18 కోట్ల మంది వున్నారని మనమనుకుంటున్న తెలుగువాళ్ళలో రెండు రాష్ట్రాలకు వెలుపల సగం మంది దాకా వున్నారని అంచనా. తెలంగాణా, కోస్తా, రాయలసీమ, కళింగాంధ్ర అనే నాలుగు ముఖ్యమైన ప్రాంతాలతో బాటూ ఒరిస్సా, తమిళనాడు, కర్ణాటక, కేరళలలో వున్న చాలామంది తెలుగువాళ్ళ యాసలూ, మాండలికాలూ- అటుపైన విదేశాల్లో స్థిరపడిన తెలుగువాళ్ళ భాషా- వీటన్నింటిని గమనిస్తే తెలుగుభాషలో వున్నన్ని మాండలికాలూ, యాసలూ మరే ఇతర భాషలోనూ వున్నట్టుగా లేదు. బహుశా యిన్ని భిన్నత్వాలతో వుంటూ, వొకే భాషగా నిలవగలగడం కూడా తెలుగుభాషకున్న విశిష్టతేనేమో! యిన్ని రకాల మాండలికాలున్నప్పుడే ప్రామాణిక భాష యేదీ అన్న ప్రశ్న పుడుతుంది.

భాష వొక నిరంతర ప్రవాహం. ఎప్పుడో 10వ శతాబ్దం తరువాత రాయడం నేర్చుకున్న తెలుగుభాష అప్పటినుంచే ప్రామాణిక మైన భాషలోనే తన సాహిత్యాన్నంతా రాసుకుంటూ వస్తోంది. మళ్ళీ ప్రామాణిక భాష అంటే యేదీ అన్న ప్రశ్నే తలెత్తుతోంది. అస్సలు ప్రామాణిక భాష కూడా వొక మాండలికమేననీ, యే మాండలిక భాషలో సాహిత్యమూ, చట్టాలూ వెలువడుతాయో అదే ప్రామాణిక భాష అనీ గుర్తించాలి.

నిఘంటువుల చేత గుర్తించబడినదీ, నిర్దుష్టమైన వ్యాకరణ మున్నదీ, నిర్దుష్టమైన వుచ్చారణ కలిగి వున్నదీ, ప్రభుత్వము చేత గుర్తించబడినదీ, ప్రజా వ్యవహారాలన్నిటిలో వాడబడుతున్నదీ, సాహిత్య సృజనకు వుపయోగపడేదీ, మాట్లాడడానికి సులువైనదీ, యెక్కువమంది వొప్పుకున్నదీ, యెక్కువమంది మాట్లాడేదీ, ప్రచార రంగంలోనూ పత్రికల్లోనూ వాడుతున్నదీ- అయిన భాషను సాధా రణంగా ప్రామాణిక భాషగా గుర్తిస్తారు.

మాట్లాడుతున్న వ్యక్తులు పెరిగే కొద్దీ, భాష చాలా ప్రాంతాలకు వ్యాపించే కొద్దీ, ప్రామాణిక భాష గురించిన చర్చ కూడా పెరుగుతూ వుంటుంది.

అందుకే యీ చర్చ ముందుగా యింగ్లీషులోనే మొదలయ్యింది. యింగ్లాండులో వుండే తూర్పు మిడ్‌లాండ్ మాండలికాన్ని సాహిత్య భాషగా గుర్తించడంతో పాటుగా మొదటి ఇంగ్లీషు కవిగా భావించే జెఫరీ చాజర్ రచనల్ని రాయడమూ 15వ శతాబ్దంలో కలిసి వచ్చాయి. పల్లె నుంచి వచ్చిన షేక్స్‌పియర్‌ను విశ్వవిద్యాలయ మేధావులు "కొంచెం లాటిన్, మరీ కొంచెం గ్రీకు" అని వెక్కిరించడమే కాకుండా, నెమలి ఈకల్ని గుచ్చుకొచ్చిన కాకి అని కూడా హేళన చేశారు. అయితే షేక్స్పియర్ తన గ్రామం నుంచి తీసుకొచ్చి వాడిన వేలాది పదాలతో యింగ్లీషు భాష పరిపుష్టమైపోయింది. అలా మాండలిక భాషే క్రమంగా ప్రామాణిక భాషగా మారిపోయింది.

ఆధునిక అమెరికా సాహిత్యమంతా మార్క్‌ట్వయిన్ రాసిన 'అడ్వెంచర్స్ ఆఫ్ హకిల్ బెరీఫిన్' అనే వొకే వొక పుస్తకంనుంచీ పుట్టుకొచ్చిందని హెమింగ్వే అంటాడు. ఆ నవలలో మార్క్‌ట్వయిన్ పని గట్టుకుని, శ్రద్ధగా నాలుగు ప్రాంతాల మాండలికాల్ని వాడానని 'ముందుమాట'లో చెబుతాడు. అంటే మాండలికాల్ని వాడడమన్నది ఆధునికతకున్న ముఖ్య లక్షణమని అర్థం.

బెంగాలీ సాహిత్యంలోకి రవీంద్రనాధ్ టాగూరు చాలా గ్రామీణ పదాల్ని తీసుకొచ్చి ఆ భాషను కలుషితం చేశాడని కొందరు విమర్శకులు నిరసించారు. అయితే అలా కలుషితం గావడం కంటే గొప్ప వరం యే భాషకూ వుండదని మాస్తి వేంకటేశ అయ్యంగార్ వాదిస్తాడు. తొలిరోజుల్లో మాండలిక భాషల్ని గౌరవించకపోవడమూ క్రమేణా ఆ మాండలికమే ప్రామాణిక భాషగా మారడమూ జరుగు తూనే వుంటుంది.

ఆధునిక తెలుగు సాహిత్యమంతా గురజాడ అప్పారావు రాసిన కన్యాశుల్కం రెండో ముద్రణ నుంచే పుట్టిందని అంటే అది అతి శయోక్తి కాదు. మాండలికాల్ని వాడిన తొలి కథకుడుగా కూడా గురజాడను గుర్తించవచ్చు. యిటీవల గురజాడ 'దిద్దుబాటు'కు ముందే వచ్చిన కథల్ని 90 వరకూ గుర్తించి పుస్తకంగా ప్రకటించారు. అయితే వొక నిర్దుష్టమైన మాండలిక భాషను వాడడంలో ఆ కథలు గురజాడ కథలంత పరిణతిని సాధించినవి గావు. వొక మాండలిక భాష ప్రామాణిక భాషగా పరిణామం చెందడంలో చాలా దశలుంటా యని కూడా యీ విషయం తేల్చి చెబుతుంది.

తొలినాటి తెలుగు కవులు కూడా తమ మాండలిక భాషను తమ కావ్యాల్లో విరివిగా వాడే వుంటారు. యీ రంగంలో పదకవితా పితామహుడైన అన్నమయ్య చేసిన కృషి అనితరసాధ్యమైంది. ఆయన

వాడినన్ని మాండలిక పదాలు మరెవరూ వాడలేదు. అన్నమయ్య పదకోశం తయారైతే అది సమగ్రమైన తెలుగుపదకోశమై తీరుతుంది. యిన్నాళ్ళ తర్వాత గూడా యీ పని జరగకపోవడం తెలుగువాళ్ళ దురదృష్టం.

మనుషుల కున్నట్టే భాషకు కూడా మతమూ, జాతీ, కులమూ, లింగమూ వుంటుంది. రాష్ట్రేతర ప్రాంతాల్లో నివసిస్తున్న తెలుగువాళ్ళ భాష ప్రవాహదశను కోల్పోవడం వల్ల పాత పదాల్ని యింకా వాడుకలో నిలుపుకోగలుగుతోంది. మాండలికంలోని గొప్ప పదాల్ని దళితులూ, స్త్రీలూ చలామణిలో పెడుతూ వుంటారు. వంటగది కిటికీ లోంచి స్త్రీల మాటల్ని వినడం ద్వారా గాలిక్ భాషను నేర్చుకున్నానని జె.యెమ్.సింగ్ అనే గొప్ప నాటకకర్త ప్రకటించాడు. అలాగే శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు కూడా వంటగదిలోని స్త్రీల నుంచే నిజమైన తెలుగు భాషను నేర్చుకున్నానని చెబుతాడు.

చాలా రకాల మాండలికాలున్నప్పుడే యేది ప్రామాణిక భాష అనే చర్చ పుట్టుకొస్తుంది. యింగ్లాండులో యిటువంటి చర్య జరిగింది. చివరకు ప్రామాణిక భాష పరిణామశీలత కలిగి వుంటుందనీ, దానికి యిదే గమ్యమని చెప్పడం కుదరదనీ తేల్చేశారు. ఆధునిక తెలుగు సాహిత్యం గురజాడ తరువాత మిగిలిన చాలామంది కవుల, రచయితల చేతుల్లో రూపుదిద్దుకొంది. కవిత్వంలో మాండలిక పదాల్ని అక్కడక్కడా వాడడం తప్ప, మొత్తం కావ్యమంతా మాండలిక భాషలో రాయడం జరగలేదు. (రంధి సోమరాజు గారి కావ్యాల వంటి కొన్ని మినహాయింపులు తప్ప) శ్రీపాద గోదావరి జిల్లాల మాండలికంలోనూ, చాసో విజయనగరం మాండలికంలోనూ, రాచకొండ విశ్వనాథ శాస్త్రి విశాఖ మాండలికంలోనూ రాశారు. అయితే 1950ల తర్వాత భారతి, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభల వంటి పత్రికలు వచ్చిన తరువాత, సినిమారంగం ప్రాచుర్యంలోకి వచ్చాక, క్రమంగా తెలుగులో వొక ప్రామాణిక భాష పరిణామం చెంది వచ్చింది. నాలుగైదు దశాబ్దాల వరకూ అది ప్రాచుర్యాన్ని పొందింది. ఆంధ్రరాష్ట్రం యేర్పడిన తర్వాత నాలుగు ప్రాంతాల నుంచి వచ్చిన రచయితలు కూడా ఆ భాషలోనే రాయసాగారు. తొలిరోజుల్లో పాత్రల చేత మాత్రం మాండలికాన్ని పలికించారు. అయితే ఆ తరువాత ఆ ప్రామాణిక భాష కృష్ణా గుంటూరు జిల్లాల భాషేననీ, దాని వాడకం వెనక ఆధిపత్య భావజాలముందనీ మిగిలిన ప్రాంతాలవారు వాదించసాగారు. అయితే అప్పటి పత్రికల, సినిమాల భాషలో చాలా వరకూ ఆ రెండు జిల్లాల మాండలికముంది గానీ, పూర్తిగా ఆ భాష ఆ జిల్లాలది గూడా కాదు. ముఖ్యంగా ఆ జిల్లాలకే చెందిన 'వస్తంది, పోతంది' వంటి క్రియారూపాలు అందులో లేవు. అదో రకమైన పుస్తకాల, సినిమాల భాషే గానీ, దాన్ని వాడుకలో యదాతథంగా మాట్లాడేవాళ్ళు లేరు.

1980 ప్రాంతాల్లో రాయలసీమ, తెలంగాణాల నుంచే రచయితలు తమ తమ మాండలికాల్లో రచనలు చేయడం ప్రారంభించిన తర్వాతే సాహిత్యంలో మాండలికాలను వాడచ్చా? అనే విషయం చర్చనీయాంశమైంది. గురజాడ కన్యాశుల్కాన్ని ప్రశ్నించనివాళ్ళు, శ్రీపాదనూ, రావిశాస్త్రినీ, మల్లాది రామకృష్ణ శాస్త్రినీ ప్రశ్నించనివాళ్ళు, రాయలసీమ తెలంగాణా రచయితలను మాత్రం యెద్దేవా చేయడం మొదలుపెట్టారు. నిష్పాక్షికంగా గమనించినప్పుడు మొదట్లో యీ ప్రాంతాల రచయితలు, యితర ప్రాంతాల వాళ్ళకు వెంటనే అర్థం గాని పోరకం గడ్డు మాండలికం వాడారని కూడా అనిపించవచ్చు. అయితే 'సొమ్ములు పోనాయండి' లోని సొమ్ములు పశువులని మిగిలిన ప్రాంతాలవాళ్లు కష్టపడి అర్థం చేసుకున్నారని తెలుసుకోవాలి. కొద్దికాలంలోనే యీ ప్రాంతాల నుంచి అందమైన, వినడానికి సొంపయిన మాండలిక రచనలు రావడంతో యీ చర్చకు మంగళం పాడవలసి వచ్చింది. యిప్పుడయితే హోసూరు, కోయంబత్తూరు ప్రాంతాల నుంచి రాస్తున్న రచయితల భాషలోని మట్టివాసనలు కూడా పాఠకుల్ని వివశుల్ని గావిస్తున్నాయి.

భాష అనే మాధ్యమం ద్వారా తన రచనను రచయిత పాఠకులకు వీలయినంత యెక్కువ ప్రభావపూరితంగా అందించడమే ముఖ్యం. యిందుకు మాండలికం తోడ్పడాలే గానీ అడ్డుగాకూడదు. కొన్ని మాండలిక రచనలకు తెలుగులోని అనువాదకులు కావలసిన పరిస్థితులు కూడా యేర్పడ్డాయని, యిది మంచి ధోరణి గాదనీ గమనించాలి. పైగా రచననంతా పూర్తిగా రచయిత చెబుతున్న కథనంతో బాటుగా మాండలికంలోనే నడపడం యిలాగే సాగితే, యిలా అన్ని ప్రాంతాలవాళ్ళు తమ మాండలికంలోనే కథనంతా (లేక నవలనంతా) రాస్తే, యెన్నిరకాల తెలుగులు తయారయ్యేటట్టు? సాహిత్యంలో కల్పనా వాస్తవికతే వుంటుందిగానీ ఫక్తు యధాతథ వాస్తవికత వుండదు. పాత్రలు ఆయా భాషల్ని వాడడమన్నది కూడా కల్పనా వాస్తవికతే! నిజానికి మనుషులు మాట్లాడే మాటల్ని యధాతథంగా రాయడం సాధ్యం కాదు కూడా. కొన్ని రచనలు కేవలం మాండలికంలో రాయడం వల్లే ప్రాచుర్యం లోకి వస్తున్నాయి. కొందరు పాఠకులు మాండలిక రచనే గొప్పదనే భ్రాంతిలోనూ వుంటున్నారు. మాండలికాన్ని యెంతవరకూ వాడాలో, యెంతవరకు ప్రామాణిక భాషను వాడాలో రచయితే తెలుసుకోవాలి. యిది జఠిలమైన సమస్య. అయితే సాహిత్యం తెలుగువాళ్ళందర్నీ కలపడం కోసమేనని, విభజించడానికి కాదనే ప్రధాన సూత్రాన్ని మరచిపోకూడదు.

యిప్పుడు విరివిగా వస్తున్న రాష్ట్రేతర సాహిత్యం ద్వారా మరుగున పడిపోయిన విలువైన మాటలన్నీ మళ్ళీ వినిమయానికి వస్తున్నాయి. భాషకు సరికొత్త జవసత్వాలను అందిస్తున్నాయి. యీ ప్రయాణం యిలాగే సాగుతూ వుంటుంది. ప్రాచుర్యంలోకి వచ్చే మాండలిక భాష–లేక కొన్ని మాండలిక భాషల కలబోత–ప్రామాణిక భాషగా గుర్తించబడుతూ వుంటుంది.

*రచయిత సెల్ : 98662 43659*

శిశువు శారీరక వికాసానికి తల్లిపాలు
మానసిక వికాసానికి తల్లి భాష

గుండెలోతుల్లోంచి వచ్చేదీ, మనసు
విప్పి చెప్పగలిగేది అమ్మనుడిలోనే.

జాతి సాంస్కృతిక పతాక –మాతృభాష

-సంకేపల్లి నాగేంద్రశర్మ

# ఆంగ్లమాధ్యమం వైపే తెలుగు రాష్ట్రాల పాలకుల మొగ్గు

**మన రెండు తెలుగు రాష్ట్రాలలో పాఠశాల విద్యలో తెలుగు మాధ్యమం కనుమరుగుకానుంది. ప్రాథమిక స్థాయి నుండే ఆంగ్ల మీడియాన్ని ప్రవేశపెట్టడానికి పాలకులు ఉత్సుకతను ప్రదర్శిస్తుం డటం ఇందులకు ప్రధాన కారణం. దేశభాషలందు తెలుగులెస్స అన్న నానుడి తెలుగువాడి నోటిలో వక్రంగా పలకవలసి వస్తుందేమో.**

ఇప్పటికే రెండు తెలుగు రాష్ట్రాలలో ప్రయివేట్ రంగంలో పూర్వ ప్రాథమిక స్థాయి నుండి అంటే కెజీ నుండి పిజి వరకు ఆంగ్లమీడియం విద్యాసంస్థలు గత ఇరవై ఏళ్ల నుండి నడుస్తున్నాయి. చీమల పుట్టల్లా వీధికో ఆంగ్లమీడియం బడి వెలుస్తున్నది. బ్రిటన్, అమెరికా, రష్యా, మలేసియా, సింగపూర్, థాయిలాండ్, బర్మా వంటి దేశాలలో తెలుగు వైభవం ఎగబాగుకుండగా, తానా, ఆటా, తెలంగాణా వంటి ప్రవాసీ సంస్థలు తమ కార్యక్రమాలను ముమ్మరం చేస్తుండగా, తెలుగునాట తెలుగుభాషా వైభవానికి పొగచూరి పోతున్నది. దేశంలో గుర్తించబడిన 22 ప్రధాన భాషల్లో తెలుగుమాట్లాడే వారు 18 కోట్లు వున్నా, ఆచరణరీత్యా మాతృభాషకు జరుగుతున్న అపకారాల్ని మనకు మనమే ప్రశ్నించుకోవాల్సి వస్తోంది. దేశంలో హిందీ భాష తర్వాత తెలుగే అధికంగా మాట్లాడేవారు ఉన్నప్పటికినీ, 2011 నాటి జనాభాలెక్కల్లో మాత్రం సరియైన వివరాలు ఇవ్వకపోవడం వల్ల, తెలుగు మూడవ స్థానంలోకి పడిపోయింది. 2004లో తమిళానికి, సంస్కృతానికి ప్రాచీన భాష హోదాను కట్టబెట్టిన కేంద్ర ప్రభుత్వం పెద్ద ఎత్తున ఆందోళనలు, నిరసనలు జరిగిన తర్వాత కన్నడం, తెలుగు భాషలకు ఈహోదాను 2008లో అందించారు. ఇందుకోసం పెద్దఎత్తున లాబీయింగ్ జరపాల్సి వచ్చింది. రెండువేల సంవత్సరాలకి పైగా చరిత్ర వున్న తెలుగుభాషా వైభవం రానురాను అడుగంటిపోతున్నది,

పాలకుల అస్తవ్యస్త విధానాల వల్లేనని భాషావేత్తలు కన్నీరు కారుస్తున్నారు. చెన్నయి, బెంగుళూరు, కలకత్తా, అహమ్మదాబాద్, తిరువనంతపురం, ముంబై, లక్నో, వారణాసి, భోపాల్, పనాజీ, ఢిల్లీలోని తెలుగు సాహితీ, సాంస్కృతిక సంస్థలు ప్రతిఏటా తెలుగు సభలను నిర్వహిస్తూ, వివిధ రంగాలలోని తెలుగు ప్రముఖులను సన్మానిస్తుంటే, మన రెండు తెలుగు రాష్ట్రాలలో పాలకులు ఆంగ్లభాష మాధ్యమం పట్ల మొగ్గుచూపిస్తున్నారు. ప్రపంచీకరణ, గ్లోబలైజేషన్ వల్ల ఆంగ్లమాధ్యమానికి విపరీతమైన డిమాండ్ సృష్టించబడింది. ఆంగ్లం లేనిదే ఉద్యోగాలు రావని, సాఫ్ట్‌వేర్ రంగానికి వెన్నుదన్నుగా వుంటుందన్న అపోహల్ని పాలకులు ప్రదర్శిస్తుండటమే ఇందులకు కారణం కావచ్చు. తెలుగుతో సహా వివిధ స్థానీయ భాషల్లోకి సాఫ్ట్‌వేర్ ఉపకరణాలు వచ్చినా, ఆంగ్లంమీద ఉన్న వ్యామోహాన్ని చెరిపేయడం లేదు. విద్యావేత్తలు పూర్వ ప్రాథమిక, ప్రాథమిక స్థాయిలో ప్రభుత్వ రంగంలో ఆంగ్లమీడియం బోధన రావడం అంటూ జరిగితే మాతృభాషైన తెలుగు పలుచనై పోతుందన్న ఆందోళనని మన భాషావేత్తలు, వ్యక్తం చేస్తున్నారు. ప్రయివేట్ విద్యారంగం పూర్తిగా వ్యాపార ధోరణిలో నడుస్తుండగా, వాటి కార్యకలాపాల్ని కట్టుదిట్టం చేయాల్సిన పాలకులు అందుకు భిన్నంగా ప్రయివేట్ విద్యావిధానాన్నే ఆలంబన చేసుకోవడానికి సన్నాహాలు ప్రారంభించడం ఎంతవరకు సబబని విద్యావేత్తలు ప్రశ్నిస్తున్నారు. పొరుగున్న వున్న తమిళ, మలయాళ, కర్నాటక రాష్ట్రాలలో పూర్వ, ప్రాథమిక విద్యాబోధనా రంగాలలో ప్రభుత్వ ప్రాపకం ఎక్కువగా వుంది. అక్కడి పాలకులు మాతృభాష బోధన పట్ల మక్కువను ప్రదర్శిస్తున్నారు. అంతేకాక భాషా సాంస్కృతిక ఉత్సవాలను ప్రతిఏటా పెద్దఎత్తున నిర్వహిస్తున్నారు. అక్కడి రాజకీయ రంగం మాతృభాషకు వెన్నుదన్నుగా వుంది. మన రెండు తెలుగు రాష్ట్రాలలో ప్రయివేట్ విద్యాసంస్థల్లో జరిగే వార్షికోత్సవాల్లో పాశ్చాత్య సంస్కృతికే పెద్దపీట వేస్తున్నారు. రైమ్స్, నాటికలు, ఆట- పాటలతో నృత్యాలన్నీ ఆంగ్లంలోనే వుండటం ఒక వెర్రిలా మారిపోయింది. తెలుగు నాట మాతృభాషైన తెలుగు మాధ్యమాన్ని కనుమరుగు చేసే దురాలోచనలో వ్యాపార విద్యారంగం బలోపేతమైంది. పాలకుల విధానాలు సైతం వారికే మద్దతు ప్రకటిస్తున్నట్లుగా వ్యవహరించడం బాధాకరమైన విషయమే. ఐక్యరాజ్యసమితి వారి యునెస్కో ప్రపంచం లోని మాతృభాషల భవిష్యత్తుపై భాషావిధానంపై పదహారేళ్లకిందట ఒక ప్రకటన చేస్తూ, వచ్చే తరం 30 శాతం పిల్లలు మాతృభాషలో చదవకుంటే, ఆ భాషలు కనుమరుగయ్యే దారిలో పడ్డట్లేనని ఖరా ఖండిగా తేల్చిచెప్పింది. ఆ తోవలో మన తెలుగు వుందని విద్యావేత్తలు అంటున్నారు. 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అనే తెలుగుభాషకు గ్రహణం పట్టిందా?.

### జూనియర్ కళాశాలల్లో తెలుగుకు సమాధి

రెండు తెలుగు రాష్ట్రాలలో ప్రయివేట్ జూనియర్ కళాశాలల్లో మాతృభాష తెలుగుకు బదులు సంస్కృతాన్ని ఆప్షనల్‌గా తీసుకుంటు న్నారు. తెలుగునాట తెలుగుకు బదులు సంస్కృతాన్ని ప్రోత్సహించడం ఎంతవరకు సబబని భాషోద్యమకారులు ప్రశ్నిస్తున్నారు. రెండు రాష్ట్రా లలో సుమారు 15 లక్షల మంది రెండేళ్ళ ఇంటర్ కోర్సు విద్యార్థులలో 7 లక్షల మంది సంస్కృతాన్ని తీసుకుని తెలుగుభాషకు మొండిచేయి చూపిస్తున్నారు. సంస్కృతంలో పరీక్ష రాస్తే, నూటికి నూరు మార్కులు వస్తున్నాయని, తెలుగులో పరీక్ష రాసిన వారికి తక్కువగా మార్కులు వేస్తున్నారని ప్రయివేట్ మేనేజిమెంట్లు బాహాటంగా అంటున్నాయి. ప్రస్తుతం అలా లేదని తెలుగు పేపర్ రాసిన వాళ్ళకి మార్కులను గతంలో కాకుండా, ఎక్కువగానే వేస్తున్నామని, ఇందులో ఎలాంటి వివక్షతలు చూపించడం లేదని తెలుగు అధ్యాపకులు వాపోతున్నారు. కేవలం అపోహలను కల్పించి మాతృభాషకు విఘాతం చేసే ధోరణిలో

ప్రయివేట్ మేనేజ్‌మెంట్లు వ్యవహరిస్తున్నాయి. ఈ విద్యా సంవత్సరం నుండైనా ప్రయివేట్ జూనియల్ కాలేజీల్లోనూ తెలుగును తప్పనిసరి చెయ్యాలి. తెలుగు విద్యావేత్తలు, భాషాభిమానులు ఉద్యమంలా ముందుకు వచ్చి ప్రైవేట్ మేనేజిమెంట్లతో చర్చలు జరిపి ఒప్పించాలి.

**తెలంగాణలో మాతృభాషా మాధ్యమాన్ని దెబ్బతీస్తున్న ప్రభుత్వ నిర్ణయాలు**

తెలంగాణా రాష్ట్రంలోని అంగన్‌వాడీలను స్త్రీ మహిళా సంక్షేమ శాఖ నుండి వేరు చేసి, ప్రాథమిక విద్యాస్థాయి పరిధిలోకి తేవాలన్న యోచనలో రాష్ట్ర ప్రభుత్వం వుందని వార్తలు వస్తున్నాయి. అంగన్ వాడీల స్థాయిలో కేజీ కోర్సులు రావడం అంటూ ఆంగ్లమీడియంలో జరిగితే, తెలుగు మాధ్యమానికి మనకు మనం గొయ్యిని సృష్టించు కున్నట్లు కాగలదు. పూర్వ ప్రాథమిక రంగం విద్యాబోధన తెలుగులో సాగితే పిల్లవాడికి పసితనం నుండే మాతృభాష పట్ల మమకారం పెరిగి, మన తెలుగుభాషా సంస్కృతి, నాగరికత తెలిసి వస్తాయని, మాతృభాషా విద్యావిధానాలపట్ల చక్కటి అవగాహన వచ్చి తీరు తుందని భాషావేత్తలు అంటున్నారు. రష్యా, జపాన్, చైనా, జర్మనీ వంటి దేశాలలో అక్కడి మాతృభాషల్లోనే విద్యావిధానాలు రూపొం దించబడుతుంటే, భిన్నంగా మన తెలుగు రాష్ట్రాలలో పాశ్చాత్య విధా నాల్ని పోకడల్ని సొంతం చేసుకోవడం విడ్డూరంగా వుందని భాషా వేత్తలు విమర్శిస్తున్నారు. పొరుగు రాష్ట్రమైన తమిళనాట తెలుగుబళ్ళు ఎత్తివేతకు రంగం సిద్ధమవడంతో అక్కడి తెలుగు ఉద్యమకారులలో ఆందోళన మొదలై ఊపందుకుంది.

జాతీయంగా వున్న త్రిభాషా సూత్రానికి గొడ్డలిపెట్టులా, మాతృ భాషైన తెలుగును ముంచేలా తెలంగాణా ప్రభుత్వం ఈ విద్యా సంవత్సరం నుండే కొత్తగా మరో 250 గురుకులాలను స్థాపించాలని, ఇందులకు పెద్ద ఎత్తున కసరత్తు చేస్తోంది. గతంలో మండలాల వారీగా కేంద్రం నిధులతో సిఎంగా వున్న డా.వైఎస్ హయాంలో ఏర్పాటైన మాడల్ స్కూళ్ళను బలోపేతం చేయాలని, కస్తూరిబా విద్యా సంస్థల్ని ఉన్నతంగా తీర్చిదిద్దాలని యోచిస్తోంది. వివిధ మేనేజి మెంట్లలోని పాఠశాలల్ని ఒకే గొడుగు కిందకి తేవడానికి కసరత్తును ప్రారంభించింది. పాత గురుకులాలకు తోడుగా మరో 250 కొత్త గురుకులాలను ఏర్పాటు చేస్తున్నట్లు తెలంగాణా ముఖ్యమంత్రి కెసీఆర్ –బాబాసాహెబ్ అంబేద్కర్ 125వ జయంతి ఉత్సవంలో ప్రకటిం చారు. దళితులకు 130, గిరిజనులకు 50, మైనారిటీలకు 70 గురుకులాలను కొత్తగా ప్రారంభిస్తున్నట్లు ప్రకటించారు. వీటి నిర్వ హణకు 5 వేల కోట్ల బడ్జెట్‌తో పదివేల మంది బోధనా, బోధనేతర సిబ్బందిని నియమిస్తామని అన్నారు. 1.50 లక్షల మంది విద్యార్థులకు ప్రవేశాలు కల్పించనున్నట్లు ప్రకటించారు. ఒక్కో గురుకులానికి 20 కోట్ల రూపాయలను కేటాయించి, 25 మంది బోధనా సిబ్బంది, 16 మంది బోధనేతర సిబ్బందిని నియమిస్తున్నట్లు తెలిపారు. అయితే గురుకులాల్లో ఆంగ్లమాధ్యమంలోనే బోధిస్తున్నారు. గురుకులాలు మాతృభాషా మాధ్యమానికి విఘాతమైపోయాయి.

ప్రభుత్వ పాఠశాలల్లో ఈవేసవిలో మధ్యాహ్నభోజన పథకాన్ని నడపటానికి ప్రభుత్వం నిర్ణయం తీసుకొంది. కరువులో పిల్లలకు భోజనం పెట్టడానికి ఈ స్కీమును రూపొందించినట్లు ప్రభుత్వం అంటోంది. వేసవిలో పనిచేసే ప్రధానోపాధ్యాయులకు ఒక నెల

**త్రిభాషా సూత్రానికి గొడ్డలిపెట్టులా, మాతృ భాషైన తెలుగును ముంచేలా తెలంగాణా ప్రభుత్వం ఈ విద్యా సంవత్సరం నుండే కొత్తగా మరో 250 గురుకులాలను స్థాపించాలని, ఇందులకు పెద్ద ఎత్తున కసరత్తు చేస్తోంది. గతంలో మండలాల వారీగా కేంద్రం నిధులతో డా.వైఎస్ హయాంలో ఏర్పాటైన మాడల్ స్కూళ్ళను బలోపేతం చేయాలని, కస్తూరిబా విద్యా సంస్థల్ని ఉన్నతంగా తీర్చిదిద్దాలని యోచిస్తోంది.**

సంపాదిత సెలవులు ఇవ్వడానికి విద్యాశాఖ అంగీకరించింది. అంతేకాక తెలంగాణాలోని ప్రాథమికోన్నత పాఠశాలలను రద్దుచేసి, సమీప హైస్కూళ్ళలో విలీనం చేసే ప్రక్రియకు శ్రీకారం చుట్టింది. తెలంగాణా రాష్ట్రంలోని సుమారు రెండువేల బడుల్ని మూతవేయ నున్నట్లు, ఇందులకు విద్యాశాఖ కసరత్తు చేస్తున్నట్లు తెలిసింది. శాస్త్రీయకరణ పేరిట ప్రభుత్వ విద్యారంగాన్ని మరింత దిగజార్చడానికి సన్నాహాలు మొదలయ్యాయి. విద్యార్థులు తక్కువగా వున్న 15 వందల బడుల్ని పక్క స్కూళ్ళలో విలీనం చేయాలని యోచిస్తున్నారు. వేసవి సెలవుల్లోనే పాఠశాలల క్రమబద్ధీకరణ చేయడానికి చర్యలు తీసు కుంటున్నారు. ఒక్క విద్యార్థి కూడా లేని 405 స్కూళ్ళను మూసి వేయాలని నిర్ణయించారు. వందకంటే తక్కువ మంది విద్యార్థులున్న హైస్కూళ్ళు 770 వున్నట్లు ప్రభుత్వ లెక్కలు చెబుతున్నాయి. 30 మంది లోపున్న పాఠశాలలు 12,813 వరకుండగా, అందులో ప్రాథమిక పాఠశాలల సంఖ్య 7060గా తేలింది. జాతీయ విద్యా హక్కుచట్టం ప్రకారం ఏ రకంగా స్కూళ్ళు కొనసాగాలో తేల్చాల్సివుంది. ఇక నుండి ప్రాథమికోన్నత పాఠశాలల్ని ఎత్తివేయడం వల్ల, ప్రాథమిక, హైస్కూళ్ళు మాత్రమే రెండంచెల విధానంగా పనిచేస్తాయి. 1276 ప్రాథమికోన్నత పాఠశాలలుండగా వీటిని సమీపంలోని ఉన్నత పాఠశాలల్లో విలీనం చేస్తారు. 5 కి.మీ.దూరంలో ఉన్నత పాఠశాల లేకపోతే ఈప్రాథమికోన్నత పాఠశాలనే ఉన్నత పాఠశాలగా అప్‌గ్రేడ్ చేస్తారు. శాస్త్రీయకరణ తర్వాతే టీచర్స్ డిఎస్సీ నిర్వహిస్తారని తెలిసింది.

ఆంధ్రాలో మార్చి 8వ తేదీ నుండి పెరిగిన వేసవి ఎండల వేడి దృష్ట్యా ఒక్కపూట బడులు నడిపితే, తెలంగాణాలో మాత్రం ఆధ్యా పకులు, సమాజం నుండి నిరసనలు వచ్చాకే మార్చి 15 నుండి నడపడానికి ప్రభుత్వం ముందుకు వచ్చింది. పెరిగిన ఎండల తీవ్రత దృష్ట్యా వారం రోజుల ముందే వేసవి సెలవుల్ని ప్రీపోన్ చేసింది. ఇది ఇలా వుండగా కొన్ని ప్రాంతాలలో ప్రభుత్వ పాఠశాలలు అధ్యా పకులు గ్రామాల్లో తిరుగుతూ మాపాఠశాలల్లోకి పిల్లల్ని పంపించాలని ప్రయివేట్ పాఠశాలలకు దీటుగా కరపత్రాలు పంచుతూ, ఫ్లెక్సీలు వేస్తూ పోటాపోటీ ప్రచారం చేస్తుండటం కొసమెరుపు. ఒక పక్క శాస్త్రీయకరణ ద్వారా పాఠశాలల కుదింపుజరిగితే మరోపక్క టెట్ నిర్వహణకు, తెలంగాణా పబ్లిక్ సర్వీస్ కమీషన్ ద్వారా టీచర్ల నియామకాల డిఎస్సీ నిర్వహణకు ప్రభుత్వం రంగం సిద్ధం చేసు కుంటోంది. జూన్‌లోగా రెండు రాష్ట్రాలలోని పాఠశాలల్లో ఆధ్యాపకుల కొరత లేకుండా నియామకాలు జరుపుతామని సుప్రీమ్ కోర్టుకు ఈ ప్రభుత్వాలు హామీ ఇచ్చాయి.

*రచయిత ఫోన్ : 94417 97650*

## 'అలెమారియ అంతరంగ'

-అడపాల సుబ్బారెడ్డి

## కన్నడ పుస్తక రచయిత, తెలుగుబిడ్డ

# కుప్పె నాగరాజుతో ముఖాముఖి



ఇంతకుముందు లక్ష్మణరావు గాయక్‌వాడ్ అనే సాహిత్య అకాడెమీ అవార్డు అందుకున్న ఒక రచయితని పరిచయం చేసుకున్నాం. ఆయన ఉచల్యా అని తన తెలుగు సంచార కులం, బాల్యం, కష్టాలు గురించి రాసుకున్న అద్భుతమైన కతల పుస్తకం అది. ఉచల్యాలు మహారాష్ట్రలో ఉన్నారు. ఆ విధంగానే ఇంకొక పుస్తకం వచ్చింది. ఈసారి ప్రస్తుత కర్నాటక రాష్ట్రంలో వున్న తెలుగు సంచార తెగల గురించి రాసిన 'అలెమారియ అంతరంగ' (అంటే ఓ సంచారి అంతరంగం) అని. రాసింది దొంబిదాసర తెగకు చెందిన కుప్పె నాగరాజు. కన్నడ సాహిత్య అకాడమీ అవార్డు పొందిన ఈ కతల పుస్తకాన్ని రంగనాథ రామచంద్రరావు గారు తెలుగు చేశారు.

కుప్పె నాగరాజు గారు తన బాల్యం కడు దుర్భర స్థితిలో గడిపారు. అందరి సంచార తెగల్లాగానే తన పెద్దలు కూడా ఊరూరా తిరుగుతూ కళలను ప్రదర్శిస్తూ అరకొరగా వచ్చిన గింజలు, పైసలుతో తింటూ, అలమటిస్తూ, గడిపిన బాల్యమది. కళకు తగ్గుతున్న ప్రోత్సాహం, సంచార కులాలంటే చిన్నచూపు, అసహ్యం, అనుమానం, సమాజంలో తగ్గుతున్న మానవతావిలువలు-ఇవన్నీ తన ఆకలికి కారణమని రాసుకుంటారు. తన 'దొంబిదాస' అనే తెలుగు సంచార తెగ ఎక్కువగా మైసూరు ప్రాంతంలో సంచరించేవారు. అప్పుడు అది అంతా అచ్చతెలుగు మాన్యమే కదా! ఇప్పుడు కదా కన్నడ ప్రాంతమని ఎల్లలు ఏర్పడింది!! ఇది కూడా మా దుర్భర స్థితికి ఒక కారణమని తన స్వశక్తితో చదివి, పైకొచ్చి, ఒక ఉద్యోగిగా స్థిరపడ్డ మన నాగరాజు గారు అంటారు. ఆయనతో ఆప్యాయంగా ఈ ముఖాముఖి....ప్రత్యేకంగా మన తెలుగుజాతి పత్రిక 'అమ్మనుడి' కోసం....

-సంపాదకుడు

---

**సుబ్బారెడ్డి :** నమస్కారం. తెలంగాణాంధ్రలకు బయట ఉండి, ఇంకొక నుడికి సేవ చేస్తున్న తెలుగువారితో మాటా మంతీ కలపాలన్నది నా కోరిక. ఆ పనిమీద మిమ్మల్ని కలవాలనుకున్నాను. నేను మైసూరు వరకూ రాకుండానే, మీరు హైదరాబాదుకు రావడం నాకు జరిగిన మేలు. మిమ్మల్ని ఇట్లా కలవడం చాలా ఆనందంగా ఉంది.

**నాగరాజు :** నమస్కారం. నా గురించి మీకు ఎప్పుడు, ఎట్లా తెలుసు?

**సుబ్బారెడ్డి :** ఇటీవలనే మీరు రాసిన 'అలెమారియ అంతరంగ' కు తెలుగు అనువాదాన్ని చదివినాను. అనువాదం చేసిన రంగనాథ రామచంద్రరావు గారు (వీరి ఇంటిలోనే మాటా మంతీ జరుగుతున్నది) స.వెం.రమేశ్‌కు పంపినారు. రమేశ్ నాకు మంచి మిత్రుడు. ఈ కతలను చదివిన రమేశ్ సంతోషంతో ఉబ్బితబ్బిబ్బయి వాటిని నాకు పంపినారు. ఆ కతల గుండానే మీరు తెలుసు నాకు. ఇప్పుడిట్లా నేరుగా కలుసుకొన్నాను. మరి నా అడకలను మొదలుపెట్టచ్చా?

**నాగరాజు :** సంతోషం. మీకు ఏమి కావాలో అడగండి. నాకు తెలిసింది చెప్తాను.

**సుబ్బారెడ్డి :** మీరు తెలుగువారే అని తెలుసుకానీ, తెలుగును ఇంత బాగా మాట్లాడగలరని అనుకోలేదు. మీరు ఇళ్ళల్లో ఇంకా తెలుగును మాట్లాడుతున్నారా?

**నాగరాజు :** అవును. 'దొంబిదాసరి' అనే అలమరి జాతికి చెందిన మేము తెలుగువాళ్లమే. అయితే మా తెలుగు ఇంటికే పరిమితం. ఇంటిలో తెలుగునే మాట్లాడినా, బయట మా బతుకంతా కన్నడ వాళ్ళతోనే. అందుకే తెలుగు మాట్లాడేది వస్తుంది కానీ రాసేకి చదివేకి వచ్చేలేదు. బయట ఉండి చదువుకొన్న నా చిన్నకొడుకు కౌశిక్ వీడు. వీనికి అయితే మాట్లాడేకి కూడా వచ్చేలేదు.

**సుబ్బారెడ్డి :** మీ జాతి (కులం) పేరును 'దొంబిదాస' అంటారు కదా, ఆ పేరు ఎట్లొచ్చింది?

**నాగరాజు :** మాది ఊరూరికీ తిరుగుతా ఉండే జాతి. ఒక తావున కుదురుగా ఉండేది తెలియని వాళ్ళం మేము. గంగెద్దులను ఆడిస్తా, పురాణ గాథలను బయలాటలుగా ఆడుతా తిరుగుతా ఉంటాము. మేము ఆడే బయలాటల్లో 'దొమ్మి' అంటే గలాట ఎక్కువగా ఉంటుందని, చూసేవాళ్ళు మాకు ఆ పేరును పెట్టిండచ్చు.

**సుబ్బారెడ్డి :** దొంబిదాసరులు కాకుండా వేరే దాసరులు ఉన్నారా ఇప్పటి కర్నాటకలో?

**నాగరాజు :** ఉన్నారు..ఉన్నారు. చెన్నదాసర్లు, మాలదాసర్లు– వీరినే కన్నడలో హొలెయ దాసరి అంటారు. చక్రవాద్య దాసర్లు, దొంగదాసర్లు ఇట్లా ఇంకకొన్ని దాసరి జాతులు ఉన్నాయి. అందరి తల్లి నుడి తెలుగే. దాసర్లు అందరూ వైష్ణవ సంప్రదాయాన్ని పాటించేవాళ్ళే. నిజానికి మా దాసరి జాతులకుదురు అంతా ఒకటే. ఎన్నో కారణాల వలన వేరు వేరు పేర్లు వచ్చినాయి. మాల వారిని

నమ్ముకొని తిరిగే వాళ్ళు మాలదాసర్లు, అన్ని జాతుల దగ్గరా అడిగేవాళ్లు దొంబిదాసర్లు...ఇట్లా. దొంగ దాసరులంటే దొంగతనం చేసేవారు అని కాదు. మా లోని ఒక తెగవారే వారు కూడా. మేమంతా తిరుపతి వెంకట రమణస్వామి భక్తులం. ఒకానొక కాలంలో మాలోని కొందరు, ఆ స్వామిపైన కోపం చేసుకొని, కొండకు పోకుండా వెనక్కు పొయ్యేసినారంట. దానికనే వాళ్లను దొంగదాసర్లు అని మేమే అన్నాము.

సుబ్బారెడ్డి : ఓహో. అట్లయితే మహారాష్ట్రలోని సంతముచ్చులలాగా వీళ్ళు దొంగలు కారన్నమాట!

నాగరాజు : కాదు కాదు..దొంగదాసర్లకూ దొంగతనానికీ సంబంధమే లేదు. కానీ తెల్లవాళ్ళకాలంలో మావంటి ఎన్నో అలమరి జాతుల మీద దొంగలుగా ముద్రపడిపోయింది. నింద మోపి చెరలో తోసేకి అనువుగా దొరికేది మాలాంటి ఇల్లూవాకిలి లేనోళ్లే కదా. అందుకే బ్రిటీష్‌వాళ్ళు ఎన్నో అలమరి జాతులను దొంగలుగా ముద్రవేసి సమాజానికి దూరం చేసినారు. మా అదృష్టం ఏమంటే దొంబిదాసర్లకు ఆ దొంగముద్రను వేయలేదు. కానీ స్వరాజ్యం వచ్చినంక కూడా మాలో కొన్ని జాతులు ఎస్సీలుగా, కొన్ని జాతులు డిఎన్‌టీలుగా కొన్ని జాతులు బీసీలుగా ఉండడం. అందరం చేసే కసుపు (వృత్తి), బతికే బతుకూ ఒకటే అయినపుడు, అందరికీ సమాన హోదా ఉండాల కదా. చెన్నదాసర్ల లాగా మాలదాసర్ల లాగా దొంబిదాసర్లనీ చక్రవాద్య దాసర్లనీ కూడా ఎస్సీలుగా గుర్తించాలనేదే మా కోరిక. ఇంకొక సంగతిని చెప్పాల. మమ్మల్ని కొన్ని తావుల్లో 'హెణ్ణు దాసరి' అని కూడా పిలుస్తుంటారు. కన్నడలో ఆడవాళ్ళని 'హెణ్ణు' అంటారు. మేము ఆడే బయలాటల్లో ఆడపాత్రలను కూడా మగవాళ్ళమే వేస్తాము. అందుకే ఆ పేరు వచ్చింది. జాతికే కాదు, మనుషులకు కూడా పాత్రల పేర్లు వచ్చేస్తుంటాయి. ఇది మా గుంపుకి విరివిగా అతికేదే. మా నాయన కోడంగి పాత్రను వేసేవారు. అందుకే ఆయన అసలు పేరు 'సింగయ్య' పోయి, 'కోడంగయ్య' అనే పాత్రపేరు వచ్చేసింది.

సుబ్బారెడ్డి : కన్నడిగులకు ఇంటిపేర్లు ఉండవు, తెలుగువాళ్ళకు ఉంటాయి అంటారు కదా.మీకు ఇంటిపేర్లు ఉన్నాయా?

నాగరాజు : ఉన్నాయి. వాటిని ఇంటిపేరు అనము. బుడకట్టు అనీ బెడగు అనీ అంటాము. వీటిని నేను సేకరించినాను. దొంబిదాసర్లలో 76 బుడకట్టులు ఉన్నాయి. వీళ్ళలో అన్నదమ్ముల వరసయినవాళ్ళూ, బావమరుదుల వరసయిన వాళ్ళూ ఉన్నారు. (మొత్తం 76 ఇంటిపేర్లను ఇచ్చినారు. పట్టికలో చూడండి.)

సుబ్బారెడ్డి : మీ ఇంటిపేరు ఏమిటండీ?

నాగరాజు : నా ఇంటిపేరును చెప్పేముందు మా ఆడోళ్ళ ఇంటిపేరును చెప్పాల కదా. వాళ్ళ ఇంటిపేరు బంగారపోళ్లు. నా ఇంటిపేరు బడతోరు.

సుబ్బారెడ్డి : మీ కసుపును గురించి కొద్దిగా వివరించగలరా?

నాగరాజు: ముందే చెప్పినట్లు, బయలాటలు ఆడుతూ తిరగడం మా దొంబిదాసర్ల కసుపు. దీనిని మేము 'ధర్మభిక్షం' అంటాము. కొందరుఎద్దులను మరిపి వాటిని ఆడిస్తుంటారు. మావాళ్ళు ఊరికే చేయిచాచి అడుక్కొనే వాళ్లు కాదు. ఒక కతనో చరిత్రనో రామాయణం లాంటి పురాణాన్నో గానం చేస్తా, వేషం కట్టి ఆట ఆడుతా, నలుగురికీ వినోదాన్ని పంచి, ఆ నలుగురూ దయతలచి ఇచ్చిన దుడ్డూ దవసం (ధనధాన్యం) తో బతికేవాళ్లు.

సుబ్బారెడ్డి : ఇప్పటికీ ఈ కసువును చేసేవాళ్ళు ఉన్నారా?

నాగరాజు : ఉన్నారు కానీ, బాగా తగ్గిపోయినారు. ఇప్పుడు చానా అడ్డంకులు వచ్చినాయి. కానూను (చట్టం) కూడా మాకు అడ్డం పడింది. మావాళ్ళు బిచ్చగాళ్లము కాదు. కళాకారులము సామీ' అంటున్నా వాళ్ళకు యాంటీ బెగ్గింగ్ యాక్టు నుండి సడలింపు దొరకలేదు. మమ్మల్నీ బిచ్చగాళ్ళ గాటిలోనే కట్టేసినారు. సమాజంలో కూడా మా కళపట్ల విలువ తగ్గింది. డ్రామా కంపెనీల రాకతో మేము వెనకపడినాము. వాళ్ళకున్నట్లు మైకులూ, తెరలూ, అలంకారాలూ, లైట్లూ మాకు లేవు. దాంతో జనం మా బయలాటలను వదిలేసి డ్రామాల వెనకన పడినారు. టీవీ పెట్టెలు వచ్చినాక ఇంకా తక్కువయి పొయింది. 'బయలాట' అనే పేరును విననివారే ఈ తరంలో ఎక్కువమంది ఉన్నారు. దాంతో మావాళ్లూ బయలాటలను ఆడేది తగ్గించేసినారు. సంప్రదాయపు కసుపును చేసే దొంబిదాసర్లు నూటికి పదిమంది కూడా లేరిపుడు. మాఊర్లో అయితే ఒక్కరు కూడా లేరు. అట్లని అందరూ చదువుకొని ఉద్యోగాలు సంపాదించి బాగు పడిపోయినారా అంటే అదీ లేదు. దేనికే కాకుండా పొయిన బతుకులే ఎక్కువ మా అరమరిజాతుల్లో.

సుబ్బారెడ్డి : కర్నాటక సర్కారు మీకు సేద్యపు నేలలను ఇచ్చిందట కదా?

నాగరాజు : ఇచ్చి ఉపయోగమేమి? ఒక కాపోనికి వేషం కట్టి బయలాట ఆడేకి ఎట్ల వచ్చేది లేదో, మాకూ అట్లే సాగు చేసేకి వచ్చే లేదు. ఆటాడించేకి ఎద్దుల్ని మరపగలిగినామే కానీ, మడక కాడి కిందకి మరపలేకపొయినాము. దాంతో ఆ నేలలు మా చేతుల్ని దాటిపొయినాయి. నా కతలలో నేను రాసినాను, మా అమ్మకయినా అంతో ఇంతో కూలి పనులు వస్తాయి కానీ మా నాయనికి సుత రామూ రావని. గజ్జెకట్టి ఆడే కళాకారుడిని మేడి పట్టి దున్నమంటే అయితుందా? ఇప్పుడు మావాళ్ళు చిన్న చిన్న వ్యాపారాలు చిల్లర ఉద్యోగాలూ చేసుకొంటా బతుకుతున్నారు.

సుబ్బారెడ్డి : మీ కతల్లో మీరు 'బడగసీమ' వాళ్లమని రాసినారు. ఎక్కడిది ఆ బడగసీమ?

నాగరాజు : ఆ మాటతో కన్నడిగులు మమ్మల్ని పిలుస్తుంటారు. బడగసీమ అంటే ఉత్తరం పక్కన ఉండేది అని. మైసూరు

సీమకు ఉత్తరంగా ఉండే కుప్పం, కడప లాంటి రాయల సీమ వాసులం అయి ఉండవచ్చు మేము. అందుకే అట్లా అంటారేమో.

సుబ్బారెడ్డి : ఓహో, అందుకేనా మీ పేరుకు ముందు బదతోరు మీ ఇంటిపేరు కాకుండా, 'కుప్పె' అని ఉంది? 'కుప్పె' అంటే కుప్పమా?

నాగరాజు : కాదు కాదు, 'కుప్పె' అనేది మైసూరు జిల్లాలో ఒక ఊరి పేరు. అలమరితనం నుండి నా చిన్నతనంలోనే మా కుటుంబం 'కుప్పె' అనే ఊరిలో కుదురుకొనింది. అక్కడే చేరెడు నేలలో చిన్న గుడిసెలో మా బతుకులు సాగినాయి. పెద్దయినాక నా స్నేహితులు నన్నూ నా ఊరిపేరునూ కలిపి పిలువసాగినారు. చివరకు నా పేరు కుప్పె నాగరాజు అయింది.

సుబ్బారెడ్డి : మీరు పాటించే సంప్రదాయాలూ సాంగేలను గురించి చెప్పండి?

నాగరాజు : ముందు మాదిరిగా ఇప్పుడు ఏ సంప్రదాయమూ నడుస్తా లేదు. అప్పుడు ఐదు దినాల పెళ్లి, ఇప్పుడు ఐదుగంటలు కూడా లేదు. అప్పుడు వరకట్నం అనేదే లేదు, ఇప్పుడు కొద్దికొద్దిగా సురువయింది. అప్పుడు మొగుడు చనిపోయిన ఆడోళ్లు మారుమనువు చేసుకొన వచ్చు. ఇప్పుడు చేసుకొనాలన్నా ముందుకొచ్చే మగోళ్లు లేరు. అప్పుడు చచ్చిపొయినవాళ్ళని పూడిచిపెట్టేవాళ్లం, జాగాలు లేక ఇప్పుడు కాలుస్తా ఉన్నాం. మా అమ్మ చచ్చిపొయినప్పుడు మా జాతికి సుడగాడు (శ్మశానం) లేక, మానుకింద పెట్టి, నీళ్ల చెంబును పెట్టి వదిలి వచ్చినాం. నేల లేదంటే ఉనికి లేదని అనెంక తెలిసింది మాకు. మాది వైష్ణవ సంప్రదాయం. మాలో దాస కూటం, వ్యాసకూటం అని ఉంటాయి. వ్యాసకూటం వారు సిద్ధాంతాన్ని చేసేవారు. దాసకూటం వారు దానిని ప్రచారం లోకి తెచ్చేవారు.

సుబ్బారెడ్డి : మీలాగే మహారాష్ట్రలోని లక్ష్మణ్‌రావ్ గైక్వాడ్ గారు కూడా, వారి తెలుగుదనాన్ని గురించి చాలా చెప్పినారు.

( ప్రసిద్ధిగాంచిన 'ఉచల్యా'గ్రంథ రచయిత లక్ష్మణరావ్ గైక్వాడ్. 'నడుస్తున్న చరిత్ర'లో వారితో ముఖాముఖీని ప్రచు రించాం. దాన్ని కూడా అడపాల సుబ్బారెడ్డే చేశారు. –సం.

నాగరాజు : ఆయన నాకు మంచి మిత్రుడు. ఆయనా నేనూ మహా శ్వేతాదేవిగారూ కలిసి, మూలవాసుల, అలమరి తెగల గురించి కొంతకాలం పనిచేసినాం.

సుబ్బారెడ్డి : నేల లేకుంటే ఉనికి లేదన్నారే ఎట్లా?

నాగరాజు: మా అమ్మ చావే పెద్ద ఉదాహరణ. ఆమెను పూడ్చడానికి చేరెడు నేల దొరకలేదు మాకు. నేల ఒక్కటే కాదు నుడి కూడా సమస్యే మాకు. మేము ఇంట్లో తెలుగును మాట్లాడినా బయటంతా మా ఆటా మాటా పాటా అంతా కన్నడమే. ఎంతో గొప్పదైన కన్నడ సంస్కృతిలో మా పాత్రా తగినంత ఉంది. అయినా మాపట్ల వివక్ష

## వచ్చే నెల నుండి
## 'అలెమారి అంతరంగ' ధారావాహిక



కుప్పె నాగరాజు గారు కన్నడంలో రచించిన 'అలెమారి అంతరంగ'కు రంగనాథ రామచంద్రరావు గారి తెలుగు అనువాదం 'ఓ సంచారి అంతరంగం'ను జూన్ నెల నుండి 'అమ్మనుడి' పత్రికలో ప్రతి నెలా ధారా వాహిక (సీరియల్)గా ప్రచురిస్తాము. చదు వరులు గమనించ గోరుతున్నాము.

–సంపాదకుడు

ఉంది. 1977లో దేవరాజ అర్స్ గారు మమ్మల్ని బీసీ వర్గంలో చేర్చకుండా ఓపెన్ కేటగిరిలో చేర్చేసినారు. అందరికీ జనబలం ఉంది, కన్నడిగులనే భాషాబలమూ ఉంది. మేము చాలా చిన్నగుంపు, పైగా తెలుగువాళ్లమనే ముద్ర, బీసీ వర్గంలో చేరడానికే ఎంతో పాటుపడవలసి వచ్చింది. ఇప్పుడు ఎస్సీ వర్గంలో చేర్చమనే మా కోరి కను వినేవాడు కూడా లేదు ఇక్కడ. బతుకుకు అడ్డమని అమ్మని వదులుకోలేము కదా!

సుబ్బారెడ్డి : బయట కాకపోయినా, ఇళ్లలోనైనా తెలుగు పాటలను పాడుకొంటున్నారా?

నాగరాజు : పెళ్ళిళ్లలో, చావుల్లో ఇంకా తెలుగులోనే మాటా పాటా నడుస్తున్నాయి.

సుబ్బారెడ్డి : మీరేదైనా ఒక పాటను పాడగలరా?

నాగరాజు : లేదు లేదు, నాకు మా పాటలు వచ్చే లేదు. మా పరిస్థితి చూసి చూసి, నాకు మా బతుకులంటే, మా కసుపంటే ఒక రకమైన ఏవగింపు ఉండేది. ఆ ఏవగింపూ కోపం సిగ్గుల వలన నేను ఒక పాటను కూడా నేర్చుకోలేదు. మా నాయనతో కలసి ఒక భిక్షకి గానీ, ఒక కార్యానికి గానీ పోలేదు. పెద్దయినంక ఒకనాడు, జీశామ్ పరమ శివయ్యగారు రాసిన 'దక్షిణ కర్నాటక జనపద కావ్య ప్రకారగళు' అనే పుస్తకాన్ని చదివినాను. అప్పుడే నాకు కనువిప్పు కలిగింది. నేను ఏవగించుకొన్న మా బతుకు ఎంత గొప్పదో తెలిసింది. ఆ స్ఫూర్తితో 2003లో మైసూ రులో పెద్ద దొంబి దాసర్ల సమావేశాన్ని నడిపినాను. మాపై నున్న వివక్షను ఎదురుకొనడానికి పూనుకొన్నాను. ఇప్పుడు నేర్చుకోవాలన్నా పాటలను నేర్చుకోలేను కదా.

సుబ్బారెడ్డి : మనదేశంలోని నిచ్చెనమెట్ల కులం తీరులో మీ దొంబి దాసర్ల తావు ఎక్కడ?

నాగరాజు : మేము శూద్రులలో అట్టడుగు పొర. అయితే అంటరాని వారం కాము. పురాణగాథల ప్రచారానికి మేము కావాలి కదా, అందుకేనేమో మాకు అంటరానితనాన్ని కట్టబెట్ట లేదు. అదొక్కటే తేడా అంతే. మిగిలిన అన్ని విష యాలలోనూ మేము దళితులమే.

సుబ్బారెడ్డి : మీ పుస్తకంలో ఒకచోట, మైసూరు దగ్గర కుశాలనగరలో ఉండే బౌద్ధ భిక్షువుల గురించి రాసినారు...?

నాగరాజు : అవునవును..వాళ్ళంతా టిబెట్టు నుండి తలదాపుకు వచ్చినవారు. సొంతనేలను వదలి, ఎక్కడికో వచ్చిబత కటం దయనీయమే. వాళ్ళ పట్ల నాకు సానుభూతి ఉంది. అయితే ఎక్కడి నుండో వచ్చినవారికి దొరికినంత గూడు కూడా, ఈ నేలమీద మాకు దొరకటం లేదే అన్నదే మా వెతంతా.

సుబ్బారెడ్డి : దొంబిదాసర్లు కాకుండా కర్నాటకలో ఇంకా ఏవైనా తెలుగు అలమరి జాతులున్నాయా?

నాగరాజు : ఉన్నాయి. దాసర్లలోనే చెన్నదాసర్లు, మాలదాసర్లు, చక్రవాద్యదాసర్లు, దొంగదాసర్లు ఉన్నారు. బుడగ జంగం, బేడ జంగం, దక్కలిగ, సిందోళ్ళు, సుడుగాడు సిద్దులు పిచ్చిగుంతోళ్లు...ఇట్లా ఎన్నో తెలుగు అలమరి జాతులు కర్నాటకలో ఉన్నాయి.

సుబ్బారెడ్డి : మీ కొడుకులకు తెలుగు మాట్లాడటం తెలియదన్నారు కదా...!

నాగరాజు : పెద్ద కొడుకుకు తెలుసు, వాడు ఇంటిదగ్గర పెరిగిన వాడు. ఈ చిన్నవాడు హాస్టల్లో పెరగటం వల్ల వీడికి తెలియదు. నాకు కూడా రంగనాథ రామచంద్రరావు గారి పరిచయం తరువాత తెలుగు లిపిని నేర్చుకోవాలని ఆశగా ఉంది. మేము మాట్లాడే తెలుగుకి పత్రికలలో వచ్చే తెలుగుకీ ఎంతో వ్యత్యాసం ఉంది. అదే కొంచె ఇక్కట్టుగా ఉంది.

సుబ్బారెడ్డి : అట్ల ఏమీ లేదండి. మీరు మాట్లాడుతున్నట్లే ఉండే తెలుగు తమిళనాడులోని హోసూరు తావులో ఉంది. అక్కడి నుండి ఆ తావు తెలుగులోనే కతల పొత్తాలు వస్తున్నాయి. మీ దగ్గర ఆత్మీయమైన తెలుగు ఉంది. ఆ తెలుగులోనే మీరు రాయచ్చు.
కన్నడం చదివిన మీకు తెలుగు రాతలను నేర్చుకోవడం పెద్ద ఇక్కట్టూ కాదు. మీ నుండి మీ తెలుగులో కతల కోసం మేము ఎదురుచూస్తుంటాం సార్.

నాగరాజు : సంతోషం సుబ్బారెడ్డీ! మీరు తెంపును ఇచ్చిండారు కదా ప్రయత్నము చేస్తాను.

సుబ్బారెడ్డి : ఉంటానండీ, నమస్కారం. ❃

## దొంబిదాసరులు ఇంటిపేర్లు

1. అందావోళ్లు
2. అంబి(అప్ప) శెట్టోళ్లు
3. అక్కిన పల్లోళ్లు
4. అమల శెట్టోళ్లు
5. అరవోళ్లు
6. ఆచారివోళ్లు
7. బంగలోళ్లు
8. బంగారోళ్లు
9. బట్టోళ్లు
10. నబింగోళ్లు
11. బెలపకొండోళ్లు
12. బొమ్మన పల్లోళ్లు
13. దండోళ్లు
14. దేవరకొండోళ్లు
15. దేవరపల్లోళ్లు
16. దొంతర బైనోళ్లు
17. ఇంగోళ్లు
18. ఇరగంటోళ్లు
19. గద్దెవోళ్లు
20. గోదావోళ్లు
21. గోగసానోళ్లు
22. గోలోళ్లు
23. గుడిగాళ్లు
24. గురుమోళ్లు
25. గౌరముచ్చోళ్లు
26. చెల్లోళ్లు
27. జంగాలోళ్లు
28. జంబలోళ్లు
29. జట్టోళ్లు
30. జారపలోళ్లు
31. జోగలోళ్లు
32. కుందూరోళ్లు
33. కొండావోళ్లు
34. కతారోళ్లు
35. కోమటోళ్లు
36. కురుపట్టోళ్లు
37. కేసపైనోళ్లు
38. మల్లిశెట్టోళ్లు
39. మాగనూరోళ్లు
40. మేడావోళ్లు
41. మిరాలోళ్లు
42. ముదనూరోళ్లు
43. ముత్యాలోళ్లు
44. ముత్తిమశెట్టోళ్లు
45. మైలారోళ్లు
46. మొగసాలోళ్లు
47. నంద్యాలోళ్లు
48. నక్కలోళ్లు
49. నరాలోళ్లు
50. నామావోళ్లు
51. నేచపైనోళ్లు
52. పదుతులోళ్లు
53. పల్లేటోళ్లు
54. పసుపులేటోళ్లు
55. పాకలోళ్లు
56. పాయలోళ్లు
57. పారలోళ్లు
58. పిన్నమోళ్లు
59. పులిమోళ్లు
60. పూలోళ్లు
61. పోలబైనోళ్లు
62. రాగమోళ్లు
63. సంగమోళ్లు
64. సింతలోళ్లు
65. సోలావోళ్లు
66. శ్రీరామోళ్లు
67. సీదావోళ్లు
68. సెరపల్లోళ్లు
69. సోగలోళ్లు
70. తమటమోళ్లు
71. తిప్పోళ్లు
72. ఉప్పోళ్లు
73. వాటోళ్లు
74. వేదమోళ్లు
75. యంటపల్లోళ్లు
76. యరగుంటోళ్లు

## తెలుగువాణి వార్తలు

(తమిళనాడు తెలుగు రాత, చదువు నేర్పే పని గురించి)

కోయంబత్తూరు పి.ఎస్.జి.సర్వజన స్కూల్‌లో ఫిబ్రవరి 14న తెలుగు తరగతులు మొదలైన సంగతి 'అమ్మనుడి' చదువరులకు తెలిసిందే. తరగతులలో పాల్గొన్న వారంతా ఫిబ్రవరి 21న 'ఎల్ల నాడుల అమ్మనుడి పండుగ' ను జరుపు కొన్నారు. 12 వారాలు ఆటంకం లేకుండా జరిగిన తరగతులు మే1న పూర్తి అయినాయి. 60 మంది తెలుగు చదవటం, రాయటం నేర్చుకొన్నారు. మే 8న వీరందరికీ సర్టిఫికెట్లు (ఒరపు రేకు= యోగ్యతాపత్రం) ఇవ్వడం కోసం ఒక చిన్న వేడుకను జరుపుకొనబోతున్నారు.

ఉడుములపేట తాలూకాలోని 100 గ్రామాలలో జూన్ మొదటివారం నుండి తెలుగు తరగతులను నడుపడం కోసం తొలివిడతగా ఐదుగురు పరపరులకు (పరపు= వ్యాప్తి) పరపరి= వ్యాపింప జేసేవాడు= ప్రచారకుడు) అలవరపు తరగతులు ఉడుములపేటలో జరిగినాయి.

-డా॥ఈమని శివనాగిరెడ్డి

# శాతవాహనుల ముందరి రాజులు

**రాజ...మహారాజ...మహామేగవాహన...మహాతలవర...మహారథ**

**అ**శోకుని తరువాత మగధ సామ్రాజ్యం బలహీనపడింది. అప్పటివరకూ అశోకునికి సామంతులుగా వున్న మాండలీకులు అశోకుని మనుమడైన దశరథుని కాలం నుంచి స్వతంత్రులై ఎవరి భూభాగాల్ని వారు పాలించుకోవటం మొదలుపెట్టారు. వారిలో మధ్యభారతదేశంలో శుంగులు, తెలుగునేలపై చిన్న చిన్న రాజులు ఉన్నారు. అప్పట్లో ఇప్పటి తెలంగాణా ప్రాంతాన్ని స్థానిక రాజులైన గోబధ, సమగోప, నరన, కంవాయ అనేవారు పాలించినట్లు కరీం నగర్ జిల్లా కోటలింగాలలో దొరికిన వారి నాణాలు రుజువు చేశాయి. వీరు దాదాపు మౌర్యుల చివరిపాలనా కాలంలో పాలనలోకొచ్చి క్రీ.పూ. 2వ శతాబ్ది వరకు రాజ్యమేలారని, ఈ దిశగా పరిశోధన గావించిన డా॥దేమి రాజారెడ్డి తేల్చి చెప్పారు. ఇదే సమయంలో తీరాంధ్రాన్ని అనేక రాజులు పాలించినట్లు తెలుస్తుంది. భట్టిప్రోలు ప్రాంతాన్ని రాజా కుబిరకుడు, అమరావతి దగ్గరి వడ్డమానును రాజా సోమకుడు, వేల్పూరు (గుంటూరు) ప్రాంతాన్ని గుంటుపల్లి (పశ్చిమ గోదావరి) సదవంశీయులు, కర్నూలు ప్రాంతాన్ని మహారథులు పాలించిన ఆధారాలు దొరికాయి. అలాగే శ్రీకాకుళం జిల్లా శాలి హుండం ప్రాంతాన్ని రాజా అశోకుడు పాలించాడు.సద వంశీయుల్లో సిరిసద, మహాసద, అశోకసద, శివసద, శివమకసదలు ముఖ్యులు. వీరిలో సిరిసద, గుంటుపల్లి శాసనంలో మహారాజ, మహామేఘ వాహన అన్న బిరుదులను చెప్పుకున్నాడు. పరిశీలించి చూస్తే ముందుగా స్థానిక తెలుగు పాలకులు, అశోకుని మాదిరిగనే 'రాజా' అన్న పాలనాపర శబ్దాన్ని తాము కూడా స్వీకరించినట్లు ఆ క్రమంలోనే మహారాజ బిరుదం కూడా చేరినట్లు చెప్పవచ్చు. ఒక్క సిరిసదకు మాత్రమే మహారాజ బిరుదు ఉండటాన్ని బట్టి, ఇతడు పశ్చిమ గోదావరి జిల్లా గుంటుపల్లి నుంచి గానీ, లేక సమీప రాజధాని నగరం నుంచి గానీ పాలించి, చిన్న చిన్న రాజ్యాల (రాజుల)పై ఆధిపత్యాన్ని సాధించి ఉంటాడు. కర్నూలుజిల్లా వీరాపురం వద్ద బిర్లాపురావస్తు, సాంస్కృతిక సంస్థ జరిపిన తవ్వకాల్లో మహాహస్తిన్, శివ మహాహస్తిన్, ఖడపోరిహస్తిన్ అనే రాజులు విడుదల చేసిన నాణాలు దొరికి, వారి ఉనికిని తెలియజేశాయి. మహారాష్ట్రలోని కొల్హాపురం నుంచి పాలించినట్లుగా చెప్పబడుతున్న 'మహారథి' వంశానికి చెందిన ఈ రాజులు క్రమంగా దిగువనున్న తెలంగాణా, ఆంధ్రా ప్రాంతాలను అదుపులోకి తెచ్చుకొన్నట్లు మెదక్ జిల్లా, కొండాపూర్, హైదరాబాద్, కర్నూలు జిల్లా వీరాపురంలలో దొరికిన నాణాలను బట్టి చెప్పవచ్చు. వీరి నాణాలపై ఎద్దు, సింహం బొమ్మలుండటం గమనార్హం. వీరాపురంలో దొరికిన వీరి నాణాలపై ఏనుగుబొమ్మ ముద్రించబడింది. శాతవాహన ముందరి కాలానికి (క్రీ.పూ. 2వ శతాబ్ది) చెందిన ఈ మహారథుల నాణాల విధానాన్ని వారి తరువాత పాలనా పగ్గాలు చేతబూనిన శాతవాహనులు స్వీకరించి, మెరుగు పరిచారని కూడా చెప్పొచ్చు.

తెలంగాణా ప్రాంతంలో పెద్ద బంకూరు, కోటిలింగాల్లో దొరికిన చిన్న శాసనాక్షరాలున్న నాణాలపైన శివసేవక అన్న రాజుకు ముందు 'మహాతలవర' అన్న బిరుదు వుంది.

పరిశీలించి చూస్తే, ఇప్పటి తెలంగాణా, ఆంధ్ర ప్రాంతాలు అశోకుని తరువాత స్వతంత్రరాజ్యాలుగా ఆవిర్భవించాయనే వాటి స్థానిక పాలకులు 'రాజ' అన్న బిరుదుతో పాలించారనీ వీరు, శాత వాహనులకంటే ముందరి కాలానికి చెందిన రాజులనీ, వారు కూడా ఎద్దు, ఏనుగు, గుర్రం, సింహంలాంటి బొమ్మల్ని తమ నాణాలపై ముద్రించుకొని చలామణిలోకి తెచ్చారని తెలుస్తుంది. ముందు 'రాజ' తరువాత *'మహారాజ'* ఇంకా *'మహా తలవర'*, *'మహామేఘవాహన'*, *'మహారథి'* అన్న బిరుదులను కూడా ఈ స్థానిక పాలకులు ధరించి నట్లు తెలుస్తుంది. తెలంగాణా ప్రాంతాన్ని పాలించిన, వంశనామం తెలియని గోబధ, సమగోప, నరన, కంవాయిలు 'రాజ' బిరుదాన్ని, ఇదే ప్రాంతంతోపాటు కృష్ణా-తుంగభద్ర ప్రాంతాన్ని పాలించిన 'మహారథులు' వారి నాణాలపైన *'మహారథి'* అన్న బిరుదాన్ని తెలంగాణా నుంచే పాలించిన శెలక వంశీయులు 'మహా తలవర' బిరుదును, తీరాంధ్ర నుంచి పాలించిన కుబిరక, సోమక, అశోకులు 'రాజ' బిరుదాన్ని, గుంటుపల్లి, అమరావతి పశ్చిమ భాగాన్ని పాలించిన 'సద' వంశీయులు 'మహారాజ' బిరుదాన్ని వహించినట్లు తొలుత వారు విడుదల చేసిన నాణాలు, తరువాత బ్రాహ్మి(ప్రాకృత) శాసనాలు రుజువు చేస్తున్నాయి. రాజు నుంచి మహారాజు దాకా స్థాయి పెరిగిందని, ఏలుతున్న భూభాగం కూడా రాను రాను విస్తరించిందనీ, ఈ స్థానిక పాలకులు శాతవాహనులు. తమ పాలన ప్రారంభించక ముందు ఆయా ప్రాంతాలపై ఆధిపత్యం వహించి క్రీ.పూ. 1వ శతాబ్దిలో శాతవాహన రాజైన వాసిష్టపుత్ర పులుమావి తీరాంధ్రాన్ని సొంతం చేసుకునేంత వరకూ రాజ్యం చేశారన్నది నిర్వివాదాంశం.

-రచయిత ఫోను : 98485 98446

> మాతృభాషల్ని అణచివేసే
> ప్రభుత్వాలు ప్రజావ్యతిరేకమైనవి.
> అభివృద్ధి నిరోధకమైనవి కూడ.
> అలాంటి ప్రభుత్వాలను
> అధికారంలో ఉండనీయకూడదు.
>
> -ఒక సామాజిక ఉద్యమనేత

**శివరాత్రికి ఇంగా పది దినాలు ఉంది. పగులు ఎండ రవంచ సురుకెక్కుతా ఉంటేనూ, రెయ్యి కొరపడేది నిలవలేదు. ఊరంగా కల్లాల తావ పడుగులు యేస్తా ఉండారు. మేము దిగూరుగడ్డ తావ కల్లములా రాగివాదిని కుప్ప యేసిండాము. పొద్దునకి కల్లమును అలికి పడుగేయాలని మాతాత మాయబ్బకు చెప్పె.**

"ఆ బద్రగాడు ఉండాడేమో పొయి పిలు. రేపు కల్లము అలికేకి రమ్మను" అని మాయమ్మకి చెప్పినాడు అబ్బ. బద్రగాన్ని పిలిచేకి మా అమ్మ కొంగుపట్టుకొని నేనూ పై యీదికి పోతిని.

జకనపెల్లి బైరేగౌని ఇంట్ల ఉండాడు బద్రప్ప. మేము పొయేతలికి, బద్రప్పా ఎర్రగౌడూ జగిలిపైన కూకుని, ఎద్దులకి బలపకడ్లు తినిపిస్తా ఉండారు.

మమ్మల్ని చూసిన బద్రప్ప, "ఓ రాండ గౌడుసానమ్మా. పడుగేయాల అని చెప్పిండె పెద్ద గౌడు, ఎబ్బుడు యేసేది" అని అడిగినాడు.

"దానికే పిలిచేకి వస్తిని. పొద్దునకి కల్లము అలకాల. దిగూరుగడ్డ తావకి వచ్చిడు బద్రప్పా" అనింది అమ్మ.

"వస్తాను గౌడుసానమ్మా, ఏడాదేడాది వర్తినిగా నేనే కదా పడుగేసేది" అన్నాడు బద్రప్ప. సరే అని మేము ఇంటికి తిరుక్కుంటిమి.

ఇంటికి వచ్చేతలికి, ఉడుకుడుకు సంగటీ ఉలవల చారు చేసి పెట్టిండాది అవ్వ. నాకు యీదికే గములు వచ్చిడిసె. గబగబ ఇంట్లాకి పోతిని. మా

# సురువైన సంబుళిగాడు

అమరనార బసవరాజు



'మా ఇంట్లా మేము ఆరుగురు బిడ్డలము. నలుగురు ఆడోళ్ళూ ఇద్దురు మగోళ్లూ. నేను కడగోటోడిని. అబ్బుడు నాకు పదేండ్లు ఉండింటాయి. మా తావన కట్టన్న కరువు వచ్చె. అడివిగడ్డల్ని తిని బతుకుతా ఉంటిని. మా మంచికొండలా మారెమ్మ పరస పెద్దదిగా జరుగుతాది. ఆ పరసకు, ఈవూరి జకనపెల్లి మునిరెడ్డి, ఎద్దుల యాపారానికి వచ్చిండె. అబ్బుడే, మేపేకి మేపులు లేక, మా ఎద్దుల్ని అమ్మేకి మాయబ్బా ఆ పరసకు పొయిండె. నేనూ అబ్బ జతలా పరసకు పోతిని. పరసలా మా ఎద్దుల్ని యాపారము చేసిన మునిరెడ్డిగౌడు, నన్ను చూసి నన్నూ యాపారము చేసె. కాకికండ్ల రెడ్డి, చూసిందంతా కావాలనే రెడ్డి.." ఏ గేపకము గోకకి తగులుకొనెనో కతని రవంచసేపు నిలిపి, తిరగా అందుకొన్నాడు బద్రన్న.

అబ్బ తింటా ఉండాడు. నేను పొయి అబ్బ తెలముందు కూకుంటిని. సంగటిని తుత్తులు చేసి, చారులా అద్ది 'తినురా' అంటా చెప్పినాడు అబ్బ. నేను కూకునింది సంగటి కోసము కాదు, ఉలవల కోసము. మా అవ్వ వచ్చి, తెలనిండా ఉలవలు యేసింది. బాగా తింటిని. అనెంక, మా తాత ఎద్దులకి బలపకడ్లు తినిపిస్తా జగిలిపైన కూకోనుంటే, నేను సెల్లా కప్పుకొని పొయి తాత ఒడిలా కూకుంటిని.

"ఏమి చేస్తా ఉండె బద్రగాడు" అనె తాత.

"పొద్దునకి వస్తాడంట. ఎద్దులకి మేపుపెడుతా ఉండె" అని చెప్పింది అమ్మ, బయట కుక్కకు ముద్ద పెడుతా.

"తాతా తాతా, కల్లము తావ గుడిసిలి యేస్తావా" అని అడిగితి.

"రేపు యేస్తాను కొడుకా, ఇబ్బుడు పొయి పడుకో పో" అనె తాత. నేను లేసి అవ్వ దగ్గరకి పొయి, "అవా, రేపు కల్లము తావ గుడిసిలి యేస్తాడంట తాత. నువ్వు వస్తావా అవా కావలికి" అని అడిగితి. "నువ్వు మీ బావా బద్రగాడూ పొతురులే" అనింది అవ్వ.

ఆ రెయ్యి నాకు నిదరపట్టనే లేదు. ఎబ్బుడెబ్బుడు కావలికి పోతామా, రెయ్యిపూట బద్రన్నతో గువ్వల వేటకి పొయి, పూరిడి గువ్వల్నీ కౌజు కడతల్నీ కాలుచుకొని తింటామా అనే బెమలోనే తెల్లవారిపోయింది.

కోడి కూసె. వీదిలా చెత్తలు ఊడిసే పరకల సద్దు సురువాయె. తాత లేసి గొడ్లనిప్పి వప్పారులా కట్టె. అమ్మా అవ్వా ఇద్దురూ చెత్తమక్కర్లను ఎత్తుకొని పేడను కూడేసేదానికి పోయిరి. నేను కండ్లు ఉజ్జుకుంటా బయిటికి వస్తిని. పొద్దప్పు, అబ్బుడే ఒన్నుగురికి కొండ పైనకి పడీ లేసీ ఎక్కతా ఉండాడు.

నేను నిక్కరు యిప్పుకుని దిగువ ఓణికి పారితిని. కడుపు తొందరని దించుకుని, బుడింగి బాయిలా కాళ్ళూ చేతులూ కడుక్కుని దిగూరుగడ్డకి పోతిని. తాతా అబ్బా బద్రన్నా చేరి, కల్లము తావ ఉండే కదిరిగుంతలా పేడను కలుపుతా ఉండారు.

బావ, బెప్పాల కొమ్మల్ని కొట్టి తడక కట్టినాడు. ఆ తడకకు ఒక తాడును కట్టి, బద్రన్న ఈడుస్తా ఉంటే, అబ్బ పేడనీళ్ళని ముంచి పోస్తా ఉండాడు. నేనూ బద్రన్న దగ్గరకి పొయి, తాడును తీసుకుని, రవంచ సేపు తడకని గుంజితిని. కల్లము అలికింది ఆయె.

"అందురూ మూతులు కడుక్కుని ఇంటితావకి పదండ" అనె తాత. ఆ మాటతో సూలివబ్బలా సూలికడ్లను యించుకుని, పండ్లు తోముకుని, ఇంటికి పొయి ముద్దలు తినేకి కూకుంటిమి.

"రే బద్రా, ఇంక ఈ నెలదినాలు, మా రెండిండ్ల కల్లము సేద్దెము అయ్యేకంటా ఈడే తిని, ఈడే ఉండు" అనె తాత. 'సరేగౌడూ' అన్నట్లు తలను గుంకాయించె బద్రన్న.

నేను ముద్దతిని బడికి పోతిని. మాపుసారి బడినింకా నేరుగా కల్లము తావకి దౌడా కొడితిని. పడుగు యిడిచేకి కుప్పలా కట్టలను ఎత్తేస్తా ఉండారు. నేను పొయి కుప్పమింద ఎక్కితిని. మాపుసారి సల్లపొద్దులా పడుగు యిడిచిరి. తాత ఒక్కడే కల్లము తావ ఉంటే, మేమందరమూ ఇంటికి వస్తిమి. రెయ్యి సంగటి పొద్దు ఆయె. బద్రన్నా నేనూ ముద్ద తిని, కల్లము తావకి బయదేలితిమి, రగ్గులు మెడపైన యేసుకుని.

తాత, గుడిసిలి ముందర అగ్గి అంటిచ్చి, పచ్చి చెనిక్కాయిల్ని కాలుస్తా ఉండాడు. నేను పారిపొయి, నా బాగమును అడిగితిని. అబ్బుటికే నా బాగం కాయిల్ని తువ్వాలులా మూటకట్టి పెట్టించాడు తాత. ఆ మూటని బాసుకుని నా నిక్కరు కిసాయిల్లా చెనిక్కాయిల్ని పోసుకుంటిని.

"సరే బద్రంగా ఉండండ్రా" అనేసి ఊరితట్టుకు అడుగులు యేసినాడు తాత. నేనూ బద్రన్నా, అగ్గి మందర కూకుని చెనిక్కాయిల్ని కుటుముతా ఉండాము. చెనిక్కాయిలకి నడుములా మాటల్ని కుటిమేకి ఎత్తుకొంటి.

"బద్రన్నా, మీ సొంతమూరు ఏది" అని అడిగితిని.

"మాదా, అడివిసీమ అబ్బాయా. ఈడకి చానా దూరము. అంచెట్టి అడివి తావ మంచికొండ అని ఉంది. దాని తావ ఉండే కొడిగూరు మాది. నేను ఈడకి వచ్చి పదమూడేండ్లు ఆయె. అబ్బుటికి నువ్వు ఇంకా పుట్టిండ్లేదు. మీ అన్న పుట్టిండె" చెప్పినాడు బద్రన్న.

"మడి, నువ్వు బడికి పోలేదా" అంటిని.

"మాకు బడి ఎట్లుంటుందో తెలీదు. మావి అడివి బతుకులు. ఆవుల్నీ గొర్రెల్నీ మేపేదే మా పని" అనె బద్రన్న, ఒలిచిన చెనిగిత్తుల్ని నా చేతిలో పోస్తా.

"అట్లయితే, ఇంతదూరము ఏలవస్తివి, ఎవురి కూడా వస్తివన్నా" తిరగా అడిగితిని. బద్రన్న పొడుముగా ఉసురు యిడిచి, చెప్పేకి ఆరంబించె.

"మా ఇంట్లా మేము ఆరుగురు బిడ్డలము. నలుగురు ఆడోళ్ళూ ఇద్దురు మగోళ్లూ. నేను కడగోటోడిని. అబ్బుడు నాకు పదేండ్లు ఉండింటాయి. మా తావన కట్టన్న కరువు వచ్చె. అడివిగడ్డల్ని తిని బతుకుతా ఉంటిమి. మా మంచికొండలా మారెమ్మ పరస పెద్దదిగా జరుగుతాది. ఆ పరసకు, ఈవూరి జకనపెల్లి మునిరెడ్డి, ఎద్దుల యాపారానికి వచ్చిండె. అబ్బుడే, మేపేకి మేపులు లేక, మా ఎద్దుల్ని అమ్మేకి మాయబ్బా ఆ పరసకు పొయిండె. నేనూ అబ్బ జతలా పరసకు పోతిని. పరసలా మా ఎద్దుల్ని యాపారము చేసిన మునిరెడ్డి గౌడు, నన్ను చూసి నన్నూ యాపారము చేసె. కాకికండ్ల రెడ్డి, చూసిం దంతా కావాలనే రెడ్డి.." ఏ గేపకము గోకకి తగులుకొనెనో కతని రవంచసేపు నిలిపి, తిరగా అందుకొన్నాడు బద్రన్న.

'ఇంట్లా సంబళాగాడు కావాల. ఈడెవురన్నా చిక్కుతారా' అని అడిగె మా అబ్బని. 'వీడు అయితాడేమో చూడండ గౌడూ, ఇంట్లా కరువు. ఆరుగురు బిడ్డలు. తినేకే లేదు. బిడ్డ ముద్దా బతుకు ముద్దా అన్నెట్లుండాము' అనినాడు మా అబ్బ, నన్ను చూపిస్తా. 'సరి ఏడాదికి వెయ్యిరూపాయలు సంబళము, రెండు జతల బట్టలు, రెండు పూటలా సంగటి' అనె మునిరెడ్డిగౌడు. అంతకే మాయబ్బ సరే అంటా తల గుముకేసె.

ఇంక చేసేది ఏముంది. గౌనిమాట మీరేకి లేదు, గడపార మింగేకి లేదు అనుకుని, నేను పరసనింకా మా ఇంటికిపోయి, అమ్మకీ అక్కోళ్ళకీ చెప్పేసి వచ్చి, మునిరెడ్డి గౌని కూడా ఎద్దుల్ని పట్టుకుని, మా మంచికొండని దిగి, అందేవునిపల్లి డెంకణికోటల్ని దాటి, బాలగుళి అడవిలో నుగ్గి మీ వూరికి చేరుకుంటిని" అంటా అన్న కతను ముగించినాడు బద్రన్న.

"అనెంక నువ్వు మీ వూరికే పోలేదాన్నా" అడిగితిని.

"ఏడాదికో రెండేండ్లకో ఒగతూరి పోడిసి వస్తుంటాను, అంతే అబ్బయ్యా" అనె బద్రన్న. అబ్బుడే ఎవురో కల్లము తావకి వస్తా ఉండే

**కల్లము తావ ఆడోళ్లు పూలు ముడుసుకుని సద్దముగా ఉండకూడదు. కాపోళ్ళు కష్టపడాల, సికారోళ్ల మాదిగా ఉండాల. ఉద్దిగమానుని దిగేనబ్బుడు కాపుకట్టి దిగాల. కొంగతో మూడుతూర్లు రాసి చుట్టూ కాపుకట్టాల. ఇదంతా అయినంక మేటితో తిప్పాల. దవసాన్ని అలికిండే తావ పోయాల. నామాలనూ దేవర్లనూ ఇంకొక తావ పోయాల. అనెంక దవసము రాసి పైన పెద్ద పిళ్లారికి రాగి యెన్నులూ గురుగు పూలూ గన్నేరుపూలూ గొబ్బిపూలూ ఆరిపత్రీ గుచ్చాల.**

సద్దుని విని, ఆ తట్టుకి చూస్తిమి. ఎర్రగౌడు వస్తా ఉండాడు. మునిరెడ్డి గౌనికి తమ్ముని కొడుకే ఎర్రన్నగౌడు. బద్రన్నా ఎర్రన్నా జతగాళ్ళు. ఎర్రన్న వచ్చి, అగ్గి బూడిదలా చెనిక్కాయిల్ని యెతికి ఏరుతా ఉండాడు. నా దగ్గిరుండే కాయిల్లా రవన్ని కాయిల్ని ఎర్రన్నకి ఇస్తిని.

"ఏలరా, ఏమో పుంగులు తోలుతా ఉండారు" అనినాడు ఎర్రన్న.

"బద్రన్న ఏమో చెప్తా ఉండాడు. కూకోన్నా యిందాము" అంటిని.

"గుడిసిల్లా కూకుందాము పదంట్రా. బయట కొరపడుతా ఉంది" అనినాడు ఎర్రన్న. ముగ్గురుమూ గుడిసిల్లాకి పొయి కూకుంటిమి.

"సంబళానికి వచ్చినంక ఏమేమి పనులు చేస్తివి బద్రన్నా" అంటా అరువులు సురువు చేస్తిని.

"అది ఏల అడుగుతావు అబ్బయ్యా, పొద్దు పుట్టినబుడి నింకా పొద్దు మునిగేకంటా, కాపోలిండ్లల్లా బిడువే ఉండే లేదు. ఎట్లో ఎనిమిదేండ్లు గాసిపడి, మా అక్కోళ్ళకు అందరికీ పెండ్లిండ్లు చేస్తిని. పెండ్లికీ చావుకీ పొయి వచ్చేదే కానీ, మావూరి సుద్దినే మరిచిపోతిని. పని పని పనంటా ఈవూరే నా వూరుగా అయిపొయింది" అనినాడు. అంతా వింటా ఉండిన ఎర్రన్న నడువులా నుగ్గి, "అదంతా ఏడన్నా పోనీ బద్రా, ఈ కల్లము సేద్యాన్ని ఎట్లా సేరిస్తివిరా, నీ అంతబాగ మేము ఎవురుమూ చేసేకి అయ్యేలేదే" అనె.

"ఏమి చేస్తాము గౌడూ. మీరంతా గౌనోళ్ళు. గుమ్మడికాయి లాము తిని గూదించుకునే దానికన్నా, మామిడికాయి లాము తిని మానుకింద పణుకునేది మేలు అని ఉంటారు. మేము అట్లకాదే. తిన్నింటికి కన్నము వేయరాదని మా అబ్బ చెప్తా ఉండె. దానికే మీ కాపోళ్ళ ఇండ్లల్లా ఒళ్లు యించుకుంటా ఉండాను. పాపము మునిరెడ్డిగౌడు, పెద్ద కాయిలాపడి కండ్లు మూసుకునె. ఆయన తావ నేర్చుకుంటిని ఈ కల్లము సేద్యమంతా. ఒకనాడు తోటతావ చెప్పె ఆయప్ప 'బద్రా ఎవురు నిన్నెంత బాదపెట్టినా, మా ఇంటిని విడద్దురా, నీకు పున్నెముంటుంది' అని. కష్టకాలములా మా ఇంటిని ఆదుకొనె ఆ గౌడు. దానికే ఇబ్బుడు నేను మీ ఇంటికి కావిలి కాస్తా ఉండాను" అని వెతపడుతా అనె బద్రన్న.

"బద్రన్నా బద్రన్నా కల్లము సేద్దెము ఎట్ల చేయాలో చెప్పన్నా" అంటా బేలాడితిని నేను.

"అబ్బయ్యా చెప్తాను, బాగా గవునము పెట్టుకో..కుప్పను యిప్పి అలికిన కల్లములా పడుగు వేయాల. ఈపొద్దు చేసిందాము కదా అట్లా. గుండుకట్టి, గుండుతో పడుగుని తొక్కించి, సావన వేస్తారు. తిరగా కుప్పలా ఉండే కట్టలను దిగువుండే గుంగుపైన పడుగు యిడుస్తారు. అట్లా పడుగునంతా తొక్కించి, కసువునంతా సావనేసినంక, దిగువువుండే గుంగునంతా ఉడ్డనూకుతారు. ఆ ఉడ్డను లబ్బు అంటారు. లబ్బుపైన పిళ్ళారిని పెట్టి, పిళ్ళారికి గురుగుపూలు గుచ్చుతారు.

కల్లములా గాలి వాటువు చూసి, ఉద్దిగమానును పెట్టేకి అలుకుతారు. ఉద్దిగమానుపైన నిలిచే రాగుల్ని తూరాల. మానుపైన తూరేవాళ్ళు ఇద్దురు, దిగువనింకా అందించేవాళ్ళు ఇద్దురు, లబ్బును కొంగల్లా నింపిచ్చేవాళ్ళు ఇద్దురు, మొత్తము ఆరుగురు పని చేయాల. దవసమును తూరేనబ్బుడు, రాళ్లు ఉద్దిగమానుపైన పడితే 'పోలిగో' అనాల. గాలి రాకపోతే 'పోలిగో' అనాల. అట్లా పిలిసినా గాలి రాకపోతే పొట్టేలు వట్టకాయ, కొత్తరాగుల ముద్ద, పోలిగో" అని కిర్లుతారు.

కల్లము తావ ఆడోళ్లు పూలు ముడుసుకుని సద్దముగా ఉండకూడదు. కాపోళ్ళు కష్టపడాల, సికారోళ్ల మాదిగా ఉండాల. ఉద్దిగమానుని దిగేనబ్బుడు కాపుకట్టి దిగాల. కొంగతో మూడుతూర్లు రాసి చుట్టూ కాపుకట్టాల. ఇదంతా అయినంక మేటితో తిప్పాల. దవసాన్ని అలికిండే తావ పోయాల. నామాలనూ దేవర్లనూ ఇంకొక తావ పోయాల. అనెంక దవసము రాసి పైన పెద్ద పిళ్లారికి రాగి

| | | |
|---|---|---|
| **కొర** : నీళ్లమంచు | **వబ్బ** : పొద | **సావన** : సామెన(కుప్పగా పేర్చిన ధాన్యపు పనలు) |
| **జగిలి** : అరుగు | **బాసుకొను** : జవురుకొను | **గుంగు** : తుక్కు |
| **బలపకడ్లు** : ఎండిన అనపచెట్లు | **కిసాయి** : జేబు | **ఉడ్డ** : పోగు |
| **వర్తిని** : వాడుక | **కుటుము** : నములు | **ఉద్దిగమాను** : తూర్పారపట్టడానికి ఎత్తుగా కట్టే కొయ్యలు |
| **తెల** : కంచము | **పరస** : జాతర | **కిర్లు** : అరచు |
| **తుత్తులు** : చిన్నముద్దలు | **గోక** : గొంతు | **కణజము** : పాతర |
| **కదత** : పెట్ట | **సంబళగాడు** : జీతగాడు | **మిచ్చుము** : మిగులు |
| **పరక** : చీపురు | **పుంగులు తోలడం** : బాతాకానీ | **మొరము** : చేట |
| **వప్పారు** : వరండా | **బిడువు** : తీరిక | **కడ్లు** : పుల్లలు |
| **మక్కరి** : గంప | **గాసి** : శ్రమ | **ఇలావరి** : వివరం |
| **ఉజ్జు** : రుద్దు | **నుగ్గు** : దూరు | |
| **ఓణి** : డొంక | **బేలాడు** : బ్రతిమాలు | |

యెన్నులూ గురుగు పూలూ గన్నేరుపూలూ గొబ్బిపూలూ ఆరిపత్రీ గుచ్చాల.

దవసము రాసి దగ్గర, అయిదడుగుల మనిసి నిలబడి, ఆయన రాసికి ఆ తట్టు కనపడకపోతే పద్దైదు పుట్లు అయ్యిండాయని నమ్మకము. పుట్టి అంటే రెండు మూటలు. దవసముపైన పిళ్లారికి పక్కలా మామిడాకులు, కొంగ, సర్లు, ములుగట్టె, చిక్కాలు, మెరగట్టె మాదిరి సేద్దెపు పనిముట్లను గుచ్చాల. కాయపండూ తెచ్చి క్రిష్ణసామికి పూజ చేయాల. అనెంక రెండు మూటల దవసాన్ని కొలిచి పక్కన పెట్టాల. ఆ రెండు మూటలు ఏమిటికంటే, ఆచారికీ, తోటోనికీ, చాకలికీ, మంగలికీ, గుడి అయ్యవారికీ, సేద్యగాళ్లకీ దానము చేసేదానికి. మిగతా మూటల్ని ఇంటికి సాగించి కణజములా పోస్తారు. అన్ని జాతులోళ్లకీ మేరగింజలూ, కాకులు, గువ్వలు, గొద్దుగోదలు, పురుగూపుట్రలు, చీమలు ఎలకలు, ఇట్ల అందురూ అన్నీ తిని మిచ్చమైనదే కాపోని ఇల్లు చేరేది...ఏమబ్బయ్యా తూగిడుస్తా ఉండావా" అంటా నిలిపినాడు బద్రన్న.

"లేదన్నో, తూగొచ్చే కతనా నువ్వు చెప్తా ఉండేది. అవునన్నా పదుగు తొక్కించేకి గుండు కడుతాము కదా. ఆ గుండుకట్టేకి ఏమేమి కావాల" అని అడిగితిని.

"లోగాడికట్లు, చిక్కాలు, కాడిమాను, పట్టీలు, బోదిగ, ఈసులు, గుజ్జులు, అడ్డపట్టెలు, పలకలు, పొలుపులు, మోకు....ఇన్నీ కావాల కాపోనికి" చెప్పినాడు బద్రన్న.

"అది సరి బద్రన్నా, ఇందాక చెప్పేనబ్బుడు, కొంగ, సర్లు, మేటి అంటా ఏవేవో చెప్పిండావు ఏటివన్నా" అని తిరగా అడిగితిని.

"అయ్యి కల్లము మాటలు అబ్బియ్యా. ఇంటి తావ మాటల్ని కల్లము తావ చెప్పరాదు. రాగుల్ని దవసము అనాల.పంటని క్రిష్ణసామి అనాల. పరకని సర్లు, మొరముని కొంగ, జల్లిడిని మేటి, రాళ్ళని దేవర్లు, ఇసుకా మన్నుని దసుకు, పేడబొమ్మని పిళ్లారి, కడ్లని నామాలు, పందిని నల్లజీవము, గాడిదను సెట్టిగాడు, కోడిని యాట అనాల. ఇట్ల ఇంకా ఎన్నో కల్లము మాటలు ఉండాయి" అని ఇలావరిగా చెప్పినాడు బద్రన్న.

బద్రన్న చెప్పిన మాటలు నాలోగా అట్లే నిలిచిపోయినాయి. బద్రన్న మావూరికి ఎత్తిన సంకబిడ్డ మాదిరి. ఎవురు పిలిచినా ఏ పనికైనా పోతాడు. అందురికీ బుద్ధిమాటలు చెప్తాడు. ఏమీ చదువకుండానే ఇన్ని తెలిసిన బద్రన్న దగ్గిర, చదువులు చదివిన మేము పేడ బొమ్మలమే. సంబళగాడుగా వచ్చి కాపోళ్లకి గురువాయె బద్రన్న.

రచయిత ఫోను :099522 40790



కవిత

# మిణుగురులు

**న**ల్లధనం కనిపించింది
విదేశీ లాకర్లు పెట్టుబడుల్లో
కనిపించటం లేదు
వసూలుకై చిత్తశుద్ధి!

**ర**కరకాల
ఉచితాలు
సర్కస్ ఫీట్లు
పదవి పీఠంకై!

**క**ళ్యాణ మండపాలు
భారీ విందుభోజనాలు
బాలకార్మికులకు
నాలుగు మెతుకుల్లేవు!

**ప్రాం**తాలు, మతాలు
కులాలతో చీలిన
భారతదేశం
అఖండభారతా?

**ప్ర**భుత్వ ఉద్యోగి
కార్మిక సంఘనేత
అధికార పక్షం
ఉగాది పురస్కారం!

**బో**డిగుండయింది
తిరుపతిమొక్కు కాదు
ఇంటి మంగలి కాదు
కుళ్లు రాజకీయాలతో!

**పై**రవీలతో అధ్యాపకుడు
చతుర్ముఖ పారాయణం
సురాపానంలో నిష్ణాతుడు
ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు!

**యా**భై ఆరు అక్షరాల తెలుగు
ఇరవై ఆరు అక్షరాల ఇంగ్లీషుకు
స్వాతంత్ర్యం తరువాత కూడా
చేస్తున్నది సెల్యూట్!

**-పరుచూరు శ్రీనివాసరావు,** 99632 18700

# గౌతమబుద్ధుని జీవిత సందేశం

-డి. చంద్రశేఖర్

**గౌ**తమ బుద్ధుడు తాను ఏమి బోధించాడో దాన్నే ఆచరించాడు; తానేది ఆచరించాడో దానినే యితరులకు బోధించాడు. మరి, అటువంటప్పుడు బుద్ధుని బోధనలు గాక, ఆయన జీవితం ప్రత్యేకంగా మనకు అందించే సందేశం ఏముంటుంది? అనే ప్రశ్న తలెత్తటం సహజం. నిజానికి, ఆయన బోధనలకు భిన్నంగా బుద్ధుని జీవితం అందించే సందేశం లేదనే చెప్పాలి. అయితే, యిదే విషయాన్ని మరోరకంగా చూస్తే, బుద్ధుని ధర్మాన్ని ఆయన ఉపదేశాల ద్వారా మరియు వ్యక్తిగా ఆయన జీవితం నుండి కూడా అర్థంచేసుకోవచ్చని తెలుస్తుంది. సాధారణంగా, మొదటి పద్ధతిని అనుసరించటాన్నే మనం చూస్తుంటాం. అయితే, ఒక వ్యక్తిగా బుద్ధుని జీవితంలో కనిపించే విశిష్ట లక్షణాలను గ్రహించటంవల్ల, బుద్ధుని మూర్తిమత్వమే గాక ఆయన బోధనలు కూడా మనకు మరింత సన్నిహితంగా, లోతుగా అర్థమయ్యే అవకాశం వుంది.

జ్ఞానోదయానికి ముందునాటి బుద్ధుని (సిద్ధార్థుని) జీవితం గురించి ప్రాచీన బౌద్ధగ్రంథాల్లో లభించే సమాచారం చాలతక్కువ, జ్ఞానోదయం పొందిన తరువాత బుద్ధుడు చేసిన ఉపదేశాల్లో, తన గతజీవితపు విశేషాలను సందర్భానుసారంగా అక్కడక్కడా ప్రస్తావించటం జరిగింది. వీటి ఆధారంగా జ్ఞానోదయానికి ముందునాటి బుద్ధుని జీవితం గురించి రేఖామాత్రంగా తెలుసుకునే వీలుంది.

బుద్ధుని గతజీవితం గురించి ఆయన సహచరులైన భిక్షువులకు బౌద్ధగ్రంథాల్లో వున్నదానికంటే ఎక్కువే తెలిసివుండాలి. ఎందుకంటే, గృహస్థుడైన సిద్ధార్థునితో ఇరవైతొమ్మిది సంవత్సరాల పాటు కలసి జీవించినవారు అనేకులు, బుద్ధుని శిష్యులుగా మారి తమ జీవితాంతం భిక్షుసంఘంలో గడిపారు. అంతేకాదు, చాలామంది యితర భిక్షువులు కూడా బుద్ధుని వెంట ఆయన పుట్టిపెరిగిన కపిల వస్తు నగరానికి వెళ్ళినట్లు బౌద్ధగ్రంథాలు చెబుతున్నాయి. వీరిద్వారా బుద్ధుని గతజీవిత విశేషాలు భిక్షుసంఘంలో ప్రచారం పొందగల అవకాశాలు పుష్కలంగా వున్నాయి. అయినప్పటికీ బుద్ధుని తొలిదశ జీవిత విశేషాలకు ప్రాచీన బౌద్ధగ్రంథాల్లో స్థానం లభించలేదు. ప్రాచీన బౌద్ధగ్రంథాలు రూపొందేనాటికి, భిక్షుసంఘం 'బుద్ధుని జీవితకథను గాక, ఆయన బోధనలను సంగ్రహించటమే' లక్ష్యంగా ఎంచుకున్నట్లు తెలుస్తుంది. "ఎవరు ధర్మాన్ని దర్శించగలరో, వారు తథాగతుని (బుద్ధుణ్ణి) దర్శిచగలరు" అని బుద్ధుడు చెప్పిన మాటలు భిక్షువులను ఆదర్శమయ్యాయి. అందుకే వారు ఆయన వ్యక్తిగత జీవితవిశేషాలపై నొక్కుపెట్టలేదు.



**ఆలోచన, మాటలు, చేతల మధ్య సంపూర్ణమైన సమన్వయం సాధించటాన్ని ఆధునిక మనోవిజ్ఞాన పరిభాషలో "మూర్తిమత్వ సౌష్టవం"** (congruency of personality) **అని అంటారు. నిజానికి, వీటి మధ్య పరిపూర్ణమైన సమన్వయము సాధించటం ఒక అసాధారణమైన, అద్భుతమైన అనుభవమని చెప్పవచ్చు. గౌతమ బుద్ధుడు యిటువంటి సమున్నత స్థితిని పొందాడని చెప్పటానికి బలమైన ఆధారాలున్నాయి. మూర్తిమత్వ సౌష్టవాన్ని సాధించటంలో, ఈనాటివరకూ ప్రపంచానికి తెలిసిన పరిపూర్ణ నమూనా** (perfect model) **గా ఆయన నిలిచాడని బౌద్ధులు కానివారు సయితం అంగీకరిస్తారు.**

ఈ వ్యాసం కూడా బుద్ధుని జీవితవిశేషాలను అందించటటానికి ఉద్దేశించింది కాదు. మూల బౌద్ధగ్రంథాల్లో లభించే విషయాలపై ఆధారపడి, ఆయన మూర్తిమత్తంలో కనిపించే కొన్ని విశిష్ట లక్షణాలను విశ్లేషిస్తూ, బుద్ధుని ధర్మాన్ని మరింత సన్నిహితంగా, లోతుగా వివరించే ప్రయత్నమే యిది.

❋ ❋ ❋

సిద్ధార్థుని గృహపరిత్యాగం గురించి భిన్నమైన కథనాలు ప్రచా

రంలో వున్నాయి. వీటిలో ఏది నిజమైందో నిరూపించటానికి తగిన ఆధారాలు మూల బౌద్ధగ్రంథాల్లో లేవనే చెప్పాలి. ఈ విషయాన్ని తేల్చి చెప్పనందువల్ల బుద్ధుని బోధనలకు వాటిల్లే నష్టం ఏమీ వుండదు. అయితే, యీ విషయమై బౌద్ధగ్రంథాల్లో పరిమితంగా లభించే ఆధారాలనుబట్టి నిస్సందేహంగా చెప్పగల విషయం ఒక టుంది. తనను ప్రేరేపించిన కారణాలు ఎవైనప్పటికి, సిద్ధార్థుడు తన గృహాన్ని మాత్రమే కాదు, గృహస్తు జీవితాన్నే త్యజించాడు. జీవితాంతం భిక్షువుగా జీవించాలనే కృతనిశ్చయంతోనే ఆయన ఇల్లు విడిచి వచ్చాడని నమ్మటానికి, ఆనాటి నుండి ఆయన గడిపిన యాభై సంవత్సరాల జీవితమే సాక్ష్యం. మానవజీవితంలోని దుఃఖాన్ని నివారించటమే తన జీవిత పరమార్థంగా ఎంచుకుని, సత్యశోధనకు నడుంబిగించిన గౌతముడు యిక ఏనాడూ వెనుతిరగలేదు. అచంచల మైన యీ మహాసంకల్పమే బుద్ధుని జీవితం మనకందించే మొదటి సందేశం.

సమాజంలో తరతరాలుగా పాదుకుపోయిన విశ్వాసాలను సిద్ధాంతాలను ఆచారాలను కాదని, వాటికి భిన్నమైన మార్గంలో పయనించటానికి ఎంతో ధైర్యం, సాహసం కావాలి. ప్రత్యేకించి, అప్పటివరకూ ఎవరూ నడవని కొత్తదారిలో నడవటానికి యివి మరింత అవసరం. ఎందుకంటే, అలా నడిచే వ్యక్తి ప్రపంచం మొత్తాన్ని కాదని ముందుకు పోతున్నట్లే, బుద్ధుడు తన భిక్షుజీవితపు తొలిదశలోనే ధ్యానయోగులైన తన గురువుల బోధనల్ని, ఆచరణను అనుభవపూర్వకంగా తప్పని గుర్తించాడు. ఎటువంటి తటపటాం ఇంపు లేకుండా వారిని వదలి వచ్చేశాడు.

ఇంతకంటే జటిలమైన మరో అనుభవాన్ని బుద్ధుడు తన స్వీయ సాధనలో ఎదుర్కొన్నాడు. తన గురువుల్ని వదలివచ్చిన సిద్ధార్థుడు, జ్ఞానసాధన కోసం శరీరాన్ని శుష్కింపజేసే కఠోర తపశ్చర్యను తన మార్గంగా ఎంచుకున్నాడు. కౌండిన్య తదితర మిత్రుల సహకారంతో దీన్ని అత్యంత నిష్టతో ఆచరించాడు. ఫలితంగా శరీరం చిక్కిశల్యమై ఎముకలగూడులా మారాడు. దీనితో, సిద్ధార్థుడు జ్ఞానోదయం పొందే దశకు చేరువైనాడని భావించిన అతని సహచర మిత్రులు, అంకిత భావంతో ఆయనకు సేవలు చేశారు. ఇటువంటి కీలకదశలో దాదాపు మృత్యువుకు చేరువైన సిద్ధార్థుడు, "శరీరాన్ని శుష్కింపజెయ్యటం ద్వారా జ్ఞానం కలుగుతుందనేది ఒక భ్రమ మాత్రమేనని, శరీరం ఆరోగ్యంతో శక్తివంతంగా ఉన్నప్పుడే మనసు జ్ఞానసాధనకు అనువుగా ఉంటుం ద'ని గుర్తించాడు. ఈ సత్యాన్ని గ్రహించిన వెంటనే, మళ్ళీ ఆహారం తీసుకోవటం ప్రారంభించాడు. దీనితో, 'సంకల్పశక్తిని కోల్పోయి సిద్ధార్థుడు తపశ్చర్య నుండి జారుకున్నాడ'ని భావించిన సహచర మిత్రులు, అతన్ని ఒంటరిగా వదలి వెళ్ళిపోయారు.

ఇతరులు చెప్పినదాన్ని తిరస్కరించటంకన్నా, తాను స్వయంగా నమ్మి ఆచరించే మార్గం తప్పని తెలిసినప్పుడు, దాన్ని వదులుకోటానికి మరింత విజ్ఞత, అంతకుమించిన మనోబలం కావాలి. బుద్ధుడు తనకాలంనాటి అశాస్త్రీయ భావాలపైనే గాక, ఒకవిధంగా, తనపై తానే 'తిరుగుబాటు' చేశాడు. "సత్యశోధన మార్గంలో ప్రతిబంధకా లైనప్పుడు యితరులు నిర్మించిన చట్రాలనే గాక, తనకుతాను నిర్మించుకున్న చట్రాలను సయితం బద్దలుకొట్టి ముందుకు సాగాల"నే సందేశం బుద్ధుని జీవితంలో అంతర్లీనంగా ఉంది. అందుకే, "ఏ విషయాన్నయినా నీకు నీవుగా దర్శించి, అనుభవపూర్వకంగా సత్య మనిపిస్తేనే అంగీకరించి ఆచరించు" అని ఆయన తన శిష్యులకు పదేపదే నొక్కిచెప్పాడు. ఈ మాటలకు నిలువెత్తు నిదర్శనంగా ఆయన జీవితం సాగిందనటంలో సందేహం లేదు.

మానవజీవితంలో మానవాతీతశక్తుల పాత్ర లేదని, మనిషి తనజీవితాన్ని తానే తీర్చిదిద్దుకోగలడని బుద్ధుడు ప్రకటించాడు. ఇందుకు అనుగుణంగానే బుద్ధుని జీవనం సాగింది. మానవాతీత శక్తుల పాత్రను నిరాకరించిన బుద్ధుడు మానవచరిత్రలోనే మహోన్నతుడిగా నిలిచాడు. బౌద్ధులు కానివారు, బౌద్ధాన్ని విమర్శించే వారు సయితం బుద్ధుని గుణగణాలను వేలెత్తిచూపలేదు. "దేవుణ్ణి విశ్వసించనివారు నైతికంగా పతనమవటం ఖాయం" అనేది కేవలం ఊహాజనితమైన అపోహ మాత్రమేనని బుద్ధుడు తన జీవితం ద్వారా నిరూపించాడు.

మనిషి పుట్టిన వర్ణం లేక కులం అతని జీవితాన్ని నిర్దేశిస్తుందని చెప్పిన వర్ణధర్మాన్ని బుద్ధుడు నిరాకరించటం తెలిసిందే. ఇందుకు భిన్నంగా, మనిషి విలువ లేక ఔన్నత్యం అనేవి పుట్టుకతో వచ్చేవి కావని, మనిషి నీచుడైనా లేక ఉత్తముడైనా అది తన ఆలోచనలు ప్రవర్తన ద్వారానే జరుగుతుందని ఆయన అన్నాడు. కేవలం మాటల్లో చెప్పటంగాక, వర్ణాశ్రమధర్మం బలంగా వేళ్ళూనుకుంటున్న కాలంలో, అన్నికులాల వారినీ భిక్షుసంఘంలో చేర్చుకున్నాడు. ఈ విషయంలో యితరుల నుండి ఎదురైన ప్రతిఘటనను ఆయన అవలీలగా జయిం చటం ఆశ్చర్యం కలిగిస్తుంది. ఈనాడు కుల భావనను సూత్రరీత్యా నిరాకరించే అభ్యుదయవాద విప్లవవాద సంస్థలు సయితం, కులభేదాల ఉచ్చులో చిక్కుకోవటం ఎవరూ కాదనలేని సత్యం. బుద్ధుని జీవితకాలంలో, భిక్షువుల మధ్య తలెత్తిన అనేక వివాదాలను బౌద్ధ గ్రంథాలు నమోదుచేశాయి. కాని, వీటిలో కులవివక్ష కారణంగా తలెత్తిన వివాదం ఒక్కటికూడా కనిపించదు. అలాగే, భిక్ష కోసం వెళ్లినప్పుడు గాని, గృహస్తుల ఆహ్వానం మేరకు వారి యిళ్ళకు భోజ నానికి వెళ్లినపుడు లేదా మరేయితర సందర్భంలోనైనా భిక్షువులు కులసంబంధమైన ఆరోపణలు చెయ్యలేదు. ఏదేమైనా, సుదీర్ఘచరిత్ర గల భారత కులసమాజంలో, కులభేదాలను అధిగమించి మనుగడ సాగించటం సాధ్యమేనని నిరూపించటానికి ఒక అత్యుత్తమైన అను భవాన్ని భిక్షుసంఘం రూపంలో బుద్ధుడు మనకు అందించాడు.

మానవజీవితపు దశను దిశను నిర్దేశిస్తాయని ప్రచారంచెయ్యబడ్డ దైవ, కుల భావనలను నిరాకరించటంలో బుద్ధుడు ఎనలేని ధైర్య సాహసాలను ప్రదర్శించాడు. ప్రజల్లో వేళ్ళూనుకున్న ప్రగతివ్యతిరేక భావాలను తొలగించాలని ప్రయత్నించే వారందరికీ బుద్ధుని ధైర్య సాహసాలు స్ఫూర్తిదాయకం.

మనిషి తనలోని భావాలను "ఉన్నది ఉన్నట్లు" మాటల్లో వ్యక్తం చెయ్యటానికి అవగాహన, నిజాయితీతో పాటు తగిన నైపుణ్యం కూడా ఉండాలి. తాను చెప్పినదాన్ని చెప్పినట్లు ఆచరించటానికి, వీటితో పాటు, క్రమశిక్షణతో కూడిన సాధన, ప్రజ్ఞ కూడా అవసరం. ఆలో చనల్ని మాటలుగా, ఈ రెంటిని ఆచరణగా మలచటం అనేది మనిషి సాధించదగిన అత్యుత్తమ లక్షణాల్లో ఒకటని చెప్పవచ్చు. ఆలోచన, మాటలు, చేతల మధ్య సంపూర్ణమైన సమన్వయం సాధించటాన్ని ఆధునిక మనోవిజ్ఞాన పరిభాషలో "మూర్తిమత్వ సౌష్టవం" (con-

## అక్షరం ఓ పునరుజ్జీవనం

–డా॥కత్తి పద్మారావు, 98497 41695

**అ**క్షరం ఒక జీవనది
అక్షరం ప్రపంచాన్ని ఏకీకృతం చేసింది
అక్షరం ప్రపంచ మానవుణ్ణి సృష్టించింది
అక్షరం ఎన్నో చిత్రాలు గీసింది
అక్షరం ఎన్నో రంగుల్లో వికసించింది
ఎన్నో స్వరాల్లో పలికింది
కడలి అలల సవ్వడిని వినిపించింది
గుర్రం గిట్టల మోతలు పలికించింది!
ప్రకృతి జీవన చిత్రాలను గీసింది
శిల్పాలకు వన్నెలు దిద్దింది
మనిషిని పునర్నిర్మించింది
అక్షరం ఉలిగా మారింది
అక్షరం చిక్కని చీకటిలో
దీపాల కాంతులు ఇనుమడింపజేసింది
మనుష్యుల్లో అనుబంధాన్ని పెంచింది
చినుకు చినుకుగా పడి
నదీ ప్రవాహం అయ్యింది
మెదడు నేలల్లో పంటలు పండించింది
అక్షరం రెండు హృదయాలకు వారధి
సముద్రాల ఆవలి భావతరంగాలను
ఈవలి ఒడ్డుకు తెస్తుంది
అవును! నీలి సంద్రాల్లో నుండి
జీవన తరంగాలను పొంగిస్తుంది
బంధ సందుల్లో నుండి
చిన్న నీటిపాయలుగా ప్రవహిస్తుంది
అక్షరం ధైర్యాన్ని నేర్పుతుంది
నిజాయితీని ఇస్తుంది
జీవన స్వరాలను పల్లవింపజేస్తుంది
అక్షరం తోటలా విరబూస్తుంది
పువ్వులా పరిమళిస్తుంది
అనుబంధాల్ని చిక్కబరుస్తుంది
అదృశ్యరూపాలకు జీవాన్నిస్తుంది
వెన్నెల్లా కురుస్తుంది
చిక్కని మంచులా కమ్ముకుంటుంది.
ఎడారిలో విరబూసిన చెట్టులా వెలుగుతుంది
అక్షరం క్షయం లేనిది
పాలపుంతలను
అనుసంధానం చేస్తుంది అక్షరం
అక్షరం ఓ పరిమళం
ఓ ప్రజ్వలనం
ఓ సమన్వయం
ఓ సామరస్యం
అక్షరం అభ్యుదయ జ్వలనం
అక్షరం ఓ శిల్ప సౌందర్యం
అక్షరం ఓ ఉత్పత్తి పరికరం
అక్షరాన్ని, అక్షర శిల్పాన్ని
నిషేధించిన రాజ్యాలు కూలాయి
శిల్పిని, శిల్పాన్ని నిరాకరించిన
అహంకారాలు మటుమాయమయ్యాయి
అక్షరం ఒక మాతృత్వం
అక్షరం ఓ ఉజ్వల చైతన్యం
అక్షరాలను కూర్చుకోండి!
అక్షరాలను వ్రాయండి!
అక్షరాలను వెలిగించండి!
అక్షరం అనంతయానం
అక్షరం ప్రేమసముద్రం
అక్షరం ఆయుస్సు, ఉషస్సు
అక్షరం ఓ సాంస్కృతిక విప్లవం
అక్షరం ఓ సామాజిక న్యాయం
అక్షరం ఓ రాజకీయ నిర్మాణం
అక్షరం పునరుజ్జీవన జ్వలనం
అందుకే అక్షరాన్ని సత్యనిష్టం చేద్దాం
సముజ్వల చరిత్రకు బాటలు వేద్దాం.

gruency of personality) అని అంటారు. నిజానికి, వీటి మధ్య పరిపూర్ణమైన సమన్వయము సాధించటం ఒక అసాధారణమైన, అద్భుతమైన అనుభవమని చెప్పవచ్చు. గౌతమి బుద్ధుడు యిటువంటి సమున్నత స్థితిని పొందాడని చెప్పటానికి బలమైన ఆధారాలున్నాయి. మనుషుల్లో కనిపించే ఎటువంటి బలహీనతలు ఆయనలో లేవని చెప్పటం అతిశయోక్తి కాదు. నైతిక ప్రవర్తన విషయంలో బుద్ధుని ప్రత్యర్థులు కూడా ఆయన్ను వేలెత్తి చూపలేదు. మూర్తిమత్వ సౌష్టవాన్ని సాధించటంలో, ఈనాటివరకూ ప్రపంచానికి తెలిసిన పరిపూర్ణ నమూనా (perfect model) గా ఆయన నిలిచాడని బౌద్ధులు కానివారు సయితం అంగీకరిస్తారు. ప్రాచీన బౌద్ధగ్రంథాల్లో బుద్ధుని మూర్తిమత్వ సౌష్టవం, సమగ్రత నిండుగా ప్రవహిస్తూ కనిపిస్తుంది. బుద్ధుని బోధనల్ని ఆచరించదలచిన వారికి యిదొక బోధనాంశంగా మాత్రమే గాక, స్ఫూర్తిదాయకమైన ఆదర్శ నమూనాగా నిలుస్తుందనటంలో సందేహం లేదు. ❊

-డా॥ బొర్రా గోవర్ధన్

# తొలి భాషోద్యమకారుడు - బుద్ధుడు



**"భిక్షువులారా! అవసరం లేదు. మీరు వెళ్లిన ప్రాంతంలోని ప్రజల భాష ఏదైతే ఉందో ఆ భాషలోనే నా ధమ్మాన్ని ప్రబోధించండి. తమ తమ భాషల్లోనే (అమ్మనుడిలోనే) ప్రజలు ధమ్మాన్ని వినాలి. మీకు అలాంటి అనుమతిని ఇస్తున్నాను" అన్నాడు.**

**"ప్రజలు అనేదీ వినేదే మన భాష. రాతల్లో గీతల్లో ఉన్నది కాదు" అన్న గిడుగు పలుకుల్ని బుద్ధుడు రెండున్నర వేల సంవత్సరాల క్రితమే అమలు చేశాడు.**

నిత్య జీవితంలో భౌతిక జీవనానికి అవసరమైన భావ వ్యక్తీకరణకు అవసరమైన భాష....కాలక్రమంలో భావజాల వ్యాప్తికి ప్రధాన సాధనం అయ్యింది.

ఈ చరాచర జీవసృష్టిలో నాడీ వ్యవస్థ లేని జీవులేవీ లేవు. మొక్కల దగ్గర నుండి మనుషుల వరకూ ప్రతిజీవీ ఏదో ఒక రూపంలో భావ వ్యక్తీకరణ చేసుకుంటాయి. ప్రతి జీవి ఆలోచిస్తుంది. పరిసరాల అనుకూలతల్నీ, అననుకూలతల్ని గ్రహిస్తుంది. తన జాతితో 'కలివిడిగా' జీవిస్తుంది.

అయితే, కొన్ని జీవుల్లో ఇతర జీవుల మీద ఆధిపత్యం చెలాయించే జీవులున్నాయి. అలాగే...తన తోటి జాతి జీవుల మీదా అధికారం చెలాయించే జీవులూ ఉన్నాయి.

ఇవన్నీ తమ అధికారాన్ని, ఆధిపత్యాన్ని తమ శారీరక బలంతోనే సాధిస్తాయి. బలమైన జంతువు బలహీనమైన జంతువు మీద, క్రూరజంతువు సాధు జంతువు మీద తన ఆధిపత్యాన్ని కొనసాగిస్తుంది.

కానీ...మనిషి ఒక్కడే భుజబలంతోనే కాకుండా బుద్ధిబలంతో కూడా తోటి మానవుల మీద తన అణచివేతను కొనసాగిస్తాడు.

ఇతర జంతువుల్ని భుజబలంతోనో, బుద్ధిబలంతోనో దాసోహం చేసుకుని వాటిని బానిసలుగా మార్చుకున్నాడు. వీటికి 'పెంపుడు జంతువులు' అనే పేరు పెట్టుకున్నాడు.

అలాగే...తోటి మానవుల్ని ఈ పద్ధతిలోనే మొదట్లో బానిసలుగా మార్చుకున్నా..రాను రాను వారిని మానసిక బలహీనులుగా మార్చి, తనకు దాసోహం చేసుకోవడానికి భావజాలాన్ని సృష్టించుకున్నాడు.

దేవుడు, కర్మఫలం, పునర్జన్మ, స్వర్గం, నరకం, దైవాంశ సంభూతం, కులం, జాతి ఇలాంటివన్నీ ఈ భావజాలంలో భాగాలే. ఈ భావాల్ని పదేపదే చెప్పడం ద్వారా మనిషిని, మనసుని ఆ మత్తులో పడేసి ఉంచి, తన అధికారాన్ని చెలాయించుకుంటాడు.

ఇలా ఈ మత్తుల్లో మనసుని ముంచి తేల్చే సాధనమే భాష. ఈ విధంగా భాష భావజాల సాధనం అయ్యింది. సంభాషణలుగా, సాహిత్యంగా, ఆటగా, పాటగా, పద్యంగా, శ్లోకంగా, గీతంగా, గేయంగా, కవితగా, కథగా...ఇలా అనేక రూపాల్లో భావజాలం భాషను మలచుకొంది. మనసుల్ని వశపరుచుకుంది.

భావజాల ఆధిపత్యం వున్న ఒకే ఒక్క జీవి మానవుడు.

**రెండు ధోరణులు :** మానవ స్వభావంలో రెండు సహజమైన ధోరణులున్నాయి.

ఒకటి : ఆధిపత్యం వహించాలనే పశుస్వభావం.

రెండు : అందరినీ సమానంగా చూడాలనే మానవీయ స్వభావం.

వీటిలో మనుషుల్ని కులంగా, మతంగా, ప్రాంతంగా, లింగ భేదంగా విభజించి, హీనంగా చూసేది పశుస్వభావం. ఆ స్వభావాన్ని పెంచి పోషించే భావజాలం... ఆ భావజాలాన్ని వ్యాప్తి చేసే భాషా విధానాలు... కొంతమంది నిరంకుశులు మాత్రమే అధికారాన్ని చెలాయించే విధానం ఇది.

మానవ సమాజాలు ఏర్పడ్డ నాటి నుండి ఈ నాటి వరకూ ఈ నిరంకుశ మానవ భావజాలమే ప్రపంచంలో అన్నిచోట్లా ఉంది. ఒక జాతి గొప్పది. ఒక జాతి నీచమైంది. ఒకడు పాలించాలి. ఎందరో వీడికి బానిసలుగా బ్రతకాలి. ఎందరో శ్రమ చేయాలి. ఏ కొందరో ఆ ఫలితాన్ని అందుకోవాలి. ఒకడు అంటరానివాడు, ఒకడు నీచుడు, ఒకడు ఉన్నతుడు, ఒక కులాన్ని పూజించాలి. ఇలాంటి అమానవీయ భావజాలంతో ప్రపంచం నిండిపోయింది.

అయితే, మానవులందరూ సమానులే. ఆర్థికంగా, సామాజి కంగా, రాజకీయంగా అందరికీ ఒకే రకమైన హక్కు, సర్వమానవ శ్రేయస్సే మంచిది, ఏ రూపంగానైనా మానవ సమాజాన్ని చీల్చడం, వారిపై ఆధిపత్యం వహించడం అమానవీయం అంటూ చెప్పే భావజాలాలూ పుట్టుకొచ్చాయి.

ఈ మనవీయ, అమానవీయ భావజాలాలు రెండూ పరస్పరం సంఘర్షించుకుంటూనే ఉన్నాయి.

మానవీయ భావజాలం కూడా భాషను తన వ్యాప్తికి ఆయుధం లాగే ఉపయోగించుకుంది. మావనీయకోణంలో ప్రచారాన్ని, సాహి త్యాన్ని సృష్టించుకుంది.

ఇలాంటి మానవీయ భావజాలాల్లో బౌద్ధం కూడా ఒకటి.

**భావజాలం-భాష :** మనం ఇంతకుముందు చెప్పుకున్నట్లు ఒకరు ఎక్కువ- ఒకరు తక్కువ, ఒకరు ఉన్నతులు- ఒకరు నీచులు, ఒకరు పాలకులు- ఒకరు సేవకులు, ఒకరు యజమాని- ఇంకొకరు బానిస- ఇలాంటి అమానవీయ సామాజిక విభజనను దైవ నిర్ణ యంగా అమానవీయ భావజాలం చెప్తుంది. మన భరతఖండంలో ఈ అమానవీయ విభజనకు ప్రతినిధి 'వైదికధర్మం'.

చివరికి ఈ ధర్మం భాషల్ని కూడా తన సహజ అమానవీయ ధోరణిలోనే చూసింది. ఒక భాష ఉన్నతమైనది. అది దైవభాష. సాధారణ మానవులు నోటితో ఉచ్చరించకూడని భాష. అలా ఉచ్చరించి అపవిత్రం చేస్తే దానికి ఫలితంగా నాలుకను తెగ్గోసి, ఆ పాపాన్ని పరిహరించాలి. వింటే చెవుల్లో సీసం కాచి పోయాలి... లాంటి భావాల్ని ప్రచారం చేసింది. ఆచరణలో అలాంటి ఘోర కృత్యాల్ని ధర్మకార్యాలుగా చేసింది. వైదికధర్మం ప్రకారం అలాంటి పవిత్రమైన దైవభాష 'సంస్కృతం'.

వైదిక భావజాల ప్రచార సాధనాలైన వేదాలూ, ఉపనిషత్తులు, ఆరణ్యకాలు, ఇతిహాసాలు, పురాణాలు..అన్నీ సంస్కృతంలో ఉన్నాయి..ఉండాలి.

అంటే...అమానవీయ భావజాలానికి ప్రతినిధి అయిన వైదిక సాంప్రదాయక భాష సంస్కృతం అన్నమాట.

వారి సాంస్కృతిక ఆయుధం సంస్కృతం.

మరి నిమ్నవర్గాలుగా, నీచులుగా, శూద్రులుగా ఖచ్చితంగా చెప్పుకోవాలంటే వైదికేతరులుగా లేదా అబ్రాహ్మణులుగా ఉన్న అశేష ప్రజానీకం మాట్లాడే భాషలు ఎన్నో ఉన్నాయి.

వైదికధర్మం ప్రకారం ఆ ప్రజా భాషలన్నీ అవి మాట్లాడే మను షుల్లా అవీ అపవిత్రాలే.

**బౌద్ధభావజాలం - భాషలు**

మనం ఇంతకుముందు చెప్పుకున్నట్టు బౌద్ధం మానవీయ భావజాలం. మానవీయ జీవన విధానాన్ని ప్రబోధించే ధర్మం. వైదిక అమానుష విధానానికి బలైన అశేష ప్రజల్ని మానవులుగా తీర్చిదిద్ద దానికి ఉద్భవించిన ఉద్యమం. వైదిక భావజాలానికి ప్రత్యామ్నాయ మానవీయ భావజాలం అది.

మరి, ఈ భావజాలం ఏ భాషలో ప్రచారం కావాలి? అనేది బుద్ధుని ముందు నిలిచిన మొట్టమొదటి ప్రశ్న. ఎందుకంటే..

బుద్ధుడు ఆనాటి కాలంలో ఉన్న ఇతర తత్వవేత్తల్లా ముక్కు మూసుకుని ముక్తికోసం తపస్సు చేసిన తాపసి కాదు. సమాజంలో మానవీయ ధర్మాల్ని ఎలా నెలకొల్పాలో ఆలోచించి, శోధించి, సరైన మార్గాన్ని కనుగొన్న జ్ఞాని.

బుద్ధునికి కలిగిన సమ్యక్ జ్ఞానాల్లో భాష ఎంపిక కూడా ఒకటి.

విషయం ఎంపిక ఎలాగూ ఉంది. అది దుఃఖ నివారణ మార్గం. ఆ మార్గాన్ని ప్రబోధించే విధానం ఏమిటి? అనేది ఆ వెంటనే ఉద యించే ప్రశ్న. దానికీ శాస్త్రీయంగా మార్గం ఎంచుకున్నాడు బుద్ధుడు.

**ప్రజల భాష-పాళీ :** తన ప్రబోధాలను ప్రజల భాష అయిన 'మాగధీపాళీ' లోనే చెప్పాడు బుద్ధుడు. బుద్ధుని కాలానికి ప్రచారంలో వున్న సంస్కృతాన్ని తిరస్కరించాడు. ఎందుకు?

ముందుగా మనం ఎంచి చూడాల్సినవి-ఇవి

ఒకటి : అది వైదిక భాష.
రెండు : అది అమానవీయ భావజాలానికి ప్రతినిధి.
మూడు : సాధారణ ప్రజలెవరూ మాట్లాడలేనిది.
నాలుగు : అది ఒక విదేశీ భాష (ఆనాటికే)
ఐదు : మూలవాసుల భాషల్ని భగ్నం చేసిన భాష.

' జనని సంస్కృతంబు సర్వభాషలకును' అనేది ఒక పచ్చి మోసం. దగా. వంచన. అంతకుమించి, అహంకారం.

నిజం చెప్పాలంటే...

'భరత ఖండమున సంస్కృతంబు
సర్వ మూలభాషల వినాశనకరంబు ' అనడం వాస్తవం. పచ్చి నిజం.

ఈ విదేశీ భాష (మధ్య ఆసియా నుండి వచ్చిన ఆర్యుల భాష) మోజులో పడి, దాన్ని నేర్వడమే గొప్పపాండిత్యంగా భ్రమపడి, మూల భాషల్ని మూలకు నెట్టేశారు ఆనాటి పండితులు, పాలకులు. భారతీయ భాషల మీద జరిగిన మొట్టమొదటి పెద్ద దాడి ఇది. ప్రాంతీయ భాషల్లోని సొగసుల్ని, సొబగుల్ని, తియ్యదనాన్ని ధ్వంసం చేసిన భాష ఇది.

ఇప్పుడు ఆ దాడిని 'ఇంగ్లీషు' చేస్తోంది. ఇప్పటి పాలకులు, పండితులకు, విద్యార్థులకు ఇంగ్లీషు పిచ్చి ఎలా పట్టిందో ఆనాడు సంస్కృతం పిచ్చి అలాగే పట్టింది.

మన సంస్కృతి, నాగరకతల్ని ఇంగ్లీషు భావజాలం ఎలా నాశనం చేస్తుందని తల్లిడిల్లుతున్నామో, పాలకులు తమ దోపిడీకి ఇంగ్లీషు భాషను, విదేశీ సంస్కృతిని ఎలా ప్రోత్సహిస్తున్నారో ఆనాటి పాలకవర్గాలు కూడా సంస్కృతంతో అలాగే చేశాయి.

'మాతృభాషల్లో చదివితే మట్టిగొట్టుకుపోతాం. ఉద్యోగాలా? ఉపాధులా? ఇంగ్లీషు చదవకపోతే ఎందుకూ పనికిరాం' అని నేడు ఎందరో భావిస్తున్నారు. ఈ భావన అనేది ఒక భావజాల విష ప్రభావం. ఈ విషప్రభావానికి లోనై ఎలా మనందరం పరభాషా వ్యామోహానికి లోనై పోయే రోగానికి లోనయ్యామో, అలాగే ఆనాటి వారంతా సంస్కృతానికి అలా లోనైపోయారు. సంస్కృతం' తెలిస్తేనే పండితుడు. పైగా అది దైవభాషగా ప్రచారం. నీచ జాతులు దాని జోలికి పోకూడదు. పోతే పాపం చుట్టుకుంటుంది. ఎవరో కొందరు జిజ్ఞాసులు 'పాపా'లకి భయపడకుండా, ధైర్యంగా ఆ భాష జోలికి పోతే- వెంటనే కఠినమైన శిక్షలు.

ఇలా, నయానాభయానా సంస్కృతాన్ని దైవభాషగా. సంస్కృతం తెలిసిన వైదికుల్ని దైవజ్ఞులుగా భావించే భారతదేశం తయారైంది.

అందుకే–

**తన మానవీయ బోధన కోసం అమానవీయ భాష అయిన సంస్కృతం జోలికి బుద్ధుడు పోలేదు.**

ప్రజల భాష అయిన 'పాళీ' భాషలోనే తన ప్రబోధాలన్నీ చేశాడు.

**మాండలికాలు :** బుద్ధుని బోధన వల్ల పాళీ భాష మానవీయ భాషగా నిలబడింది.

బౌద్ధుల మూడు పిటకాల్లో వినయపిటకం ఒకటి. ఇది బౌద్ధ భిక్షువులు పాటించాల్సిన నియమావళి.

**వినయపిటకంలో చూళవగ్గ (చిన్నవర్గం)లో ఐదో భాగం ఖుద్దక వత్థుక్ఖందకం (క్షుద్రక వస్తుకాండ). అందులో ఈ భాషా నియమావళి ఉంది.**

"లోక కళ్యాణకారకమైన సమ్మాసంబుద్ధుని బోధనలు లోక భాషల్లోనే చెప్పాలి.వేద భాషల్లో కాదు" అని.

అంటే..బౌద్ధ బోధనలన్నీ ప్రజల భాషైన పాళీ భాషలోనే ఉండాలి అని.

అయితే, బుద్ధుని కాలంలోనే వైదిక బ్రాహ్మణ కులం నుండి కూడా ఎందరో పండితులు బౌద్ధం పట్ల ఆకర్షితులై, భిక్షువులుగా మారి భిక్షు సంఘంలో చేరారు.

వారు, ఎంతగా బౌద్ధ సంఘంలోకి వచ్చినా, తమ పాత వాసనలు వదిలిపెట్టలేదు. వారిలో యమేలుదు, తేకులుడు అనేవారు ఇద్దరు. వీరు సంస్కృతభాషలో, ఛందస్సులో ప్రవీణులు. ఛందస్సు అంటే పద్యగతుల్ని తెలిపే ఈనాటి ఛందస్సు కాదు. ఛందస్సు అంటే వేద శ్లోకాల రచనా విధాన్ని వివరించి, ఆ పదాల అర్థాలు, వ్యుత్పత్తి అర్థాలు, పద నిర్మాణాల్ని వివరించే 'నిరుక్త'మే! అంటే వేద శ్లోకాలకు చెందిందే ఛందస్సు.

అలాంటి ఛందస్సులో ప్రాజ్ఞులైనవారు ఈ యమేలుదు, తేల కుడు. వీరిద్దరూ బుద్ధుని దగ్గరకు వచ్చి,

"భంతే! నానా నామాలవారు, నానా గోత్రాలవారు, నానా జాతుల వారు ఇప్పుడు సంసారాల్ని వదిలిపెట్టి బౌద్ధ భిక్షువులుగా మారిపోతున్నారు. వారంతా తమ తమ భాషల్లో బుద్ధవచనాల్ని ప్రబోధిస్తున్నారు. వారందరూ ఆ వచనాల్ని సరిగా ఉచ్చరించడం లేదు. కాబట్టి మేము మీరు ప్రబోధించిన 'బుద్ధప్రబోధాల్ని' వేదంలోని శ్లోకాల్లా సంస్కృతంలోకి మారుస్తాం. ఛందోబద్ధం చేస్తాం. మాకు అనుమతి నియ్యండి" అని అడిగారు.

వారి విన్నపాన్ని బుద్ధుడు పూర్తిగా తోసిపుచ్చాడు. పైగా వారిని తీవ్రంగా మందలించాడు కూడా. వెంటనే మిగిలిన భిక్షు సంఘా న్నంతా సమావేశపరచి

"భిక్షులావురా! బుద్ధప్రబోధాల్ని ఎప్పుడూ ఛందోబద్ధం చేయ కూడదు. సంస్కృతంలోకి మార్చకూడదు. అలా చేయడం మన బౌద్ధ సంఘ నియమావళిని ధిక్కరించినట్లే అవుతుంది. ఆ పని దుష్కృతం అవుతుంది. నేరం అవుతుంది" అని చెప్పాడు.

అప్పుడు ఇంకొందరు భిక్షువులు లేచి–

"భంతే! ఇతర ప్రాంతాలకు పోయినప్పుడు అక్కడి వారికి పాళీ భాష రాదుకదా! అప్పుడేం చేయాలి? బుద్ధప్రబోధాల్ని పాళీ భాషలోనే చెప్పాలా?" అని అడిగారు.

"భిక్షువులారా! అవసరం లేదు. మీరు వెళ్లిన ప్రాంతంలోని ప్రజల భాష ఏదైతే ఉందో ఆ భాషలోనే నా ధమ్మాన్ని ప్రబోధించండి. తమ తమ భాషల్లోనే (అమ్మనుడిలోనే) ప్రజలు ధమ్మాన్ని వినాలి. మీకు అలాంటి అనుమతిని ఇస్తున్నాను" అన్నాడు.

"ప్రజలు అనేదీ వినేదే మన భాష. రాతల్లో గీతల్లో ఉన్నది కాదు" అన్న గిడుగు పలుకుల్ని బుద్ధుడు రెండున్నర వేల సంవత్సరాల క్రితమే అమలు చేశాడు.

ఈ ప్రజల భాషా విధానాన్ని అశోకుడు కూడా తన శాసనాల్లో పాటించాడు. ఆయా ప్రాంతాల భాషల్లో, మాండలికాల్లో అశోకుని శాసనాలు లభించాయి.

(బౌద్ధ చక్రవర్తుల శిలా శాసనాలు తప్ప మిగిలిన వారి శాసనా లన్నీ సంస్కృతంలోనే ఉండేవని మరచిపోవద్దు)

తెలుగు రాజధాని శంఖుస్థాపన శిలాఫలకాన్ని ఇంగ్లీషులో వేయించిన మన పాలకుల భావదారిద్ర్యం, పరభాషా వ్యామోహం– అశోకునికి లేదు. అందుకే అశోకుడు అజరామరంగా చరిత్రలో నిలిచాడు. తానే చరిత్ర అయ్యాడు.

**ఆంధ్ర బౌద్ధులు :** బౌద్ధంలో ఈ భాషా సంప్రదాయం చాన్నాళ్లు కొనసాగింది. ఇతర ప్రాంతాల మాదిరిగా మన తెలుగు నేలపై ఆనాడు మన భాషలోనే బౌద్ధ ప్రచారం జరిగి వుంటుంది. దానికి తగిన సాక్ష్యాలు ఇంతవరకు దొరకలేదు. కానీ, ఆనాడు "సంస్కృతంలో బుద్ధవచనాల్ని ఛందోబద్ధం చేస్తాం" అన్న యమేలుదు, తేలకుల ఆలోచనలు మన తెలుగునేల మీదే ఆ ఎన్నో శతాబ్దాల తర్వాత తిరిగి తలెత్తాయి.

ఆచార్య నాగార్జునుడు, బుద్ధఘోషుడు,ధర్మకీర్తి మొదలైనవారు బుద్ధప్రబోధాల్ని సంస్కృతంలోకి మార్చారు. సంస్కృత బౌద్ధ గ్రంథాల రచనకు తెర తీశారు. దీనికి మహాయాన గ్రంథం లలితవిస్తరం శ్రీకారం చుట్టింది. బౌద్ధపురాణాలూ పుట్టుకొచ్చాయి.

బుద్ధఘోషుడు జాతక కథలకి ముందుమాటగా రాసిన 'నిదాన కథ' బుద్ధుని పౌరాణికతకి మరో నిదర్శనం.

ఆ తర్వాత క్షేమేంద్రుడు రాసిన 'అవధాన కల్పలత' అనే సంస్కృత గ్రంథంలో బుద్ధుడు పూర్తిగా పురాణ పురుషుడైపోయాడు. అయితే...

ధర్మప్రబోధాలకి ఏ భాష అయినా పనికి వస్తుంది. ఒక భాష పవిత్రమైంది– ఒక భాష అపవిత్రమైంది కాదు అనేది బుద్ధుని భావన.

**ప్రజల భాషే ధర్మ భాష.**

**ప్రజల భాషే ప్రామాణిక భాష.**

**అని ఈ ప్రపంచానికి చాటిచెప్పిన తొలి భాషోద్యమకారుడు బుద్ధుడే!.**

రచయిత ఫోను : *93906 00157*

–వల్లభనేని షణ్ముఖానంద



# ఉద్వేగాలు – అనుపశ్యన

**ఉద్వేగాలు కలగటానికి బాహ్య పరిస్థితులు కారణం అయినా మన అంతరంగం కూడా అదే స్థాయిలో కారణం అవుతుంది. బాహ్య పరిస్థితులు అందరికీ సులభంగానే అర్థం అవుతాయి. కాని అంతరంగ కారణాలు అంత సులభంగా అర్థం కావు, తెలియవు. కారణం మనం ఎప్పుడూ బహిర్ముఖులమై వుంటాము. అంతర్ముఖత్వం అంతర్‌దృష్టి మాత్రమే అంతరంగ కారణాలను తెలియపరుస్తాయి. కనుక అంతరంగ పరిశీలన చాలా అవశ్యకము. ఇక్కడే అనుపశ్యన మనకు ఉపయోగపడగలదు.**

**అ**నుపశ్యన అనేది బుద్ధుడు మానవాళికి అందించిన సాధన. నిర్వాణాన్ని అనుభవంలోకి తెచ్చుకోవటానికి ఉద్దేశించి, ఈ అను పశ్యనను బుద్ధుడు బోధించాడు. అనుపశ్యనను సాధన చేసే క్రమంలో మన ఉద్వేగాలు కూడా అనుపశ్యనకు (పరిశీలనకు) గురి అవుతాయి. కనుక ఈ అనుపశ్యనను ఉద్వేగాలను కలిపి తెలుసు కోవటం ప్రయో జనకరంగా వుంటుంది. ముందుగా ఉద్వేగాలను గురించి తెలుసు కుందాం.

ఉద్వేగాలు అభివృద్ధి చెందిన ప్రతిప్రాణికి సహజంగా వుండేటటు వంటివే. మానవుడికి ఇవి బాగా అభివృద్ధి చెంది ప్రదర్శనకు గుర్తింపునకు లోనౌతున్నాయి. కొన్ని రకాల బాహ్య ప్రోత్సాహకాలకు జవాబుగా చేసే ప్రతిచర్యలే ఉద్వేగాలు అనవచ్చు. ఉద్వేగాలు కలిగి నపుడు శరీరము, మెదడు, ఆలోచనలు ఈ మూడు అందులో నిమ గ్నమై వుంటాయి. ఈ మూడింటి పాత్ర లేకుండా ఉద్వేగం వుండదు.

ప్రేమ, భయం, కోపం, ఉల్లాసం, దుఃఖం, అయిష్టం, ఆశ్చర్యం, అపరాధ భావన, శ్రద్ధ వీటిని ప్రధాన ఉద్వేగాలుగా పేర్కొనవచ్చు. ఇవి నేర్చుకున్నవికావు. సహజాతాలు. వీటి వల్ల ఉపయోగాలు వున్నా శ్రుతిమించినపుడు ఉద్వేగపడిన వారికి ఎదుటవారికి శారీరక, మానసిక ఇబ్బందులను కష్టాలను తెచ్చి పెడతాయి. ఇవి అవసరానికి మించి అసహజ స్థాయిలో వుంటే సంబంధ బాంధవ్యాలను కూడా దెబ్బతీస్తాయి.

వాడు నన్ను మోసం చేశాడు, అది చాలా ప్రమాదకరం, ఇది చాలా అన్యాయం.. నన్ను కొడతాడా? భలేగా వుంది. ఇవన్నీ వివిధ ఉద్వేగాలు మనలో కలిగినపుడు వచ్చే ఆలోచనలు. కనుక ఉద్వేగాలు ఆలోచనల వల్ల కల్గుతాయి. మరికొన్ని ఆలోచనలు ఉద్వేగాలు కలిగిన తర్వాత వస్తాయి. కనుక ఉద్వేగాలకు ఆలోచనలను సంబంధం వుంది.

కొట్టడం, తిట్టడం, వాటేసుకోవటం, పారిపోవటం, ఏడవటం, ముఖాన్ని ప్రక్కకు తిప్పుకోవటం వంటివి చేస్తాము. అనగా ఉద్వేగాలు భౌతిక చర్యలను పురికొల్పుతాయి.

చెమటలు పట్టడం, గుండె వేగంగా కొట్టుకోవటం, శరీరం కంపించడం, కండరాలు బాగా తీసుకోవటం నరాలు లాగటం దాహం వేయటం మొదలగు శారీరక మార్పులు కలుగుతాయి. అనగా ఉద్వే గాలు శరీర అంతర్భాగాలకు, రసాయనిక మార్పులను కలుగజేస్తాయి.

ఉద్వేగాలు అందరికీ వుండేటటువంటివే అయినా, కలగటం కలగక పోవటం, హెచ్చుతగ్గులు అనేవి మనిషిని బట్టి సందర్భాన్ని బట్టి మారుతూ వుంటాయి. ఒకే సందర్భం. ఒక మనిషికి కోపాన్ని తెప్పిస్తే, మరో మనిషికి బాధను (దుఃఖాన్ని) తెప్పిస్తుంది. ఒక విష యంలో ఒక వ్యక్తికి శ్రద్ధ కలిగితే అదే విషయం మీద మరొక వ్యక్తికి అయిష్టం కలుగుతుంది. ఉద్వేగాలు సముద్రపు ఆటుపోటులు లాగా వచ్చిపోతూ వుంటాయి. శాశ్వతాలు కావు. అయితే కొందరు వీటిల్లో కొన్నింటిని సాధన చేస్తారు. కొందరు ప్రతి విషయానికి కోపాన్ని ప్రదర్శిస్తారు. మరి కొందరు అన్ని విషయాలకు దుఃఖిస్తారు. అవి అపుడు ఉద్వేగాలు అనిపించుకోక స్వభావాలుగా పిలవబడ తాయి. వాడు కోపిష్టిరా! వీడు ఎపుడూ ఏడుస్తూ వుంటాడు. వాడు కులాసా పురుషుడు అని అంటూ వుంటాము. అనగా వాళ్లిల్లో ఆ ఉద్వేగాలు నిలబడి పోతాయి అన్నమాట. ఉద్వేగం కనుక ఎక్కువసేపు వుంటే అది అపుడు "మూడ్" (mood)గా మారుతుంది. అనగా ఆ ఉద్వేగం తొందరగా ఆ మనిషిని వదలదు.

ఉద్వేగాల వలన కొన్ని లాభాలు వున్నాయి. 1) ఇవి మనలను చర్యకు పురికొల్పుతాయి. ఉదా: పామును చూడగానే భయం కలిగి ఒక గంతు వేస్తాము. 2) మన భావాలను ఇతరులకు తెలియ పరు స్తాము. 3) పరిసరాల పట్ల అవగాహనను కలిగిస్తాయి. ఉదా : ఎత్తయిన ప్రదేశాలు ప్రమాదకరం అని భయం మనకు తెలియ పరుస్తుంది. ఒక వ్యక్తితో సంబంధం అంత మంచిది కాదని అతని

మీద అయిష్టం మనకు తెలియ పరుస్తుంది. 4) పరిసరాలకు తగి నట్లుగా మనలను తయారు చేస్తాయి. ఉదా: పరిసరాలు ప్రమాదకరం అని గుర్తించగానే శరీరం అక్కడ నుండి వైదొలగటానికి సిద్ధమవు తుంది. ఎదుటి వ్యక్తి మన మీదకు దాడి చేయటానికి సిద్ధపడినపుడు మన కోపం అందుకు ప్రతిస్పందించిదానికి తయారు అవుతుంది. మనలో వున్నప్రేమ ఎదుట వ్యక్తితో మనకు గల సంబంధాన్ని వృద్ధి చేస్తుంది. మైత్రీ భావనను నెలకాల్పుతుంది. క్రొత్త విషయాల పట్ల మనకు కలిగే ఆశ్చర్యం అ విషయాన్ని మరింతగా తెలుసుకొనేటట్లు చేస్తుంది.

మనలో ఉద్వేగాలు కలగటానికి బాహ్య సంఘటనలు పరి స్థితులు. ప్రేరణలు మాత్రమే కారణాలు కావు. మన అంతరంగంలోని ఆలోచనలు, భావాలు, నమ్మకాలు. జ్ఞాపకాలు ఆయా సంఘటనలను అనువరించుకున్నా తీరు. ఆ సంఘటనల న్యాయాన్యాయాలను నిర్ణ యించడం, విలువ కట్టడం మొదలగు విషయాలు కూడా కారణా లౌతాయి.

ఉద్వేగాలు సహజమైనవే అయినా కొన్నింటిని మనం తెచ్చు కుంటున్నామని చాలామందికి తెలియదు. సహజమైనవి, అలా వచ్చి అలా వెళ్ళిపోవాలి. కాని అవి మన స్వభావాలుగా ఎందుకు మారు తున్నాయి? అంటే మనం వాటిని సాధన చేస్తున్నామని. నేర్చు కుంటున్నామని అర్థం ఉదా : పామును చూడగానే భయం వేసి ఒక గంతు వెనక్కు వేయడం సహజం. ఎవ్వరైనా చేస్తారు. కానీ అలా చేసి భయపడి, అరే! నేను భయపడ్డానే అని సిగ్గు పడటం, సహజమైనది కాదు. ఇది ఆలోచనతో వచ్చినది. అలాగే. నన్ను వాడు బాధపెట్టినాడు అని వాడి మీద కోపం, పగ, పెంచుకోవటం, నేను జీవితంలో చాలా బాధలు పడ్డాను అని దుఃఖించటం, కోపం తెప్పించినాడని కోపం తెచ్చుకోవటం. ప్రేమను, స్నేహాన్ని పొందలేక పోతున్నాననే కోపంతో యాసిడ్ దాడులు చేయడం. ఇలాంటివన్నీ కృత్రిమమైనవి. అందర్నీ పట్టి పీడిస్తున్నవి ఇవే. కనుక నియంత్రించు కోవాలి.

హత్యలు, ఆత్మహత్యలు, మానసిక రోగాలు మానసిక క్రుంగు బాటులు, జీవితాన్ని నిస్సారం చేసుకోవటం. మానభంగాలు, దురలవాట్లు, ఉన్మాదం, సంఘ విద్రోహశక్తులుగా మారడం మొదలగు లక్షణాలన్నింటికి కారణం అదుపు తప్పిన ఉద్వేగాలు కాక మరొకటి లేదు. ఉద్వేగాలు మనలనే కాదు. ఎదుటివారిని మొత్తం సమాజాన్ని నష్టపరుస్తాయి. కనుక ఎలా నియంత్రించుకోవాలో తెలుసుకుందాం.

ఉద్వేగాల నియంత్రణ రెండు స్థాయిలలో జరుగుతుంది. మొదటిస్థాయిలో అవి కలుగుతున్నపుడు ఎరుకతో వుండి వాటి తీవ్రతను అడ్డుకోవటం, రెండవ స్థాయిలో ఉద్వేగాలు ఎలా ఏర్పడు తున్నాయో వాటి అంతరంగ కారణాలను తెలుసుకుంటూ వాటిలో మార్పు తెచ్చుకోవటం, మరియు కృత్రిమ అనగా పెంపొందించుకున్న, నేర్చుకున్న ఉద్వేగాలను మానుకోవటం.

ఉద్వేగాలు కలగటానికి బాహ్య పరిస్థితులు కారణం అయినా మన అంతరంగం కూడా అదే స్థాయిలో కారణం అవుతుంది. బాహ్య పరిస్థితులు అందరికీ సులభంగానే అర్థం అవుతాయి. కాని అంతరంగ కారణాలు అంత సులభంగా అర్థం కావు, తెలియవు. కారణం మనం ఎప్పుడూ బహిర్ముఖులమై వుంటాము. అంతర్ముఖత్వం అంతర్‌దృష్టి మాత్రమే అంతరంగ కారణాలను తెలియపరుస్తాయి. కనుక అంత రంగ పరిశీలన చాలా అవశ్యకము. ఇక్కడే అనుపశ్యన మనకు ఉపయోగపడగలదు. ఇపుడు అనుపశ్యన గురించి తెలుసుకొని ఈ అనుపశ్యన ఉద్వేగాలతో ఎలా వ్యవహరిస్తుందో చూద్దాం.

"అను" అంటే అనుకరణ లేదా అనుసరించడం. 'పశ్యన' అంటే చూడటం. కనుక "అనుపశ్యన" అంటే అనుసరిస్తూ చూడటం. దేనిని అనుసరిస్తూ చూడటం. ఉద్వేగం కలిగినపుడు మన శరీరం చిత్రం ఛిత్ర ధర్మం ప్రభావానికి లోనై వేదనలు కలుగుతాయి కాబట్టి వీటిన్ని అనుసరిస్తూ చూడటం అంటే శరీరాన్ని వేదనలను, చిత్తాన్ని, ధర్మాన్ని అనుసరిస్తూ చూడటం. ఉద్వేగం కలిగినపుడు మన శరీరం, చిత్తం, చిత్తధర్మం ప్రభావానికి లోనై వేదనలు కలుగుతాయి. కాబట్టి వీటిల్ని అనుసరిస్తూ చూడటం శరీరాన్ని అనుసరిస్తూ చూడటాన్ని కామాను పశ్యన, అని బుద్ధుడు అన్నాడు అలా వేదనానుపశ్యన, చిత్రానుపశ్యన, ధర్మానుపశ్యన అని చెప్పివున్నాడు.

దీనినే మరొక చోట "సతి పట్ఠానం" అని వివరించాడు సతి అంటే స్మృతి, అంటే జాగరూకత. మెలకువగా వుండటం. అనగా "ఎరుక, స్మృతి, సతి అక్కడ ప్రతిస్థాపితము అవుతుంది అని. ధానము అంటే స్థానము. మన సతి, జాగరూకత ఏ స్థానంపై ఉండాలి? అలాంటి స్థానాలను నాలుగింటిని పేర్కొన్నాడు బుద్ధుడు. అవే కాయం, (శరీరం), చిత్రం (మనస్సు), వేదన (sensatoins & feelings) ధర్మం (స్వభావం) మన సతిని స్థానములో పెట్టినపుడు మనకు అనుపశ్యన కల్గుతుంది.

మనం దేనిని అనుసరిస్తూ పోతున్నమో దానిని సమర్ధించడం గాని వ్యతిరేకించడం గాని, మంచి చెడులు నిర్ణయించడం గాని కావాలి వద్దు అనడం గాని చేయకూడదు. తటస్థంగా వుంటూ చూడటాన్నే అనుపశ్యన అంటారు. అనుపశ్యన సతిని ప్రతిస్థాపితం చేయకుండా సాధ్యపడదు.

మనం ఏకాగ్రత వహించినపుడు. ఆ ఏకాగ్రత చెదరగానే మనకు తెలియ పరిచేదానినే "సతి" అంటాము. ఏకాగ్రత, సతి, రెండూ సమాంతరంగా నడుస్తూ ఏకాగ్రత కోల్పోయినపుడు సతి మనలను హెచ్చరిస్తుంది. అపుడు తిరిగి మనం ఏకాగ్రత వహిస్తాము.

సతి ఎప్పటికపుడు మనం ఉన్న స్థితిని తెలియ పరుస్తుంది. ఎరుక పరుస్తుంది. ఇప్పుడు మనం కాయానుపశ్యన గురించి తెలుసు కుందాం. కాయం అంటే శరీరం. ఈ శరీరం రకరకాల పనులు చేస్తూ వుంటుంది. మనం నడుస్తూ వుంటాం. మాట్లాడుతూ వుంటాం. కూర్చుని వుంటాం. ఇలా వుంటూ వున్నప్పుడు శరీరం వివిధ భంగిమలను, వివిధ కదలికలను ఏర్పరుస్తుంది. వివిధ రకాల ముఖ కవళికలు వుంటాయి. వీటికి, మానసిక స్థితికి, భావోద్వేగాలకు సంబంధం వుంటుంది. ఒక్కొక్క ఉద్వేగం ఒక్కొక్క భంగిమలోనే సాధ్యం. ముఖాన్ని బట్టి ఉద్వేగాన్ని చెప్పవచ్చు. కోపం ఒకరకమైన ముఖాన్ని కల్గి వుంటే ఆశ్చర్యం మరొక రకమైన ముఖకవళికను ఏర్పరుస్తుంది. కాయానుపశ్యనలో ఇవన్నీ పరిశీలించబడతాయి. శరీరపు భంగిమలోని మార్పు ఉద్వేగాలను ఉపశమింపజేస్తాయి. ఉదా: ముఖములోని నవ్వు కోపాన్ని రానివ్వదు. రొమ్ము విరుచుకొని మనం దుఃఖించజాలము. ఉద్వేగాలను నేరుగా పరిశీలించలేని వారు శరీరాన్ని పరిశీలిస్తూ శరీర కదలికలలో మార్పుని గుర్తించడం ద్వారా

ఆయా ఉద్వేగాలను గుర్తించవచ్చు.

చిత్తానుపశ్యనలో చిత్తాన్ని ఎల్లవేళలా పరిశీలించడం, గమనించడం, అనుసరిస్తూ చూడటం జరుగుతుంది. చిత్తంలో అనేక భావాలు, నమ్మకాలు, ఉద్దేశాలు, సిద్ధాంతాలు, ఇష్టాలు, అయిష్టాలు, మంచి చెడులకు సంబంధించిన జ్ఞానం, నీతి నియమాలు, కోరికలు, ఆశలు, విలువలు, పక్షపాతాలు, అధర్మాలు, ధోరణులు మొదలైనవి వుండి, బాహ్య సంఘటనలతో సవాళ్ళతో, ప్రేరణలతో సంబంధాన్ని కలిగి వుండి మనలో ఉద్వేగాలను కలుగజేస్తాయి. చిత్రంలో పైన పేర్కొన్నటువంటి అనేకానేక విషయాలకు బాహ్యము అనుకూలమా, విరుద్ధమా అనే దానిని బట్టి మన ఉద్వేగాలు ఆధారపడి వుంటాయి. ఉదా: మన అంతరంగంలోని కోరిక(ఆశ)కు తగినంతగా బాహ్యం నుండి పొందుతున్నది లేకపోతే అసంతృప్తి, మనం ఆశించిన దానికన్నా ఎక్కువగా పొందుతున్నప్పుడు ఉల్లాసము మనకు కలుగుతాయి.

మనం దైవంగా భావించే రాముడిని ఎవరైనా దూషిస్తే మనకు కోపం రావచ్చు. పామును చూస్తే వచ్చే భయం పాము ఆకారం వల్ల వచ్చినది కాదు. అది కాటేస్తుంది, కాటేస్తే చనిపోతాము అన్న మన జ్ఞానం మనలను భయకంపితులను చేస్తుంది. మెట్లమీద రెయిలింగ్ వుంటే ధైర్యంగా ఎక్కుతాము. అదే మెట్లమీద రెయిలింగ్ లేకపోతే భయంభయంగా ఎక్కుతాము. మన జ్ఞానం మనలను భయపెడుతుంది. చిత్తోపాసన ఈ విషయాలను బహిర్గతపరిచి తదను గుణమైన మార్పులు చేయటం ద్వారా ఉద్వేగాలను నియంత్రించవచ్చు. అంతరంగాన్ని ప్రశ్నించటమే మార్పుకి పునాది.

చాలా ఉద్వేగాలు నేర్చుకున్నవే. ప్రతి సంఘటనకు ఎలా స్పందించాలో అని మనకు చిన్నతనం నుండే నేర్పుతారు. ఉదా: మగవాడు ఏడవకూడదు అని అంటుంటారు. అలాంటివాడు ఏదైనా సందర్భంలో ఏడ్చి అలా ఏడ్చినందుకు సిగ్గుపడతాడు. వాడు తిడుతూ వుంటే నీకు కోపం రావటం లేదా? అని రెచ్చగొడతాము. ఇలా మనకు నేర్పబడినవి. ఇలాంటి మన ఆలోచనలు అన్ని ఉద్వేగాలను ప్రేరేపిస్తాయి. చిత్తానుపశ్యన ద్వారా ఇవన్నీ మన గమనంలోకి వస్తాయి. వీటిల్ని అవగాహన చేసుకోవటం ద్వారా వీటన్నింటినుండి విముక్తి పొందవచ్చు.

గుండె వేగంగా కొట్టుకోవటం కండరాలు బిగదీసుకు పోవటం, చమటలు రావటం, నాలుక ఎండిపోయినట్లు అనిపించడం, శ్వాస తీసుకోవటంలో మార్పులు, కండ్లవెంట నీరు కారటం మొదలగు వేదనలు, ఉద్వేగాలకు గురి అయినపుడు కలుగుతాయి. అలాగే రక్తప్రసరణ, జీర్ణక్రియ, మలమూత్ర విసర్జనా క్రియలు మొదలగు శరీర అంతర్భాగాల పని అస్తవ్యస్తం అవటం శరీరంలో రసాయనిక మార్పులు చోటుచేసుకుంటాయి. ఇవన్నీ వేదనానుపశ్యనలో గమనంలోకి వచ్చి కొంత ఉపశమనం కల్గుతుంది.

ధర్మానుపశ్యన అనగా చిత్తస్వభావాన్ని అనుసరిస్తూ చూడటం, బుద్ధుడు చిత్తస్వభావం ఐదు రకాలుగా వుంటుందిన తెలియపరిచాడు. వీటిని నీవరణాలు అన్నాడు.

అవి 1. ఇంద్రియ వాంఛలు 2. ద్వేషం 3. అలసత్వం 4. వ్యాకులత 5. శంక (సందేహం). ఇవి ఉద్వేగాలను కలిగిస్తాయి. ఏకాగ్రత వహించడానికి కూడా ఆటంకాలుగా వుంటాయి. ఇవి 'నేను' 'నా' 'నాది' అనే అహంకార ప్రక్రియ యొక్క అభివ్యక్తాలు. అహంకార భావన ఎక్కడ వున్నదో అక్కడ తప్పనిసరిగా ఉద్వేగాలు కలుగుతాయి. కనుక ఈ ధర్మానుపశ్యన అహంకారాన్ని తుడిచి వేస్తుంది.

అనుపశ్యన, అనుసరిస్తూ చూడటం అనేది మమేకం అవటానికి వ్యతిరేకమైనది. మమేకం అవటం అంటే కొనసాగించటం అని అర్థం. సమర్థన వున్నపుడు కొనసాగింపు వుంటుంది. ఉద్వేగాలు కొనసాగు తున్నాయి అంటే వాటిల్ని మనం సమర్థిస్తున్నామని అర్థం. ఉద్వేగాలు కలిగి నష్టం, కష్టం కలిగిన తర్వాత అపుడు ఎరుక కలుగుతుంది. మనం భయపడ్డాము. కోపం వచ్చింది. దుఃఖించాం అని. ఈ అనుపశ్యన, ఉద్వేగం కలిగి చల్లారిపోయిన తర్వాత వచ్చిన ఎరుకని ఇంకా ముందుకు జరిపి ఉద్వేగం కలుగుతూ వున్నప్పుడు ఎరుక కలిగేటట్లు చేస్తుంది. ఇంకా ముందుకు జరిగి ఉద్వేగం కలుగ మొదలు పెట్టగానే ఎరుక కలిగి ఉద్వేగాన్ని ఆపివేస్తుంది. ఇంకా ముందుకు జరిగి ఉద్వేగం కలగటానికి కారణమైన చిత్త స్వభావాన్ని ఎరుకపరిచి ఆ స్వభావాన్ని అందుకు కారణాలైన 'అకుశల' కారకాలను చిత్తం తొలగిస్తుంది.

అనుపశ్యనను సాధన చేయదలచిన వారు ముందుగా ధ్యాన భంగిమలో కూర్చుని ధ్యానాన్ని అనగా ఏకాగ్రతను అభ్యసిస్తూ మెల్లగా ఈ ఏకాగ్రతను చిన్న చిన్న శరీర కదలికలు, కార్యకలాపాలు లేదా పనులు చేస్తూ ఏకాగ్రత చెదరకుండా చూసుకుంటూ, అంతే మెల్లగా దైనందిన కార్యకలాపాలు అన్నీ కూడా ఈ ఏకాగ్రత చెదరకుండా చేసుకునే స్థాయికి ఎదిగిన రోజున ఉద్వేగాలు జనించవు. ఎప్పటి కప్పుడు సతిపట్ఠానాన్ని మారుస్తూ వుండాలి.

మనం ఎల్లవేళలా మన శరీరాన్ని, చిత్తాన్ని, వేదనలని, చిత్త స్వభావాన్ని గమనిస్తూ వీటిలో వచ్చే మార్పుల పట్ల ఎరుక కలిగి వుండాలి.

ఉదా : మనం ఎదుట వ్యక్తితో మాట్లాడుతున్నాం. అకస్మాత్తుగా కోపం వచ్చింది. గమనిస్తూ వున్నాం. శరీరపు భంగిమలో మార్పు వచ్చింది. ఎదుట వ్యక్తి మీదకు ఎగసి ఎగసి పడుతున్నాము. కొడదామని చేతులు పైకి లేస్తున్నాయి. మాటలు పెద్దగా వేగంగా దురుసుగా వస్తున్నాయి. వీటిల్ని గమనించడం కాయానుపశ్యనలో భాగం. శ్వాస తీసుకోవటంలో వేగం పెరిగింది. రక్త ప్రసరణ ఒత్తిడికి గురి అవుతుంది. శరీరం కంపిస్తుంది. కళ్ళు ఎర్రబడ్డాయి. వీటిల్ని గమనించడం వేదనానుపశ్యనలో భాగం. ఎదుట వ్యక్తి మాట్లాడే మాట మనకు నచ్చలేదు. అలాగా మాట్లాడేది? ఏమన్నా అర్థం వుందా? అలా మాట్లాడవద్దు అని చెబుతూ వున్నాను కదా! ఇవి మన మనసులో కలిగిన భావాలు. ఇది చిత్తానుపశ్యనలో భాగంగా మనం తెలుసుకోగలిగాము. వాడిపట్ల ద్వేషం కలిగింది. ఇది మన మనసు యొక్క ఆ క్షణాన వున్న స్వభావం. ఇది ధర్మానుపశ్యన.

ఈ రకంగా ఉద్వేగాలు మనకు చెప్పి రాకపోయినా వాటిపట్ల జాగరూకత, వాటి పుట్టుకను, వృద్ధిని ఆపుతుంది. మన మనసులో దాగి వున్న ఏ కారణం ఎపుడు, ఎలా, ఎలాంటి ఉద్వేగాన్ని కలిగిస్తుందో మనం చెప్పజాలము. కనుక నిరంతరం ఎరుక కలిగి వుండటం ఉద్వేగాలను ఆపటమే కాక స్థితప్రజ్ఞతకు బుద్ధుడు చెప్పిన నిర్వాణాన్ని ఆస్వాదించవచ్చు. ❊

కథానిక

–దారా సురేంద్ర

# శంకరానిక్కొంచెం తిక్కుంది

**"వెధవ తెలుగు.. వెధవ తెలుగని.." అంటూ చిరాగ్గా ఇంటి లోపలికి వచ్చాడు శంకరం. అతను తెలుగుని తిడుతున్నాడనుకుంటే మీరు దాల్‌మఖనీలో పాదం మోపినట్టే. శంకరం తిడుతున్నది అతనికి కోపం తెప్పించేట్టు తెలుగుని మాట్లాడుతున్న మనిషిని.**

శంకరానిక్కొంచెం తిక్కుంది, కానీ దానికో లెక్కుంది. ఆ తిక్క గబ్బర్‌సింగ్ సినిమా వచ్చినప్పటి నుంచీ ఎక్కువయింది. అతన్ని ఎవరైనా తిక్క శంకరయ్య అని పిలిచినపుడల్లా, "నిజమే, నాకు తిక్కుంది, కానీ దానికి ఒక లెక్కుంది" అని చెప్పుకునేవాడు ఆ సినిమా రాకముందువరకు. ఇప్పుడు ఆ మాటలు పవన్ కళ్యాణ్ సొంతమైపోయేసరికి ఇతనామాటలు చెప్పినపుడు సినిమా డైలాగులు చెబుతున్నాడనుకుని నవ్వుతూ వుంటే ఆ తిక్క కొంచెం ఎక్కువైందన్నది మీక్కావలసిన దానికన్నా ఎక్కువ వివరం.

"మళ్ళీ ఏమయ్యింది?" అంది టీవీలో ఏదో చూస్తూ లోపల పని చేసుకుంటూ వున్న శంకరం భార్య గౌరి.

"ఇంకేముంది? లాగ్గూబ మీద కొట్టేవాడు లేక, నోటికొచ్చినట్టు మాట్లాడుతున్నారు. ప్రక్క వాటా ఇళ్ళని చూడటానికి వచ్చిన ఆ మహాతల్లెవరో, 'ప్రమీలా గారూ వెళ్ళొస్తానండీ' అంది. ప్రమీలా ఏమిటీ ప్రమీలా, రంగీలా లాగ? దీర్ఘం తియ్యకుండా ప్రమీల అనలేదూ?"

"ఎన్నిసార్లు చెబుతారు? ఈ రోజుల్లో అలాగే పిలుస్తున్నారు. మీరూ నేనూ చెబితే మారతారా? ఐనా అందులో అంత కొంపలు మునిగిపోయే తప్పేముంది? మీనాక్షీ పొన్నుదొరై, అమలాపాల్, ఐశ్వర్యారాయ్ అన్నప్పుడు పేరుకి దీర్ఘాలు తీస్తున్నారుగా, ఇప్పుడు ప్రమీలా గారూ, సుశీలా గారూ అంటే ఏమైపోయింది" అంది గౌరి.

అందులో తప్పేముంది అనేసరికి ఇంకా రేగింది శంకరం తిక్క. "మనం చెబితే మారతారా అని అందరూ అనుకోవడం వల్లే అందరూ ఇలా తయారయ్యారు. తప్పులేదు అంటావా?" అన్నాడు ఆవేశపడి పోతూ.

"పొన్నుదొరై, రాయ్ లాంటివి తెలుగు వాళ్ళ పేర్లు కాదు. ఇంటిపేరు చివర పెట్టి పిలుచుకునే వాళ్ళ పద్ధతుల్లో అలా పిలుచుకుచస్తారు. మనలాగా ముందు ఇంటిపేరూ, తరువాత అసలు పేరు వచ్చే పద్ధతుల్లో పొన్నుదొరై మీనాక్షీ, పాల్ అమలా, రాయ్ ఐశ్వర్యా అని పలికి చూడు ఎంత వెఱ్ఱిగా వుందో నీకే తెలుస్తుంది.



మనమేమైనా పెద్ద నగరంలో వున్నామా, తెలుగు మాట్లాడని రాష్ట్రంలో వున్నామా? అన్నింటికన్నా ముఖ్యంగా పిలిచినావిడా, పిలిపించుకున్న ప్రమీలా ఈ కాలంలో పెరిగిన పదహారేళ్ళ పడుచులా? ఇద్దరికీ యాభైకి తక్కువుండవు. ఆ తెగులెందుకూ? ఐతే 'ప్రమీలా, వెళ్ళొస్తాను' అనాలి లేకపోతే 'ప్రమీల గారూ, వెళ్ళొస్తాను' అనైనా అనాలి. అంతే కానీ 'ప్రామీలా గారూ' ఏమిటి? మంచిని నేర్చుకోవడానికి ఎక్కడలేని కష్టాలూ వచ్చేస్తాయి. తప్పులు మాత్రం క్షణాల్లో వంటబట్టేస్తాయి"

శంకరానికి తిక్క ఎక్కువై చిందులేస్తున్నప్పుడు గౌరికి గాంగ్నం స్టైల్ వీడియో చూసినంత ముచ్చటగా వుంటుంది. "పోనీ లెద్దురూ, ఈ కాలంలో అంతే, అందరికీ మీలాగా తెలుగు వస్తుందేమిటి?" అంది చిన్నపిల్లవాడిని సముదాయించినట్టు.

"ఈ కాలంలో అంటారేమిటి మళ్లీ, వాళ్ళేమైనా చిన్నపిల్లలా ఈకాలపు చదువుల వల్ల అలా తయారయ్యారు అనుకోవడానికి? నేను కూడా తెలుగు బాగా తెలిసినవాడినీ కాదు, పండితుడినీ కాదు. వచ్చిందేదో సరిగా మాట్లాడ్డం తెలుసంతే" అన్నాడు. గౌరి ఏదో చెప్పేలోగా మళ్ళీ అందుకున్నాడు.

"వీళ్ళేమిటి కొన్ని పత్రికలవాళ్ళూ ఇలాగే అఘోరిస్తున్నారు. కొడుకు అఖిల్ సినిమా షూటింగేదో విదేశాల్లో జరుగుతోంటే తల్లి దండ్రులు వెళ్ళారన్న విషయం వ్రాస్తూ, 'అక్కినేని నాగార్జున, అమ లాలు' వెళ్ళారు అన్నాడు. అమలాలు ఏమిటి కమలాలు, బత్తాయి ల్లాగ? ఆమె పేరు అమల అంతే కానీ అమలా కాదు."

"మరి?" అంది, శంకరం ఒక సుదీర్ఘోపన్యాసం ఇస్తే గాని ఆగడని తెలుసుకున్న గౌరి.

"తెలుగు అజంత భాష కాబట్టి పేర్ల చివర తలకట్లూ, అచ్చులతో చక్కగా పేర్లున్నప్పుడు వాటిని అలాగే పిలవొచ్చు. ఇప్పుడు సుధ అన్న పేరు వుందనుకో. తెలుగులో సుధ అని వ్రాసుకోగలం. అదే హిందీ హలంత భాష కాబట్టి సుధ్ అంటే బాగుండి చావదు కాబట్టి సుధా అని వ్రాస్తారు. అది వాళ్ళ పద్ధతి. అన్ని భాషల్లోని పదాలనీ, తెలుగులో కుమ్మరించుకుంటున్నాము. ఇప్పుడు ఉచ్చారణని కూడా నాశనం చేసుకోనక్కరలేదు" అన్నాడు.

ఎందుకో శంకరంలోని కోపం మరో భావంలోకి మారింది.

"అదికాదు గౌరీ, మొన్న ఆ రామేశ్వర్ ఇంటికి మధుతో కలిసి వెళ్లానా, అప్పుడు వాళ్ళ బంధువులెవరో వున్నారు. వాళ్ళ పాపకి తొమ్మిదో, పదో వుంటాయి. 'నీ పేరేమిటమ్మా?' అని అడిగితే 'మ్రునా లినీ అంకుల్' అని చెప్పింది. చాలా చక్కనైన పేరు, మృణాళిని అని అనాలి అని నేను చెబుతుంటే, ప్రక్కనున్న వాళ్ళ నాన్న మృణాళిని అనడానికి నోరు తిరక్క అలా అంటుంది, అదే అలవాటై పోయింది అందరికీ అన్నాడు.

నోరు తిరగని పేర్లు పెట్టుకోవడం ఎందుకు, ఆ పేరులోని అందాన్ని నాశనం చెయ్యడం ఎందుకు? ఒక ప్రక్క రామేశ్వర్ పట్టించు కోలేదని నేను నొచ్చుకుంటే ప్రక్కన మధుగాడు 'కందకిలేని దురద కత్తిపీటకెందుకని' 'రామేశ్వర్‌కే పట్టనపుడు నీకెందుకూ' అని మందలిస్తున్నట్టు చెవిలో గొణిగే సరికి వాడి పీక పిసికి చంపేద్దా మనిపించింది" అన్నాడు. మృణాలిని ఉచ్చారణ వలన కలిగిన కోపము నుండి వచ్చిన బాధ, ఆవేదనగా రూపాంతరం చెందిన తరువాత మధు మాటలకు అది మళ్లీ కోపం ద్వారా తిక్కలోకి మారిన భావాలని ప్రతిబింబిస్తూ.

ఇంతలో ద్వార ఘంటిక లేదా గుమ్మపు గంట (శంకరం కోపంలో వున్నాడు కాబట్టి డోర్‌బెల్ అనే ధైర్యం లేక) మ్రోగింది. తలుపు తీస్తే ఎవరో కొరియర్ వాడు.

"ష్రీషైలం షంకర్రావు గారెవరండీ" అన్నాడు. అంతే. అప్పటి దాకా గొంతులో పలికిన బాధా, కోపమూ రౌద్రంలా మారిపోగా మూడోకన్ను తెరిచాడు శంకరం.

"అలాంటి పేరు ఏ వెధవా పెట్టుకోడు. అన్నం తింటున్నావా గడ్డి తింటున్నావా? పేరుని కూడా సరిగ్గా పలకలేని నీకు వుద్యోగం ఇచ్చిన వెధవ ఎవడు? నోటికొచ్చినట్టు వాగడానికి నీకెన్ని గుండెలు?" అంటూ అరుస్తుంటే ఆ కొరియరువాడు భయపడిపోయాడు.

భయంతో కూడిన అయోమయం వల్ల కలిగిన వణుకుతో "నేనేమి చేశానండీ? ష్రీషైలం షంకర్రావు గారికి ఇది డెలివరీ చెయ్య డానికి వచ్చాను. ఆయన వున్నారా అని అడుగుతున్నాను.."అని మాటనింకా పూర్తి చెయ్యలేదు. శంకరం వూగిపోయాడు. పరిస్థితి చేజారుతోందని గమనించిన గౌరి గబాల్న శంకరాన్ని లోపలికి లాగేసి, తను బయటికి వచ్చి, గబగబా సంతకం పెట్టి కొరియరువాడిచ్చిన కవరు లోపలికి తెచ్చి తలుపు మూసేసింది.

టీవీ వాడికి ఇవన్నీ తెలిసి శంకరాన్ని మరింత కిర్రెక్కించడానికి చేశాడా అన్నట్టు, టీవీలో అప్పుడే శివతాండవ స్తోత్రం మొదల య్యింది. గౌరి ఒక్కసారి లంఘించి, రిమోట్ కంట్రోలుని నొక్కి చానల్ మార్చింది. రెండో చానలువాడు ఇంకా చిలిపివాడనుకుం టాను, "మీతో ఆ విశేషాలు పంచుకోవడానికి ఇప్పుడు షైలజా గారు వస్తున్నారు" అని అప్పుడే నిద్రలేచి దుప్పటిని చుట్టుకున్నట్టున్న వింత వస్త్రధారణలో ఒకమ్మాయి కనబడేసరికి గౌరి గతుక్కుమని, మొట్టికాయవేసి టీవీని మూసేసింది.

శంకరాన్ని శాంతపరిచి, అనునయించి, అతని దృష్టిని మర ల్చడం కోసం కొరియరువాడు తెచ్చిన కవరుని అతనికిచ్చి ఏముందో చూడమంది.

శంకరం కవరుని పుచ్చుకుని ఎక్కడి నుండి వచ్చిందో చూశాడు. మిస్టర్ వీ.ఆర్.వెంగళ్ 13-3-41 బవానీ షంకర్‌పేఠ...అంటూ వుంది. తెరిచి చూస్తే, లోపల మరో కవరు వుంది, పైన కన్ను కొడుతున్నట్టున్న బొమ్మ గుర్తుతో. చిరునామా చూసినపుడు మళ్ళీ కలిగిన కోపంతో కూడిన చిరాకూ, కవరు మీది కొంటె గుర్తుని చూసిన ఆశ్చర్యంతో కూడిన కుతూహలమూ కలబోసిన భావాలతో దాన్ని తెరిచి లోపల నుంచి ఒక కాగితం తీసి చదవడం ప్రారం భించాడు.

"బల్లుమని తెల్లవారింది. సంక్రాంతి సమయం కావటంతో కల్లాపి జల్లి ముంగిల్లలో ముగ్గులూ, గొబ్బిల్లూ పెడుతున్నారు. బోగి పల్లు పోయించుకోవడానికి చంటివాల్లు సంతోషపడుతున్నారు. సూర్యుడు దక్షినాయనంలో అడుగుపెట్టబోతున్నాడు. మరికొంత సేపటికి పెలపెలా ఎండకాయడం మొదలు పెట్టింది. అన్ని ఇల్లల్లో సందల్లు మొదలయ్యాయి. కానీ మాలవిక మాత్రం ఇంకా నిద్రపో తోంది. రాత్రుల్లు ఆలస్యంగా పడుకోవడం, ఉదయం పొద్దెక్కాక లేవడం అలవాటు ఆ అమ్మాయికి. తల్లి వచ్చి లేపితే బద్దకంగా వల్లు విరుచుకుంటూ, కల్లు తెరిచింది. కాసేపటికి పల్లు తోముకుంది.

# 'తెనుగులెంక' సూక్తులు-10



'తెనుగు లెంక' 'అభినవ తిక్కన'
**తుమ్మల సీతారామమూర్తి.**

*''వసుధ కెట్టి చెట్ట వచ్చిన పసివాని*
*ముట్టరాదు రెచ్చగొట్ట రాదు*
*విలువ హెచ్చు గాక విలయంబె యగుగాక*
*విత్తనాల సంచి విప్పరాదు"*

**వి**ద్యార్థులు అంటే విజ్ఞానాన్ని సముపార్జించేవారు. విద్య ద్వారా తాము పొందిన విజ్ఞానాన్ని విద్యార్థులు తమ భవిష్యత్తు కోసం, తన దేశపు సమగ్రాభివృద్ధికోసం ఉప యోగించాలి.

విద్యాభ్యాస కాలంలో పిల్లలు తెలిసో, తెలియకో తప్పులు చేస్తారు. ఆ తప్పుల వలన సంస్థకు నష్టం కలుగుతున్నప్పుడు, విద్యార్థిలోకానికి, సంస్థ భవిష్యత్తుకు అపాయం కలుగుతున్నదని సంస్థ అధిపతి భావించినప్పుడు ఆ సంస్థ అధిపతి ఆ విద్యార్థికి నచ్చ చెపుతాడు. వినకపోతే మందలిస్తాడు. తప్పు మరీ పెద్దదయితే చర్య తీసుకుంటాడు. ఇంట్లో ఉన్న సభ్యుడు తప్పు చేస్తే ఇంటి యజమాని ఇంటి గౌరవం కాపాడడానికి ఏంచేస్తాడో, విద్యార్థి తప్పు చేసినప్పుడు సంస్థ అధిపతి అదే చేస్తాడు.

రాగద్వేషాలకు లోనై, కులమతాలకు ప్రాధాన్యం ఇస్తూ ఎవరైనా సంస్థ అధిపతి విద్యార్థులకు తీరని అన్యాయం చేస్తూ ఉంటే ప్రభుత్వం ఊరుకోకూడదు. సరిదిద్దడానికి పూనుకోవాలి. విద్యార్థి తప్పు చేసినప్పుడు సంస్థ అధిపతి అతనిమీద చర్య తీసుకుంటే దానిని సమర్థించాలి తప్ప, అందులో జోక్యం చేసుకోకూడదు.

ప్రభుత్వమే కాదు దేశ కళ్యాణాన్ని ఆశించే పెద్దలు కానీ, దేశం కోసం ప్రాణత్యాగం చేయడానికిసిద్ధమని ప్రకటించే రాజకీయ నాయకులు గానీ, సమాజ హితాన్ని కోరుకునే బుద్ధిజీవులు గానీ ఆ విషయంలో మౌనంగా ఉండాలి. మౌనంగా ఉండలేకపోతే విద్యార్థి చేసిన దోషాన్ని, దానివలన కలిగే దుష్పరిణామాలను విడమర్చి చెప్పి విద్యార్థులకు బుద్ధి చెప్పాలి. అలాంటి తప్పులు మళ్ళీ ఏ విద్యార్థి చేయకుండా కనిపెట్టి ఉండాలి.

'విద్యార్థి' అంటే అవకాశం తప్ప అర్హత కాదు. విద్యార్థి ఏం చేసినా చెల్లుబాటు అవు తుందని, ఏమి అన్నా ఎవరూ మాట్లాడకూడదనే భావం విద్యార్థి లోకంలో ఉంటే అది తప్పు. ముఖ్యంగా వాక్స్వాతంత్ర్యం పేరిట దేశమాతను దూషించడం, జాతీయ చిహ్నాలను అవమానిం చడం సహించరాని విషయం.

అలా ఎవరయినా ప్రవర్తిస్తే వారిని ఎవరూ సమర్థించకూడదు. తగిన హితవు చెప్పాలి. సంస్థ అధిపతి వారిమీద చర్య తీసుకుంటే సమర్థిం చాలి.

"దేశానికి ఎంత అపాయం కలిగినా పిల్ల లను రెచ్చగొట్టకూడదు. వారిని ఉద్యమాల్లో చేర నీయకూడదు. విలువ పెరిగిందని, ప్రళయం వచ్చిందని విత్తనాల సంచిని విప్పి వాడుకుంటే రేపటికి పంట ఉండదు"

అందుచేత తుమ్మల వారన్నట్లు రాజకీయ నాయకులు విద్యార్థి ఉద్యమాల్లో తలదూర్చి దేశభవిష్యత్తుకు గొడ్డలిపెట్టుగా మారడాన్ని విజ్ఞులు సహించకూడదు.


**-డాక్టర్ నాగభైరవ ఆదినారాయణ,**
98497 99711


---

ఆపై నీళ్ల గదికి వెళ్లి చాలాసేపు సబ్బు బిళ్ల అరిగేలా వళ్లు రుద్దుకుని, వేన్నీళ్లతో స్నానం చేసింది.మరికొంత సేపటిలో కొత్తగా పెళ్లైన అక్కా, బావా వస్తారని తొందరగా తయారవ్వమని తల్లి తొందరపెడితే గదిలోకి వెళ్లింది. గంజి పెట్టి ఇస్త్రీ చెయ్యడంతో పెలపెల మంటున్న కాటన్ చీర కట్టుకుంది. నుదుట చక్కగా బొట్టూ, కల్లకు కాటుకా దిద్దుకుంది. రంగురాల్ల నగలు పెట్టుకుంది. జేగురు రంగులోని గల్ల చీరనీ, బంగారు రంగులోని తన వల్లునీ చూసుకుని మురిసిపోయి తన అందాన్ని చూసిన స్నేహితురాల్లు కుల్లుకుంటారు అనుకుంది. షిశిరంలో విరిసిన తాజా పువ్వులా వుంది.

మొదటిసారి అల్లుడు ఇంటికి వస్తున్నాడని చుట్టుపక్కల వూల్ల నించి ఎన్నో తినుబండారాలు తెప్పించారు. వెండి పల్లాల్లో రకరకాల కూరలూ, కారప్పొల్లూ, దప్పలం, తీపి పదార్థాలూ, మగ్గిన పల్లూ వడ్డించారు. ఇంకా మదురమైన కిల్లీ..."

అంతే! ఒక్కసారి వెక్కిళ్లేక వేసి పడిపోయాడు. స్పృహతప్పి పడి వున్న శంకరం చేతిలో పకపకా నవ్వుతున్నట్టుగా కాగితం రెపరెపలాడింది.


surendra_d@hotmail.com

పిట్టచూపు

–చలసాని నరేంద్ర

# అభివృద్ధికి సరికొత్త భాష్యాలు చెబుతున్న అధికార పక్షాలు

**నేడు ప్రజాప్రతినిధులకు అభివృద్ధి అంటే ప్రభుత్వ పక్షాన జరిగే ప్రతి పనిలో ప్రభుత్వం విడుదల చేసే ప్రతి రూపాయి నిధులలో తమ వంతు వాటాలను కమీషన్ల రూపంలో కోరుకోవడంగా ప్రజలు అర్థం చేసుకొంటున్నారు. చిన్న చిన్న రహదారుల నిర్మాణం నుండి, సాగునీటి పథకాలు, వంతెనలు, ఇతర అభివృద్ధి కార్యక్రమాల పనులలో సంబంధిత కాంట్రాక్టు దారులు స్థానిక ప్రజా ప్రతినిధులకు కొంత కమీషన్ ఇవ్వడం నేడు వ్యవస్థీకృతంగా మారింది. అవినీతికి చట్టబద్ధత కల్పించడం అభివృద్ధిగా చెలామణి అవుతున్నది.**

రెండు తెలుగు రాష్ట్రాలలో కొలువుతీరిన అధికార పక్షాలు అభివృద్ధికి సరికొత్త భాష్యం చెబుతున్నాయి. ప్రతిపక్షాల మనుగడ అభివృద్ధికి అడ్డు అనే సంకేతం ఇస్తున్నాయి. అందుచేత ప్రతిపక్ష సభ్యులు అందరినీ అధికారపక్షంలోకి ఫిరాయించమని ఏమాత్రం సిగ్గుపడకుండా బహిరంగంగానే పిలుపు ఇస్తున్నాయి. తమ నియోజకవర్గాలు, రాష్ట్రం అభివృద్ధి చెందాలి అంటే ప్రతిపక్షంలో ఉంటే ప్రయోజనం ఉండదని తెలుసుకొని, ప్రజల అభీష్టం మేరకు అధికార పక్షంలో చేరుతున్నామని ఫిరాయింపు దారులు నిస్సిగ్గుగా తమను తాము సమర్థించుకొంటున్నారు.

రాజకీయ విభేదాలు, అంతరాలు ఎన్నికల వరకు, రాజకీయ అంశాల వరకు పరిమితం కావాలి. విధానపరమైన కొన్ని విభేదాలు, భిన్నాభిప్రాయాలు ఉండవచ్చు. కానీ అభివృద్ధి విషయంలో రాజకీయ అంతరాలు అడ్డు రావడం తగదు. ఈ విషయంలో అన్ని పక్షాలను కలుపుకొని, రాజకీయ ఏకాభిప్రాయం తీసుకురావలసిన బాధ్యత ఎక్కువగా అధికార పక్షంపైనే ఉంటుంది.

తన నియోజకవర్గం అభివృద్ధి కోసమే పార్టీ మారుతున్నామని పేర్కొనడం, తామిస్తున్న తాయిలాలను చూసి కాదని, అభివృద్ధి కోసమే పార్టీ మారుతున్నారని స్వయంగా ముఖ్యమంత్రులే పేర్కొనడం గమనిస్తే వీరంతా ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేస్తున్నట్లు భావించవలసి వుంటుంది. అభివృద్ధి అంటే కేవలం అధికార పక్షాలకు చెందిన వారు ప్రాతినిధ్యం వహించే నియోజక వర్గాలకు పరిమితం అవుతుందా? ప్రతిపక్ష సభ్యుల నియోజక వర్గాల అభివృద్ధి ప్రభుత్వం బాధ్యత కాదా?

అభివృద్ధి కోసం పార్టీ ఫిరాయింపులకు రాజసం కల్పించే ప్రయత్నం చేస్తున్న ముఖ్యమంత్రులు ఒక విధంగా తమ రాజకీయ దివాళాకోరుతనాన్ని వెల్లడి చేస్తున్నట్లు భావించవలసి వుంటుంది. అభివృద్ధి విషయంలో పక్షపాత ధోరణితో వ్యవహరిస్తున్నట్లు వారు అంగీకరించినట్లు అర్థం అవుతుంది.

నేడు ప్రజాప్రతినిధులకు అభివృద్ధి అంటే ప్రభుత్వ పక్షాన జరిగే ప్రతి పనిలో ప్రభుత్వం విడుదల చేసే ప్రతి రూపాయి నిధులలో తమ వంతు వాటాలను కమీషన్ల రూపంలో కోరుకోవడంగా ప్రజలు అర్థం చేసుకొంటున్నారు. చిన్న చిన్న రహదారుల నిర్మాణం నుండి, సాగునీటి పథకాలు, వంతెనలు, ఇతర అభివృద్ధి కార్యక్రమాల పనులలో సంబంధిత కాంట్రాక్టు దారులు స్థానిక ప్రజా ప్రతినిధులకు కొంత కమీషన్ ఇవ్వడం నేడు వ్యవస్థీకృతంగా మారింది. అవినీతికి చట్టబద్ధత కల్పించడం అభివృద్ధిగా చెలామణి అవుతున్నది.

ఎన్నికలలో కోట్ల రూపాయలు ఖర్చు పెట్టి గెలిచిన తరువాత ప్రతిపక్షంలో ఉంటే ఆదాయం ఉండటం లేదని, తిరిగి ఎన్నికలలో పోటీ చేయాలి అంటే మరిన్ని కోట్లు ఖర్చు పెట్టాలి కదా! అందుకనే పార్టీ మారవలసి వస్తున్నదని ఫిరాయింపులకు పాల్పడుతున్న వారు వ్యక్తిగత సంభాషణలలో స్పష్టంగా చెబుతున్నారు. దానితో ఈ ఫిరాయింపుల ప్రహసనం అంతా ఒక భారీ ఆర్థిక కుంభకోణం అని భావించుకోవలసి వుంటుంది.

ప్రతిపక్షం కుంటిగా, గుడ్డిగా ఉన్నా అసలు మనుగడలో ఉంటే తమ అవినీతి, అక్రమాలను, కుటుంబ పాలనలను ప్రశ్నించి, ప్రజల ముందు దోషులుగా నిలబెట్టే అవకాశం వున్నదనే భయంతోనే అడ్డదిడ్డంగా ఈ ఫిరాయింపులను ప్రోత్సహిస్తున్నారు. తద్వారా అసలు ప్రతిపక్షం లేకుండా చేయడం కోసం అందుకు ముందుగా ప్రలోభాలు చూపెడుతున్నారు. వాటికి లొంగని పక్షంలో వారిపై పాత పోలీస్ కేసులు తిరిగి తోడతామని, కొత్తగా మరిన్ని కేసులు బనాయిస్తామని బెదిరిస్తున్నారు.

లేదా వారు చేసే వ్యాపారాలు, కాంట్రాక్టు పనులలో ప్రభుత్వం నుండి రావలసిన బిల్లులను చెల్లించకుండా ఆపివేస్తున్నారు. వారి ఆర్థిక మూలాలను దెబ్బతీసే ప్రయత్నం చేస్తున్నారు. దానితో పార్టీ ఫిరాయింపుకు పాల్పడని పక్షంలో తమకు రాజకీయ మనుగడ ఉండబోదని భావించే పరిస్థితులను కల్పిస్తున్నారు.

ఈ పార్టీ మారిన ఒక ఎమ్మెల్యేను రెండేళ్ళ తరువాత ఇప్పుడే మీ నియోజకవర్గ ప్రజలు అభివృద్ధికోసం పార్టీ మారమంటున్నారా అంటే అసహనం ప్రదర్శించారు. "వారిష్టం వచ్చినప్పుడు పార్టీ మారమని అడుగుతారు. మీకెందుకు" అంటూ చిరాకు ప్రదర్శించారు. ఎవ్వరు పార్టీ మారినా నియోజకవర్గ ప్రజల అభిమతం మేరకే అంటూ తమ తప్పిదం ఏమీ లేదని సమర్థించుకొనే ప్రయత్నం చేస్తున్నారు.

**రెండేళ్ళ క్రితమే అదే నియోజకవర్గ ప్రజలు అధికార పక్ష అభ్యర్థిని ఓడించి, తమను గెలిపించింది పార్టీ మారడం కోసమా?**

**అంటే వారి వద్ద సమాధానం లేదు. తమ అనైతిక చర్యను సమర్థించు కోవడానికి ఎన్నో కారణాలు చెబుతూ ఉంటారు. అయితే ప్రజలు వాస్తవాలు గ్రహిస్తూనే ఉంటారని మరచి పోతున్నారు.**

నేడు రెండు తెలుగు రాష్ట్రాలలో ఉన్న ప్రభుత్వాలకు అసెంబ్లీలలో పూర్తి ఆధిక్యత ఉన్నది. వారి ప్రభుత్వాలను అస్థిరపాలు చేసే స్థితిలో ప్రతిపక్షాలు లేవు. అయినా ముఖ్యమంత్రులు అభద్రతా భావంతో పార్టీ ఫిరాయింపులను పెద్ద ఎత్తున ప్రోత్సహించడం గమనిస్తే వారి పాలన పట్ల వారికే నమ్మకం లేదని స్పష్టం అవుతుంది.

పార్టీ మారడం వారి వ్యక్తిగత ఇష్టం. అయితే పార్టీ మారే ముందు ఆ పార్టీ ద్వారా తమకు లభించిన పదవులకు సహితం రాజీనామా చేసి, తిరిగి ప్రజల తీర్పును కోరడం ప్రజాస్వామ్యంలో కనీసం ధర్మం. గతంలో చాలామంది ఆ విధంగా చేశారు. అయితే నేడు అందుకు ఎవ్వరూ సాహసించడం లేదు. **పార్టీ మారి ప్రజల ముందుకు వెళ్ళడానికి వారు భయపడడమే అందుకు కారణం.**

తెలుగుదేశం పార్టీ ఆవిర్భావం లోనే ఈ విషయమై చర్చ జరిగిందని ఈ సందర్భంగా గమనించాలి. అప్పుడు కాంగ్రెస్ నుండి చాలామంది తెలుగుదేశం పార్టీలో చేరడానికి ఎమ్మెల్యే సుముఖత చూపారు. నాదెండ్ల భాస్కరరావుతోపాటు మరో ముగ్గురు ఎమ్మెల్యేలు కూడా చేరారు. అయితే ఆ విధంగా చేరేవారు తమ శాసనసభ్యత్వాలకు రాజీనామా చేసి రావాలని పార్టీ వ్యవస్థాపకుడు ఎన్టీరామారావు పట్టుపట్టారు. దానితో భాస్కరరావు ఒక్కరే పదవికి రాజీనామా చేశారు. మిగిలిన ముగ్గురినీ పార్టీలోకి చేర్చు కోలేదు.

**పార్టీ పెట్టిన తరువాత తిరుపతిలో జరిగిన పార్టీ మొదటి మహానాడులో ఈ విషయమై ఒక తీర్మానం కూడా చేశారు. ఆ తీర్మానం నేటికి కూడా అమలులో వుంది. పార్టీ మారేవారు ముందుగా ఆ పార్టీ ద్వారా వచ్చిన పదవులకు సహితం రాజీనామా చేసి రావాలని ఈ తీర్మానంలో స్పష్టం చేశారు. అయితే ఈ తీర్మానం విషయం ఇప్పుడు ఆ పార్టీ అధినేత నారా చంద్రబాబునాయుడుకు గుర్తు ఉన్నట్లు లేదు. గుర్తు ఉన్నా దానిని పట్టించుకొనే స్థితిలో ఆయన లేరు.**

ఈ పార్టీ ఫిరాయింపులతో తమ పార్టీ అతలాకుతలం కావడాన్ని గమనించిన వైయస్సార్ కాంగ్రెస్ పార్టీ అధినేత వై.యస్.జగన్‌మోహన్‌రెడ్డి తమ పార్టీ వారందరినీ కలుపుకొని ఢిల్లీ వెళ్ళి ఎన్నికల కమీషన్‌ను, కేంద్ర మంత్రులను, పలువురు పార్టీ నాయకులను కలసి ఫిరాయింపులపై గగ్గోలు పెట్టారు. అయితే ఈ ఒరవడికి రాజాసనం కల్పించింది ముందుగా ఆయన తండ్రి వైయస్.రాజశేఖరరెడ్డి అని మరువలేము.

పార్టీ ఫిరాయింపులకు సంబంధించి వచ్చిన ఫిర్యాదులపై సభాసతులు సహితం సత్వరం తగు నిర్ణయం తీసుకోకుండా అధికార పక్ష ప్రయోజనాలు కాపాడటానికే పరిమితం కావడం విచారకరం.

వారేమి కారణాలు చెప్పినా వారు రాజ్యాంగాన్ని, ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేస్తున్నారని మాత్రం స్పష్టం అవుతున్నది. పార్టీ ఫిరాయింపుల విష యంలో కొన్ని పార్టీలు ఎన్ని నీతి వాక్యాలు పలుకుతున్నా తాము అధి కారంలో వున్నసమయంలో అందుకు భిన్నంగా వ్యవహరించలేదని గ్రహించాలి. ఉత్తరాఖండ్, అరుణాచల్‌ప్రదేశ్‌లలో ఫిరాయింపుదారులతో ప్రభుత్వాలనే కూల్చివేసిన ఘనతను బిజెపి దక్కించుకోవడం చూస్తున్నాము.

రచయిత ఫోను : 98495 69050

కవిత

# అక్షర గీతం

–డా॥ఎన్.గోపి

వర్షంలో తీగమీద
నడిచే నీటిముత్యాల్లా
రాగానికి గుదిగుచ్చిన
రస ప్రపూర్ణ భావగీతాల్లా
నేలపై మొలిచిన గడ్డిపోచల
వెలుతురు కొసల్లా
నా జీవితంలో ఎటు చూసినా అక్షరాలే.
    పొద్దున అక్షరాల శయ్య మీంచి లేస్తాను
    రాత్రంతా చుక్కలతో జరిపిన మంతనాలను
    అక్షరాలుగా బేరీజు వేస్తాను
    ముక్కలుగా కోసి పెట్టుకున్న
    చందమామ తొనలను
    అక్షరాలుగా ఆస్వాదిస్తాను
    అక్షరం కానిదేదీ నాకు రుచించదు.
సముద్ర తీరాన సయ్యాటలాడే
నా చూపులు అక్షరాలుగా మారి
నాలోకే తిరిగొస్తాయి.
చెలరేగే అలల లోపల
కనపడని దారాలుంటాయి.
అవి అక్షర హారాలుగా మారి
హృదయాలను అలంకరిస్తాయి.
    పగిలిన మొగ్గల్లోంచి
    పరిమళాలను వెలికి తీస్తాను
    చుట్టూ మూగిన ముఖాలపై శిల్పినై
    చిరునవ్వులు చెక్కుతాను.
అనుకోని అతిథిలా జ్వరం
నా శరీరంలో దూరినప్పుడు
నేను అక్షరాలనే కలవరిస్తాను.
    సూర్యుడు
    నీరసంగా ఉదయిస్తే సహించను
    అక్షరాల్లోని సంగీతాన్ని పిండి
    అతన్ని చురుకెక్కిస్తాను.
నేను అనవరతం
అక్షరాలపైనే నడుస్తుంటాను
భూగర్భధ్వనులను ఏరుకుంటూ.
అక్షరాల్లో తురిమి
కొత్త మాలికలల్లు తుంటాను
అక్షరాలకు చీకటి రంగులద్దుతూ.
మనిషి వర్ణాన్ని హైలైట్ చేస్తాను
అక్షరాలను కావలించుకొని
నిద్రలోకి జారుతూ
మరో లోకంలోకి మేల్కొంటాను.

❉



రచయిత ఫోను: 98

-గోవిందరాజు చక్రధర్

# పత్రికలను దారికి తెచ్చిన దంపతులు

**వెంకటేశ్వరరావు అనే పేరును తెలుగు రానివారు ఆంగ్లంలో చదివి వెంకతేశ్వరరావు అంటే మీకెలా అనిపిస్తుంది? తేలప్రోలును టేలప్రోలు అని ఉచ్చరిస్తే ఏంచేస్తారు? ముందుగా ఎదుటివారి తెలియనితనానికి ఒకింత నొచ్చుకుంటారు. ఆపైన ఆ పలికిన తీరును సరిచేయప్రయత్నిస్తారు.**

ఇదే పొరపాటును తెలుగు దినపత్రికలు, టీవీ చానళ్ళవారు చేస్తేనో? అది పెద్ద అపరాధమే అవుతుంది. పత్రికలు రాసేది, టీవీల వారు చదివేది సరైన రూపమేనని ప్రజలు నమ్ముతారు. జనమాధ్యమాల ప్రభావం ప్రజలపై అపారం కనుక- వ్యక్తులు, ప్రాంతాల పేర్లను తామూ అలాగే పలకటం అలవాటు చేసుకుంటారు. పత్రికలు, టీవీల పుణ్యమా అని ఇప్పటికీ మనదేశ ప్రధానిని తెలుగువారు నరేంద్ర మోడీ గానే వ్యవహరిస్తున్నారు. ఢిల్లీకి వెళ్ళి అలా పలికితే అక్కడివారు అభ్యంతరం వ్యక్తం చేయవచ్చు. దేశ ప్రధాని పేరునే సరిగా పలకడం లేదేమిటి? ఇంత అజ్ఞానమా? అని వారు విస్తుపోవచ్చు. మన ప్రధానిని ఉత్తర భారతీయులు 'మోదీ' అని రాస్తారు, పలుకుతారు.

ఆంగ్లం నుంచి తర్జుమా చేసే క్రమంలో భాషాపరంగా జనమాధ్యమాలలో దొర్లుతున్న పొరపాట్లను చక్కదిద్దటానికి ఆ దంపతులు ఏకంగా పదేళ్ళపాటు పరిశ్రమించాల్సి వచ్చింది. ఇందుకోసం ఎన్నో వ్యయప్రయాసలకు లోనయ్యారు. తెలుగుభాష, సాహిత్యాలపట్ల వున్న అనురక్తే చోదకశక్తిగా పట్టువదలకుండా ప్రయత్నించి పత్రికలను, చానళ్ళను భాషాపరంగా దారికి తేగలిగారు. 2014 నవంబర్ 3వ తేదీన ఆ దంపతులను సంభ్రమాశ్చర్యాలకు లోను చేస్తూ 'ఈనాడు'లో వ్యక్తుల పేర్లు, నగరాల పేర్ల ఉచ్చారణ మారింది. పదేళ్ళ కృషి ఫలించిన రోజది. మోడి కాస్తా మోది అయ్యారు, ఢిల్లీ దిల్లీ అయింది. లక్నో లఖ్‌నవ్‌గా మురిసింది. మీరట్ మేరఠ్‌గా మెరిసింది. జార్ఖండ్ ఝూర్ఖండ్‌గా రీవిని ఒలకపోసింది. సినిమా పేజీల్లో నిత్యమీనన్ పేరు నిత్యామేనన్‌గా కొత్త హొయలు పోయింది. క్రీడా పుటల్లో సచిన్ టెండూల్కర్ కాస్తా సచిన్ తెందుల్కర్ అయ్యాడు!

'ఈనాడు'తో మొదలైన ఈ మార్పు ఇతర పత్రికలకూ, చానళ్లకూ పాకింది. వారు కూడా సరైన రూపంలోనే రాయటం మొదలుపెట్టారు. అయితే ఈ దంపతులు ప్రతిపాదించిన పదాలన్నీ మాధ్యమాలలో చోటు దక్కించుకోలేదు. పరిమితి స్థాయిలోనే వాటిని సవరించి వాడుతున్నారు.

**నిజానికి పత్రికలు, టీవీచానళ్ళ వారు మనసుపెడితే, తమకున్న విస్తృత యంత్రాంగం సహాయంతో ఏ ప్రాంతంలో ఏ పేర్లను ఎలా పలుకుతారో క్షణాల్లో సేకరించి ఆచరణలో పెట్టవచ్చు. విభేదాలున్నచోట భాషాశాస్త్రవేత్తల అభిప్రాయాలనూ ఆహ్వానించవచ్చు. భాషాపరంగా అనుసరించాల్సిన విధివిధానాలపై శైలీ పత్రాలనూ రూపొందించుకోవచ్చు. ఆ దిశగా స్వచ్ఛంద కృషి చేయాల్సింది పోయి, మీనమేషాలు లెక్కించటమే విచారకరం.**



పత్రికలు, చానళ్ళలో భాషా పరివర్తనకు కృషి చేసిన ఆ దంపతులు చేయి తిరిగిన సాహితీవేత్తలు కారు. భాషా శాస్త్రవేత్తలు అంతకంటే కారు. ఇంతకీ ఎవరు వారు? భాషకోసం ఎందుకని అంతగా ఆరాటపడుతున్నారు?

❋ ❋ ❋

పశ్చిమగోదావరి జిల్లా మార్టేరుకు చెందిన సత్తి సునీల్‌రెడ్డి 1975లో కేంద్ర గూఢచారి సంస్థలో చేరి 2012లో జాయింట్ డిప్యూటీ డైరెక్టర్ హోదాలో పదవీ విరమణ చేశారు. తండ్రి లఖ్‌నవ్‌లో వైమానికదళంలో పనిచేసేవారు. తండ్రి దగ్గర వుండి ఎంకాం చదువుకున్నారు.

ఉద్యోగ బాధ్యతల రీత్యా సునీల్‌రెడ్డి నేపాల్, భూటాన్, మయన్మార్ సరిహద్దులతో సహా దేశమంతటా వివిధ రాష్ట్రాలలోని నగరాల్లో విధులు నిర్వర్తించారు. దిల్లీ, ఆగ్రా, గాంగ్‌టక్, ఇంఫాల్ ఇలా ఒకటేమిటి ఆయన పని చేయని ప్రాంతమంటూ లేదు. ప్రముఖుల భద్రతా విభాగంలో రెండేళ్ళు పని చేసినపుడు కె.ఆర్.నారాయణన్ తో అమెరికా, జర్మనీ, బ్రెజిల్, ఫ్రాన్స్ దేశాలనూ చుట్టివచ్చారు. దేశంలోని వివిధ ప్రాంతాలలో పని చేయడం, విదేశాల్లో పర్యటించడంతో స్థానికంగా ప్రజల సంస్కృతీ సంప్రదాయాలు, ఉచ్చారణ రీతులు ఆయన కళ్ళకు కట్టాయి. భాషకు సంబంధించిన ఆలోచనలకు ఇలా బీజం పడింది.

**అర్ధాంగి చేదోడు :** సత్తి సునీల్‌రెడ్డి అర్ధాంగి శ్రీమతి లలిత. బిఎస్సీ బిఎడ్ చేసిన ఆమె దిల్లీ కాన్వెంట్‌లో టీచరుగా ఉద్యోగం చేసే సమయంలో ఆంధ్రప్రదేశ్ భవన్‌లో జరిగే సాంస్కృతిక కార్యక్రమాలకు హాజరవుతూ ఉండేవారు. అక్కడ ఆకాశవాణికి చెందిన ఏడిద గోపాలరావు పరిచయం అయ్యారు. ఆయన ప్రోత్సాహంతో దిల్లీ ఆకాశవాణి తెలుగు వార్తా విభాగంలో అనువాదకురాలు/వార్తా

ప్రవచకురాలిగా పరీక్ష రాసి ఎంపికయ్యారు. ఆమె దిల్లీ ఆకాశవాణిలో తొమ్మిదేళ్లపాటు తెలుగు వార్తలు చదివారు. వృత్తిధర్మ నిర్వహణలో భాగంగా విధిగా వార్తాపత్రికలను క్షుణ్ణంగా చదివేవారు.

ఆకాశవాణిలో ఇతర ప్రాంతీయ భాషా విభాగాలు కూడా ఉండేవి. ఆయా భాషలకు సంబంధించి ఏవైనా ఉచ్చారణ సంబంధ సందేహాలు తలెత్తితే ఆ విభాగాల వారిని సంప్రదించి నివృత్తి చేసు కునేవారు. అలాగే ఆకాశవాణిలోనే ప్రత్యేకంగా ఉచ్చారణ విభాగం ఉండేది. విదేశీ నేతల పేర్లు, ప్రాంతాల పేర్లను ఎలా పలకాలో ఆయా రాయబార కార్యాలయాలకు ఫోను చేసి తెలుసుకుని 16 భారతీయ భాషా విభాగాల వారికి తెలియజేసేవారు.

భాషావిషయకంగా ఆకాశవాణిలో జరుగుతున్న కృషి, తీసు కుంటున్న శ్రద్ధాసక్తులు ఆ దంపతులపై ప్రభావం చూపింది. పేర్లు, ప్రాంతాల ఉచ్చారణపై ఇంట్లో ఆ దంపతులు చర్చించుకునేవారు. రేడియోలో ఫలానా వ్యక్తిపేరు ఇలా చెబుతుంటే పత్రికల వారేమిటి ఇలా రాస్తున్నారు? అనే మథనం వారిలో మొదలైంది. ఈ లోటు పాట్లను సవరించేందుకు తమ వంతుగా ఎంతోకొంత కృషి చేయా లనుకున్నారు. తప్పుగా రాస్తున్న పదాలను సేకరించటం మొదలు పెట్టి 'సరియైన ఉచ్చారణ' అనే పేరుతో చిన్న పుస్తకాన్ని వెలువరిం చారు. అంతటితో ఆగకుండా 2004 -05 నుంచి 'మాధ్యమాలలో మెరుపులు-మరకలు' శీర్షికతో నెల నెలా సమాచారలేఖను తయారు చేయటం ప్రారంభించారు. ఆ నెలలో పత్రికలు, చానళ్లలో వచ్చిన దోషాలను గుర్తించి వాటిని పొందుపరుస్తూ సరైన ఉచ్చారణ ఏమిటో వివరిస్తున్నారు. దాన్ని కంపోజ్ చేయించి యాభై నకళ్ళను తీయించి తెలుగు దినపత్రికలు, టీవీ చానళ్ళు, జర్నలిజం విభాగాలకు, భాషా ప్రేమికులకు పంపుతూ వస్తున్నారు. ఈ పనికోసం ఎంతో సమ యాన్ని, వ్యయాన్ని ఆనందంగా భరిస్తున్నారు. ప్రస్తుతం రోజువారి సమీక్షలను ఇంటర్‌నెట్ ద్వారా ఏ రోజుకారోజు పంపుతున్నారు. ఏదైనా పదం విషయంలో అనుమానం ఏర్పడితే నివృత్తికోసం హిందీ వార్తాపత్రికలను చూసేవారు. ఎవరైనా ఉత్తరాదివారు, విదేశీయులు తారసపడితే ఆసక్తిగా వారితో మాట కలిపి వారి పేరును ఎలా పలకాలో ఓపిగ్గా అడిగి తెలుసుకుని రాసిపెట్టుకునే వారు. కేవలం పదాలకే పరిమితం కాకుండా పత్రికా రచయితలకు లోతైన అవ గాహన కల్పించడం కోసం కూడా వారు ఆరాటపడుతున్నారు. ఉదా హరణకు సాయుధ దళాల్లో ఎయిర్ కమోడోర్, వింగ్ కమాండర్ హోదాలుంటాయి. కమోడోర్ పదాన్ని తప్పుగా రాస్తున్నప్పుడు ఆ విషయాన్ని పట్టి చూపుతూనే త్రివిధ దళాల్లో వివిధ హోదాలను పట్టిక రూపంలో తెలియజేసే బాధ్యతనూ వీరు తీసుకున్నారు.

"ఉత్తరభారతంలో పని చేసేటపుడు ఏ దుకాణానికైనా వెళ్ళి మాట్లాడితే ఆ దుకాణాదారు ఉచ్చారణ తేడాను పసిగట్టి 'మద్రాసీ హై?' అని అడిగేవారు. ఇది తలవంపులుగా అన్పించేది" అంటారు సునీల్‌రెడ్డి జ్ఞాపకాలను నెమరువేసుకుంటూ.

"తెలుగు యువతీ యువకులు అనేకమంది యుపిఎస్‌సి వంటి సంస్థల ఉద్యోగ నియామక పరీక్షలు రాసి దిల్లీలో మౌఖిక ఇంటర్వ్యూ లకు హాజరవుతున్నారు. తెలుగు మాధ్యమాల ప్రభావంతో ఆయా వ్యక్తులు, ప్రదేశాల పేర్లను మనవారు తప్పుగా పలుకుతున్నారు. దీంతో మనవారిపై సదభిప్రాయం కలగడం లేదు. ఇంటర్వ్యూలో మార్కులపై కూడా ప్రతికూల ప్రభావం పడుతోంది" అంటూ సునీల్ రెడ్డి ఆవేదన వ్యక్తం చేశారు.

సునీల్‌రెడ్డి దంపతులు విశాఖపట్నంలో స్థిరపడ్డారు. ఈ దంప తుల కృషిని గుర్తించిన ఒకటి రెండు చిన్నపత్రికల వారు అభినందన పూర్వక లేఖలు రాశారు. పెద్ద పత్రికలు మాత్రం పెదవి విప్పలేదు. అయినా నిరుత్సాహ పడకుండా, ఏమీ ఆశించకుండా తెలుగుభాషపై ప్రేమతో ఈ దంపతులు తమ కృషిని మాత్రం నిరంతరం సాగిస్తూనే వస్తున్నారు.

సరియైన ఉచ్చారణపై సమగ్రంగా పుస్తకాన్ని వెలువరించే కృషిలో లలితాసునీల్ దంపతులు నిమగ్నమై ఉన్నారు.

తప్పులను ఎంచి చూపటం మెరుగైన పత్రికా రచన కోసమేనని సవినయంగా మనవి చేసుకునే వీరి కృషిని భాషా ప్రేమికులు, మాధ్య మాలు సరైన గుర్తింపు నిచ్చి ప్రోత్సహించవలసిన అవసరం లేదంటారా?

వారి చిరునామా : సత్తి సునీల్‌రెడ్డి, 39-8-59/6, క్షేత్రం -8, పాదచారుల తోట పక్కన, మురళీనగర్, విశాఖపట్నం-530 007, చరవాణి : 94926 41252

---

***సునీల్‌రెడ్డి దంపతులు చిరకాలంగా నడుస్తున్నచరిత్ర/అమ్మ నుడి పత్రికలకు చదువరులు. వారి కృషిలో వున్న చిత్తశుద్ధిని మనం మెచ్చుకోవాలి. ఎటువంటి స్వార్థం లేకుండా వారు చేసేకృషి తీరు అందరికీ ఆదర్శంగా నిలుస్తుంది. అయితే వారు సూచిస్తున్న మార్పులు గాని ఈనాడుతో సహా దినపత్రికల్లో చేస్తున్న మార్పుల విషయంలో గాని కొంత చర్చ జరుగవలసి వుంది. మన నుడి తీరులో ఇమడని మాటల్ని కూడా అవతలినుడి తీరులో వున్నవి వున్నట్లుగా మనం అనుసరించాలా? ఇది సమంజసమేనా? తెలుగునేలపై ప్రాంతాలవారీగా ఆధిపత్యభావనపై చర్చ జరుగు తుండగా, సునీల్‌రెడ్డి దంపతుల ప్రతిపాదనలకు గీటురాయిని ఎలా పెట్టుకోవాలి? తెలుగువాడి నోటికిపలకని మాటల్ని మచ్చుకు మహా.....తీసుకోవాలా వద్దా? సామాన్య తెలుగువాడిని, అతడి పలుకు తీరును పక్కన బెట్టి పండితుల భాషలోనే తీసుకోవాలా? ఈ చర్చ సాగాలి. స్పందనని కోరుతున్నాం.*** -సంపాదకుడు.



## సమీక్షలు

# ప్రపంచ విజేతలు: వ్యక్తిత్వ నిర్మాణం




'ప్రపంచ విజేతలు-వ్యక్తిత్వ నిర్మాణం' శీర్షికన "డా॥బి.ఆర్. అంబేద్కర్, బెర్నార్డ్‌షా రసెల్, విలియం వర్డ్స్ వర్త్" అనే పేరుతో ఒక పుస్తకాన్ని కొత్తగా వెలువరించారు డా॥కత్తి పద్మారావు. ఒక రచయితగా కత్తి పద్మారావు గారికిది 62వ పుస్తకం. ఆయన రచనలో విషయ విశ్లేషణ, ఆయా అంశాలపై ఉద్యమస్ఫూర్తితో కూడిన వ్యాఖ్యానం ప్రధానంగా వుంటుంది. ఒక సంస్కర్తగా తన కుటుంబం నుంచి ఆచరించిన తరువాతే బోధించినవాడు ఆయన. కొన్ని వేల పుస్తకాలతో ఆయనకు సొంత గ్రంథాలయం వుంది. నిరంతర అధ్యయనశీలి. ఇప్పుడు కొత్తగా వచ్చిన ఈ పుస్తకంలో తనే వ్రాసుకున్న ముందుమాట (నామాట) లో ఆయన ఇలా అంటారు:

"వ్యక్తిత్వం అంటే జీవనశైలి. మనం జీవించే క్రమంలో ఎన్నో ప్రభావాలు మనమీద పడతాయి. ముఖ్యంగా తల్లి, తండ్రి, గురువు, అన్న, అక్క, స్నేహితులు వీళ్ళందరూ మనల్ని ప్రభావితం చేస్తారు. వీరితోపాటు ప్రపంచంలో వస్తున్న అనేక సిద్ధాంతాలు, ఆలోచనలు, జీవన విధానాలు, యుద్ధాలు, ఘర్షణలు, తుఫాన్‌లు వంటివి కూడా మన మీద ఎంతో కొంత ప్రభావం చూపిస్తాయి. కొన్నిసార్లు జీవితం ఉత్తేజకరంగా నడుస్తుంది. కొన్నిసార్లు నిరాశావహం అవుతుంది. కొన్నిసార్లు నిస్తేజం కూడా అవుతుంది. ఆయా సందర్భాల్లో మనల్ని తట్టిలేపేవాళ్ళు కావాలి. మన గుండె చప్పుళ్ళను, మనమేధో వికాసాన్ని ఉత్తేజపరిచేవాళ్ళు కావాలి. అందరికంటే మనుషులే గొప్పవాళ్ళు అన్ని సిద్ధాంతాల కంటే మానవతా వాదమే గొప్పది. మనిషిని మనిషిగా ప్రేమించటమే తత్వశాస్త్రసారం. అందుకే తాత్వికులను అధ్యయనం చేసినప్పుడు మనలో పునరుత్తేజం వస్తుంది".

తాత్వికులను అధ్యయనం చేయటం ద్వారా వ్యక్తిత్వాన్ని నిర్మాణం చేసుకోవచ్చు అని అంటూ మచ్చుకు ఇప్పుడు డా॥అంబేద్కర్‌ను బెర్నార్డ్ రసెల్‌ను, విలియం వర్డ్‌వర్త్‌ను తీసుకొని వారి గురించి సున్నితంగా, సరళంగా, సూటిగా పాఠకుడి మనసులోకి వెళ్ళేట్లు విశ్లేషించారు రచయిత.

అంబేద్కర్ గురించి దాదాపు 165 పుటల్లో వివరించి ఆ తరువాత అంబేద్కర్ లక్షణాలను మూల్యాంకనం చేశారు. త్యాగం, ప్రేమ, కరుణ, అంబేద్కర్‌లో అద్వితీయంగా కనిపిస్తాయి. భారతదేశంలో ఆనాటికి ఈనాటికి ఎక్కువ పుస్తకాలు చదివింది అంబేద్కరే. నిరంతర అధ్యయన శీలమే నాయకత్వ లక్షణం. అంబేద్కర్ చాలా శుభ్రంగా ఉంటారు. మంచిబట్టలు ధరిస్తారు. నీతి నిజాయితీ కలిగి అన్నమాట మీద నిలబడే వారుగా పేరు పొందారు. కుల నిర్మూలన సిద్ధాంతాన్ని నిర్మించి సమాజ మార్పుకు పునాది వేశారు. పోరాటానికి పిలుపు నిచ్చిన తరువాత ఎంత కష్టం ఎదురైనా వెనక్కి తగ్గరు, దురలవాట్లు లేవు, వుండటం, ప్రబోధకుడు, పరిశోధకుడు, కరుణశీలి, బౌద్ధధర్మ దీక్షా పరుడు -ఇవీ పద్మారావు గారు అంబేద్కర్‌ను మూల్యాంకనం చేసి చెప్పిన విశేషాలు.

50 పుటల్లో రసెల్ గురించి లోతుగా విశ్లేషించి చివరలో మూల్యాంకనం చేశారు. ఆధిపత్యాన్ని ఎదిరించి సమానత్వానికి, సౌభ్రాతృత్వానికి పతాకాన్ని ఎత్తినవాడు. ఒక తాత్వికునికి వుండవలసిన నీతి, నిజాయితీ, వ్యక్తిత్వం, జీవన ఘర్షణ, ప్రశ్నించే తత్వం, నిరంతర రచన ఊపిరులుగా బతికినవాడు అని రసెల్ గురించి రచయిత విశ్లేషణ.

శాంతిని కోరుకోవడం ద్వారా తత్వవేత్తగా, హేతు వాదిగా గణుతికెక్కడం, కరుణ, ప్రేమ, ప్రజ్ఞలతో గొప్ప జ్ఞానిగా ప్రపంచమేధావిగా రసెల్ ఎదిగాడని కత్తి పద్మారావు వివరించారు.

ఇక మూడవ భాగం వర్డ్ వర్త్-50 పుటలు. ప్రపంచ విజేతలలో విలియంవర్డ్స్ వర్త్ చక్కని రచయిత అంటారు. వర్డ్స్ వర్త్ గొప్ప ప్రకృతి పరిశీలకుడు. ప్రకృతిని కవిత్వంగా కూర్చడంలో అద్వితీయుడు. జీవితంలో ఒడిదుడుకులకు ఎదురీదాడు. అధ్యయనశీలి, భాషా సంపన్నుడు, అభివ్యక్తిలో దిట్ట. నిరంతర అక్షరశిల్పి.

ఇంకా ఇటువంటి గొప్ప వ్యక్తుల జీవితాలను వ్యక్తిత్వ నిర్మాణ కోణం నుండి విశ్లేషిస్తూ మరికొన్ని రచనలను కత్తి పద్మారావు గారి నుండి మనం ఆశించవచ్చు. కొన్నిచోట్ల ముద్రణలో తప్పులు దొర్లాయి. 134వ పేజీలో కులాన్ని నిర్మూలించాలి అనే మాట కులాన్ని నిర్మించాలి అని ముద్రణలో వచ్చింది. ఇలాంటి వాటిని సరిదిద్దుకోవాలి.

ఈ పుస్తకంలో తాపీ ధర్మారావు గారి గురించి వ్రాస్తూ 'ప్రపంచ విజేతల స్థాయిలో జీవించిన వారిలో తెలుగు కవులు అనేకమంది వున్నారు, అటువంటి వారిలో చాలామందికి రావల్సినంత ప్రచారం రాలేదని ఈ రచయిత అంటారు. ఇది నూటికి నూరుపాళ్లూ నిజం. ఈ అంశంపై పరిశోధనాత్మక రచనలు ఇంకా రావాలి.

మనం జీవిత గాథలను చదివేటప్పుడు 'వారిలోని నెగెటివ్ అంశాలను హైలైట్ చేయకూడదు. వాటిని మనం జీవితంలోకి తీసుకోకూడదు' అని రచయిత అంటారు. వారు విజేతలుగా నిలిచిన అంశాలనే మనం మనకు అన్వయించుకుని ఆ లక్షణాలను మనలో పెంపుచేసుకోవాలని రచయిత చెప్పటం సమంజసంగా ఉంది.

తనదైన శైలిలో తన ఉద్యమ అనుచరులకు ఆమోదయోగ్యంగా ఉండే రచనలను పద్మారావు నిరంతరం చేస్తూ ఉంటారు. తన రచనలను తానే ప్రచురించుకొని వేలాది ప్రతులను అమ్మగలగడం కత్తి పద్మారావు గారికే చెల్లు. ఈ విషయంలో ఆయనకు సాటి రాగలవారు తెలుగునేలపై అరుదు. వ్యక్తిత్వ నిర్మాణం కోసం పుస్తకాలు చదివేవారు ఈ పుస్తకాన్ని తప్పక చదవాలి.

ఏప్రిల్ 2016లో ప్రచురించిన ఈ పుస్తకం వెల రు.200/-, ప్రతులకు : శ్రీమతి కత్తి స్వర్ణకుమారి, లోకాయిత ప్రచురణలు, లుంబినీవనం, అంబేద్కర్ కాలనీ, పొన్నూరు-522 124, గుంటూరు జిల్లా. ఫోన్ : 98497 41695. విశాలాంధ్ర, ప్రజాశక్తి, నవోదయ పుస్తకాల అంగళ్ళలో కూడా ఈ పుస్తకం లభిస్తుంది.

-సా.ర.బా.

# ఆటాడుకుందాం...రా!

**ఈ**మధ్యకాలంలో పిల్లలకు శారీరక వ్యాయామాన్ని కలిగించే ఆరుబయలు ఆటలు లేక చిన్న వయసులోనే ఊబకాయంతో బాధ పడుతున్నారు. ఇప్పటి పిల్లల ఆటలు నెట్‌కి, ఫోన్‌కి, టాబ్‌కి పరి మితమై, కూర్చున్న దగ్గర నుండి అంగుళం కూడా కదలకుండా భారీకాయులై చిన్నప్పుడే సుగర్, బి.పి. బారిన పడుతున్నారు. తరగతి గదుల్లోకి వెళ్ళి చూస్తే సగానికి సగంమంది కళ్ళద్దాలతో కని పిస్తున్నారు.

ఈ పరిస్థితులు మారాలన్నా, మనపిల్లల ఆరోగ్యం బాగుండా లన్నా మళ్లీ వెనుకటి ఆటలకు పిల్లలను ప్రోత్సహించాలి. పిల్లలను నాలుగు గోడల మధ్య బంధించకుండా తోటిపిల్లలతో కలిసి మెలిసి ఆడుకునేట్లు చేయాలి. తమపిల్లలకు ఆటల్లో కొద్దిగా గీసుకు పోయినా, బొట్టు రక్తం కారినా తట్టులేక కార్పొరేట్ హాస్పిటల్‌లకు పరుగులెత్తే తల్లిదండ్రుల వైఖరిలో మార్పు రావాలి. తోటిపిల్లలతో పోట్లాట వచ్చి నపుడు సర్ది చెప్పాలే గానీ తోటిపిల్లలపై విషబీజాలు నాటకూడదు.

ఇదిగో ఇలాంటి విషయాలు పిల్లలకు చెప్పటానికి, ఆరుబయలు ఆటలను పిల్లలకు నేర్పించడానికి డాక్టర్ అగరం వసంత్ హోసూరు (తమిళనాడు) నుండి 'ఆటాడుకుందాం...రా!' అంటూ పిల్లలను పిలుస్తున్నారు. పెద్దలకు హెచ్చరిక చేస్తున్నారు.

భాషాప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటులో భాగంగా మనం పోగొట్టు కున్నమన తెలుగు ప్రాంతాలు కృష్ణగిరి, ధర్మపురి జిల్లాలు, అక్కడున్న మన తెలుగువాళ్ళు తెలుగుకోసం ఆరాటపడుతూ, దాన్ని బతికించు కోవటం కోసం వుద్యమాలు చేస్తున్నారు. హోసూరు ప్రాంతానికి వెళితే అప్పటపు తెలుగుపదాలే గాక నేటికీ పిల్లలు ఆడుకుంటున్న పాతకాలపు ఆటలు కనిపిస్తాయి.

'ఆటాడుకుందాం...రా' పుస్తకంలో అచ్చతెలుగు పదాల ఆటలు చెప్పుకోదగ్గవి. ఇవి ఇక్కడి పిల్లలు భాషా పెంపుదల కోసం ఆడుతున్న ఆటలు. హోసూరు ప్రాంతపు పిల్లలు ఈ ఆటలు ఆడుతూ అచ్చతెలుగు అమృతాన్ని తాగుతూ తెలుగమ్మ ఒడిలో వూగుతున్నారు. ఇందులో అచ్చంగా ఆడపిల్లలు ఆడుకునే ఆటలు, కుందేబిళ్ళ (తొక్కుడుబిళ్ళ), చింతగింజల ఆట, అచ్చన రాళ్ళు, వానగుంతలు, మగ పిల్లలాడుకునే గోలీలు, బొంగ రాలాట ఇంకా ఇద్దరు కలిసి ఆడుకునే ఆటలు వున్నాయి. కేవలం ఆట ఎలా ఆడాలో రాయటమే గాక ప్రతి ఆటని ఒక కథగా రాస్తూ, ఆ కతల్లో హోసూరు భాషాసౌందర్యాన్ని పొందుపరచటం అభిలష ణీయం. ఈ పుస్తకం చదు వుతూ వుంటే చిన్నపిల్లలకు ఈ ఆటలు ఆడాలని అనిపిం చటమే గాక పెద్దలకు తమ బాల్యంలో ఆడిన ఆటలు గుర్తు వచ్చి మరోసారి చిన్న పిల్లలయి పోతారు.




100 ఆటల్ని వివరిస్తూ ఇంగ్లీషు, సంస్కృత పదాలకు లొంగి పోకుండా సిసలైన తెలుగులో రాయటం విశేషం. ఇంకా మనకు తెలియని కాలంచి ఆట (కానుగ విత్తనాల ఆట), గజ్జెపిచ్చుకలాట, బొకిపంచాట, పరకగడ్డి పువ్వాట మనల్ని అబ్బురపరుస్తాయి. డాక్టర్ వసంత్ ఆటల్ని వివరిస్తూ ఆట ఎలా ఆడాలో చక్కని బొమ్మల ద్వారా చూపించారు. బొమ్మలను చూస్తుంటే మనం ఆటాడుతున్నట్టే వుంటుంది. ఇది ప్రతి ఒక్కరూ చదవాల్సిన, చదివించాల్సిన పిల్లలకు కానుకగా ఇవ్వాల్సిన, ఆటల పోటీలలో గెలుపొందిన వారికి బహు మతిగా ఇవ్వాల్సిన పుస్తకం.

పుస్తకం వెల : రు.150/-లు, పుటలు : 221. పుస్తకం దొరుకుచోటు - అన్ని ముఖ్య పుస్తక కేంద్రాలు. లేదా కృష్ణగిరిజిల్లా తెలుగు రచయితల సంగం, 2/1097, బస్తి, ఆవులపల్లి రోడ్, హోసూరు-635 109, కృష్ణగిరి జిల్లా, తమిళనాడు. ఫోన్ : 09488330209.

**- పూదోట శౌరీలు,** బోధన్
ఫోను : 90101 53505

# తెలుగు దీపోత్సవం

"తెలుగును కాపాడుకోలేకపోవడం కంటే హీనమైనది లేదు. న్యాయస్థానాల్లో మేము వీలైనంతవరకు తెలుగుకు ప్రాధాన్యమిస్తున్నాం. ఇతర భాషలు నేర్చుకోవడం చాలా అవసరం- కానీ మన భాష తర్వాతే అవి" అని జస్టిస్ ఏ.రామలింగేశ్వరరావు సందేశమిచ్చారు. ధర్మసంస్థాపన, వంశీ ఇంటర్నేషనల్, తెలుగు భాషాచైతన్య సమితి సంస్థల ఆధ్వర్యంలో 10-4-2016న హైదరాబాద్ శ్రీ త్యాగరాయ గానసభలో జరిగిన 'ప్రపంచ తెలుగు దీపోత్సవం' కార్యక్రమంలో జస్టిస్ రామలింగేశ్వరరావు ముఖ్యఅతిథిగా పాల్గొని ప్రసంగించారు. "తెలుగు వినపడాలి, తెలుగు కనపడాలి, తెలుగు చదువుతాం అని పిల్లలు ప్రకటించాలి" అనే ధ్యేయంతో ఈ కార్యక్రమం జరిగింది. చిలుకూరు బాలాజీ దేవాలయ అర్చకులు శ్రీ రంగరాజన్ మాతృభాష తమిళం. కానీ హైదరాబాదులో స్థిరపడి తెలుగు అభిమాని అయ్యారు.



ఆయన ఆధ్వర్యంలో ఈ కార్యక్రమం నడిచింది. సభాధ్యక్షత వహించిన డా॥ద్వానా శాస్త్రి పాల్గొన్న సుద్దాల అశోక్‌తేజ, బైసా దేవదాసు, డా॥ఎన్.అనంతలక్ష్మి, షేక్ బడేసాబ్, డా॥వంశీ రామరాజు, గాయనీమణి జమునారాణి, డా॥దీక్షితులు, చిలుకూరి కిషోర్, సుంకర శైలజ మొదలగువారు పాల్గొన్నారు. రంగారెడ్డి జిల్లా ఇబ్రహీంపట్నానికి చెందిన రావుల మంజుల డిగ్రీ తెలుగులో నూటికి నూరు మార్కులు సాధించినందుకు వేదికపై సత్కరించారు.

# "మేరలకావల..." పుస్తకావిష్కరణ



**తె**లుగువాళ్ళు 18 కోట్లమంది వుండగా అందులో సగంమంది తెలంగాణాంధ్రాలలో వుంటే మరో సగం మంది ఈ రెండు రాష్ట్రాల వెలుపల వున్నారు. 60 ఏళ్ళ కిందట భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడి తెలుగు అంటే రెండు రాష్ట్రాలకే పరిమితమైపోయింది. పొరుగు రాష్ట్రాలలో వున్న తెలుగువాళ్ళను మన ప్రభుత్వాలు గానీ మన సమాజం గానీ పట్టించుకోవటం మానివేశాయి. కానీ అక్కడ స్థిరపడ్డ తెలుగు వాళ్ళు తమ అమ్మనుడి కోసం పడుతున్న వెతలు చెప్పనలవి కానివి. తమ భాషను బతికించుకోవటం కోసం సాహిత్య సంఘాలుగా ఏర్పడి కొందరు తమ బతుకులను చక్కని తెలుగులో కథలుగా రాశారు.

పొరుగు రాష్ట్రాలలో వున్న తెలుగు రచయితలను ప్రోత్సహించాలని, తద్వారా వారికి చేయూతనందించాలనే ఉద్దేశంతోనే సం.వెం. రమేశ్ ఆరునెలల పాటు శ్రమపడి తమిళనాడు, ఒడిసా, గుజరాత్, పశ్చిమ బెంగాల్, చత్తీస్‌గఢ్, ఉత్తరప్రదేశ్, అండమాన్, కర్నాటక నుండి 18 కతలను సేకరించారు. వీటిని 'మల్లవరపు వెలువరింతలు' సంస్థవారు "మేరల కావల" అనే పుస్తకంగా వేశారు.

ఈ నెల 10వ తేదీన హైదరాబాద్‌లోని లామకాన్‌లో పుస్తకావిష్కరణ జరిగింది. పుస్తకానికి ఆర్థికసాయం చేసిన శ్రీమతి బుర్రా సౌజన్యమ్మ గారు పుస్తకాన్ని విడుదల చేశారు. అధ్యక్షత వహించిన వాసిరెడ్డి నవీన్ గారు మాట్లాడుతూ– ఇది చరిత్రలో నిలిచిపోయే పుస్తకమని, ఈ పుస్తకానికి సంపాదకత్వం వహించిన శ్రీమతి పూదోట శౌరీలు గారు శ్రమపడి పుస్తకాన్ని అందంగా తీర్చిదిద్దారని ప్రశంసించారు. సంపాదకురాలు పూదోట శౌరీలు మాట్లాడుతూ మేరలకావల ఇంకా ఎందరో తెలుగు రచయితలున్నారని, అందరి కథలు తీసుకోవటం సాధ్యం కాదు కనుక ప్రస్తుతం18 కతలు తీసుకున్నామని, పొరుగు తెలుగువారిని ఆదరించి గౌరవించాల్సిన బాధ్యత మనమీద వుందని అన్నారు.

సాహిత్య విమర్శకులు, వ్యాసకర్త, రచయిత ఏ.కె.ప్రభాకర్ గారు పుస్తక సమీక్ష చేస్తూ– ఈ గీతలు మనం గీసుకున్నామని, తెలుగువారు లోకమంతా విస్తరించి వున్నారని, అక్కడ భాషను నిలుపుకోవటం కోసం వారు తపన పడుతున్నారని, ఉద్యమాలు చేస్తున్నారని వారికి అవసరమైన సాయం చేయాల్సిన బాధ్యత ప్రభుత్వం మీద వుందని అన్నారు. ఈ పుస్తకం తెలుగుభాష చరిత్రలోనే తొలి ప్రయోగమని దీనిని ఇంకా ముందుకు తీసుకుని వెళ్ళాల్సిన బాధ్యత ప్రభుత్వం మీదనే కాక మనందరిమీద వుందని అన్నారు. ఈ గొప్ప ప్రయత్నానికి నాంది పలికిన సం.వెం.రమేశ్, పూదోట శౌరీలు అభినందనీయులన్నారు. ఈ సమావేశానికి పొరుగు రాష్ట్రాల రచయితలు ఎనిమిది మంది హాజరై తమ కతల పెనుతలపులను, వారి రాష్ట్రాలలో వున్న భాష పరిస్థితులను వివరించారు. ఈ కార్యక్రమానికి ఇరు రాష్ట్రాల నుండి సుమారు 150 మంది హాజరై మేరలకావల వున్న తెలుగు వారి బతుకు వెతలను విన్నారు. ❊

---

## జనవాణి

నడుస్తున్న చరిత్ర నాటి నుండి 'నుడి–నాడు– నెనరు' అన్న మాటలను మీ పత్రిక నినాదాలుగా వాడుతున్నారు. నుడి అంటే భాష, నాడు అంటే రాష్ట్రం, మరి నెనరు అన్నది (ప్రేమ) ఇక్కడ పొసగడం లేదు కదా! నుడి, నాడు వర్గంలో నెనరు కలవదే! మరి నెనరును ఎందుకు పెట్టినట్లో అన్నది నా సందేహం.

దూరవాణి, చరవాణి అని వాడుతున్న మీరు ప్రస్తుతం ఫోన్, సెల్ అని మారిపోవడం ఎందుకు? ఫొటో కు ఛాయాచిత్రం అన్నమాట ఉంది కదా! తెలుగు పదాలు వాడుతున్నపుడు 'అమ్మనుడి' పత్రికలోనే ఆంగ్లపదాలు రావడం నేను జీర్ణించుకోలేక పోతున్నాను.

తెలుగు నెలలు ఉపయోగిస్తున్నారు. చాలా సంతోషం. అలాగే తెలుగు సంఖ్యలను పత్రికలో ఉపయోగిస్తే వాటిని పాఠకులకు గుర్తు చేసినట్లు ఉంటుంది. కనుక పుటల సంఖ్యను ప్రస్తుతం ఉన్న అంకెలతో పాటు తెలుగు అంకెల్లో కూడా ప్రచురిస్తే బాగుంటుంది.

పాఠకులకు పత్రికతో బాగా అనుబంధం ఏర్పడడానికి ఒక నవలను ధారావాహికగా ప్రచురించాలని నా అభిప్రాయం. ఒక తెలుగు చారిత్రక నవలను ధారావాహికగా ప్రచురింప ప్రార్థన.

పత్రికలో పాఠకులు ఎక్కువ పాల్గొనేలా ఉత్తరాలు, జనవాణి, ప్రశ్నోత్తరాలు శీర్షికలకు అదనంగా పుటలను కేటాయించాలి. ప్రశ్నోత్తరాల శీర్షిక ప్రారంభిస్తామన్నారు. కానీ ఏదో ఒక సంచికలో ఒకటి రెండు ప్రశ్నలకు జవాబులిచ్చినట్లు గుర్తు. ప్రతి సంచికలో ఈ శీర్షిక ఉండేలా కృషి చేయండి.

**–ఆర్. శ్రీనివాస్,** సింగనసంద్ర, బెంగళూరు–114

1. నుడి –నాడు– నెనరు అనే మాటల్ని 'స్వభాష– స్వదేశీ– స్వాభిమానం' అన్నమాటల అర్థంలో వాడుతున్నాం.
2. నిజమే. అయితే సెల్‌ఫోన్, ఫోన్ అనే మాటల కంటే తేలిగ్గా జనంలోకి వెళ్ళే తెలుగు మాటలు కావాలి. దూరవాణి, చరవాణి తెలుగు మాటలేనా?
3. అలాగే.
4. ప్రస్తుతానికి తెలుగు చారిత్రక నవల కాదు గానీ, రాబోయే సంచికలో ఏం వుందోనని ఎదురుచూసే ఒక రచన జూన్ నెలనుండి మొదలు గానుంది. దాని ప్రకటనను ఈ సంచికలోనే చూడండి.
5. ఎన్ని పుటలైనా కేటాయిద్దాం. ఉత్తరాలు రావాలి కదా! వ్రాసే అలవాటు తప్పిపోతున్నది. స్పందించే గుణం జారిపోతున్నది. ప్రశ్నోత్తరాల శీర్షికదీ ఇదే పరిస్థితి.

   ఫోన్‌లో మాట్లాడతారు తప్ప ఉత్తరాలు గాని, మెయిల్ గాని, సెల్‌ఫోన్‌లో చిన్న సందేశం (ఎస్.ఎం.ఎస్)గా గాని తెలుపరు.

–సంపాదకుడు

వార్త

# ఢిల్లీలో రాష్ట్రేతర తెలుగు సమాఖ్య కార్యవర్గ నిర్ణయాలు




రా.తె.స. కార్యవర్గ సమావేశాలు – శ్రీమతి తుర్లపాటి రాజేశ్వరి రచించిన 'అభినవాంధ్రసభ–1933 బరంపురం' ఆవిష్కరణ దృశ్యం

**న్యూ**ఢిల్లీలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ భవనంలోని గురజాడ సభా మందిరంలో మార్చి 25,26 తేదీలలో రాష్ట్రేతర తెలుగు సమాఖ్య కార్యవర్గ సమావేశాలు జరిగాయి. 25వ తేదీన తొలి సమావేశానికి విశ్రాంత హైకోర్టు న్యాయమూర్తి పి.ఎస్.నారాయణ, తెలంగాణ ప్రభుత్వ ప్రత్యేక ప్రతినిధి, ఒరిస్సా కేడర్‌కు చెందిన విశ్రాంత ఐఏఎస్ అధికారి రామచంద్ర తేజావత్ విచ్చేశారు. రాష్ట్రేతర తెలుగు సమాఖ్య అధ్యక్షులు పి.వి.పి.సి ప్రసాద్, ఉపాధ్యక్షులు డా॥కె.వి.ఆర్.మూర్తి, ఢిల్లీ ప్రాంతీయ ఉపాధ్యక్షులు ఎం.ఎస్.కామేశ్వరరావు, నాలుగవ జోన్ ఉపాధ్యక్షులు పూడిపెద్ది సత్యనారాయణబాబు, ప్రధాన సమ న్వయకర్త రాళ్ళపల్లి సుందరావు వేదికనలంకరించారు. తమిళనాడు నుండి తెలుగు సంఘాల ప్రతినిధులు ఎం.సత్యనారాయణరెడ్డి, ఎం.ఎస్.విజయకుమార్, కె.ఎస్.కృష్ణప్ప. రామచంద్రప్ప, బరంపురం నుండి వచ్చిన తుర్లపాటి రాజేశ్వరి, పర్లాకిమిడి నుండి వచ్చిన పి.కృష్ణ మూర్తి, మొదలైనవారు పాల్గొన్నారు. 26వ తేదీన జరిగిన సమా వేశంలో ఈ క్రింది నిర్ణయాలు చేశారు.

1. తమిళనాడు తెలుగు ప్రజలకు తమ సంఘీభావాన్ని ప్రకటించే క్రమంలో ఆగస్టు 2016లో రా.తె.స. తదుపరి కార్యవర్గ సమావేశాన్ని హోసూరులో జరపాలి.
2. తెలుగు సాహిత్యం, నాటక కళ, కూచిపూడి నృత్యం, జానపద కళలు, వీటిని రాష్ట్రేతర ప్రాంతాల్లో బాగా ప్రచారం చేయాలి.
3. పూనాలో ఈ జూన్ నెల చివరలో సాహిత్య కార్యక్రమం చేయాలి.
4. త్యాగరాజు 250వ జయంతి ఉత్సవాలను 2016 మే 4న మొదలు పెట్టి ఏడాదంతా ఇతర రాష్ట్రాలలో జరపాలి.

ఈ రెండు రోజుల సమావేశాల్లో తమిళనాడు, మహారాష్ట్ర, ఒడిశా, పశ్చిమబెంగాల్, హర్యానా, ఢిల్లీ తదితర రాష్ట్రాల తెలుగు సంఘాల ప్రతినిధులు 60 మంది పాల్గొన్నారు.

ఈ సభలో రా.తె.స సాహిత్య విభాగం సహసమన్వయకర్త డా॥తుర్లపాటి రాజేశ్వరి రచించిన 'అభినవాంధ్రసభ–1933 బరం పురం' ఆధునిక సాహితీ రూపక గ్రంథాన్ని ఆవిష్కరించారు.

శ్రీమతి గెద్దాడ విజయలక్ష్మి రచించిన పాటల పుస్తకం 'సంగీత స్రవంతి'ని, రా.తె.స ప్రచురించిన ప్రథమ రాష్ట్రేతర తెలుగు సమ్మే ళనం ప్రత్యేక సంచిక 'తెలుగు స్రవంతి'ని అతిథులు ఆవిష్కరించారు.

సమావేశాల్లో ఢిల్లీ నగరంలో నివసిస్తున్న ప్రముఖ తెలుగు కళాకారులు పద్మవిభూషణ్ డా॥యామిని కృష్ణమూర్తి, పద్మభూషణ్ శ్రీ రాజారెడ్డి, పద్మశ్రీ జయరామారావు, పద్మశ్రీ డా॥ఎస్వీరామారావు, కళావిమర్శకుడు శ్రీ విజయసాయిలను రా.తె.స. ఘనంగా సన్మా నించింది.

రాష్ట్రేతర తెలుగు సమాఖ్య ద్వితీయ వార్షిక సమావేశాన్ని 2016 అక్టోబరు/నవంబరు నెలలో ముంబాయిలో నిర్వహించడానికి ముంబయ్ ప్రముఖులు ఆహ్వానించగా కార్యవర్గం ఆమోదించింది.

❊

## భారతం అనువాదం కాదా?

"భారతం అనువాదం కాదు అనుసృజన" అన్నారు శ్రీ పోరంకి వారు. మరికొందరు విమర్శకులు కూడా ఆ మాటే అన్నారు. కవిత్రయంలో ఏ ఒక్కరూ 'అనువదిస్తున్నా'మని అనని మాట నిజం. స్వతంత్ర రచన కాని మాట గూడ నిజం. కవిత్రయం వారు అనువాదంలో కొత్త ఒరవడి ప్రారం భించారు. దాన్నే అనుసృజన అంటున్నారు. యధామూలక అనువాదాలు కవిత్వంలో లేని కాలం అది. మన తెలుగు సాహిత్యం స్వతంత్ర రచనలతో ప్రారంభం కాలేదే అన్న 'కించ'ను ఓదార్చుకోవటానికే 'అనుసృజన' అనే మాట ఉపకరిస్తుంది. అనుసృజన గూడ అనువాదంలోనే ఒక సృజనాత్మక రీతి. యధామూలక, సంగ్రహ, పునర్వచన (retelling) లాగానే అనుసృజన. కవిత్రయం వారి అనువాదం మార్గదర్శకం, అపూర్వం అనటంలో సందేహం ఎవరికుంటుంది? 'అనుసృజన' గూడ విస్తృతార్థంలో అనువాదమే.

**–డా॥వావిలాల సుబ్బారావు,** గుంటూరు, 98664 02973

# సనాతనధర్మ ఛారిటబుల్ ట్రస్టువారి శ్రీరామనవమి పురస్కారాలు










**వి**విధ రంగాలలో విశిష్ట సేవలనందించిన ఆరుగురు తెలుగు ప్రముఖులకు ప్రతి ఏడాది వలెనే ఈ శ్రీరామనవమి (ఏప్రిల్ 15) నాడు సికిందరాబాదులోని టివోలీ గార్డెన్సులో పురస్కారాలనందించారు– సద్గురు శ్రీ శివానందమూర్తిగారు స్థాపించిన సనాతధర్మ ఛారిటబుల్ ట్రస్టువారు. ఈ పురస్కారాల కార్యక్రమం 2005 నుండి నిరంతరాయంగా జరుగుతూ ఉంది.

ఈసారి ఈ పుంస్కారాలనందుకున్న ఆరుగురు : 1. శ్రీ మాడుగుల నాగఫణిశర్మగారు– అవధానంలో దిట్ట, బహుగ్రంథకర్త, 2. 'సిరివెన్నెల'గా ఖ్యాతిచెందిన శ్రీ చెంబోలు సీతారామశాస్త్రిగారు– ప్రసిద్ధ సినీగేయ రచయిత, తాత్వికుడు, 3. శ్రీమతి వేదవతీ ప్రభాకర్‌గారు– ప్రముఖ లలిత, భక్తి గీత గానవిదుషీమణి, 4. శ్రీ కసిరెడ్డి వెంకటరెడ్డిగారు– ఉత్తమ దేశిక జాతీయ సాహిత్య రథసారథి, పరిశోధకుడు 5. డా॥ సామల రమేష్‌బాబు– 'అమ్మనుడి' పత్రిక సంపాదకుడు, తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షుడు, 6. శ్రీ రావినూతల శ్రీరాములుగారు– అనేక మంది ప్రముఖుల జీవిత చరిత్రలను, విభిన్న అంశాలపై బహుగ్రంథాలను రచించారు.

జస్టిస్ గ్రంథి భవానీ ప్రసాద్‌గారు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. సనాతన ధర్మ చారిటబుల్ ట్రస్టు మేనేజింగ్‌ట్రస్టీ శ్రీ కె.బసవరాజు, ట్రస్టీలు సి. మురళీకృష్ణా, శ్రీ ఎల్.బి. సుబ్రహ్మణ్యం ఐ.ఎ.ఎస్. గార్లు, తక్కిన సహచర ట్రస్టీలు, కలిసి పురస్కార ప్రదానోత్సవ కార్యక్రమాన్ని హుందాగా, వైభవంగా, అత్యున్నతంగా నిర్వహించారు. సభకు ముందు శ్రీరామ పూజా కార్యక్రమం, ఆ వెంటనే గాత్రసంగీత కచ్చేరి నిర్వహించారు. అభినవవ్యాస శ్రీ మల్లాది చంద్రశేఖర శాస్త్రిగారు రామాయణ ప్రవచనం చేశారు. పురస్కార గ్రహీతలు ఒక్కొక్కరినీ శాలువాతో సత్కరించి, ప్రఖ్యాపన పత్రాన్ని చదివి, దానితోపాటు జ్ఞాపికగా సీతారాముల విగ్రహాన్ని, నలభైవేల రూపాయల నగదును ఇచ్చి సత్కరించారు. ముఖ్య అతిథి జస్టిస్ భవానీప్రసాద్‌గారి చేతుల మీదుగా మేనేజింగ్ ట్రస్టీ బసవరాజుగారు సన్మాన కార్యక్రమాన్ని నిర్వహించారు. సన్మానితులు విడివిడిగా తమ స్పందనను తెలుపుతూ ప్రసంగించారు.

పురస్కారాలు లాంఛనమైపోతున్న ఈ రోజుల్లో అత్యంత శ్రద్ధాసక్తులతో, సమున్నతంగా ఈ కార్యక్రమాన్ని ప్రతిష్ఠాత్మకంగా నిర్వహిస్తున్న సనాతన ధర్మ ఛారిటబుల్ ట్రస్టువారు సమాజానికి ఆదర్శంగా ఉన్నారు. ❃

Owned, printed & published by Samala Lakshmana Babu (9440448244) and printed at Sri Mahalakshmi Offset Printers, 16-7-20, Veera Raghavulu Street, Sharabu Bazaar, Tenali, Guntur Dist. and published from 8-386, Jivaka Bhawan, Angalakuduru Post, Tenali Mandal, Guntur Dist. - 522211. Editor: Dr. SAMALA RAMESH BABU (9848016136)
RNI-APTEL/2015/62362




ముఖ్య అతిథి జస్టిస్ గ్రంథి భవానీ ప్రసాద్ గారు, మేనేజింగ్ ట్రస్టీ బసవరాజు గారు
అభినవవ్యాస మల్లాది చంద్రశేఖరశాస్త్రి గారు, పురస్కార గ్రహీతలు



సద్గురు శ్రీ శివానందమూర్తి గారు

# సనాతనధర్మ చారిటబుల్ ట్రస్టు వారి శ్రీరామనవమి ప్రతిభా పురస్కారాలు

2016 ఏప్రిల్ 15, సా॥ 6 గంటలకు
టివోలి గార్డెన్స్, సికింద్రాబాదు



ఫొటోలు : గొల్లపూడి రవి

సభలో పాల్గొన్న పెద్దలు



డా॥మాడుగుల నాగఫణిశర్మ- శ్రీ సిరివెన్నెల సీతారామశాస్త్రి- శ్రీమతి వేదవతీప్రభాకర్- శ్రీ కసిరెడ్డి వెంకటరెడ్డి- డా॥సామల రమేష్‌బాబు- శ్రీ రావినూతల శ్రీరాములు
పురస్కారాలు అందజేస్తున్న మేనేజింగ్ ట్రస్టీ కె.బసవరాజుగారు, ముఖ్య అతిథి జస్టిస్ గ్రంథి భవానీ ప్రసాద్ గారు



మేనేజింగ్ ట్రస్టీ బసవరాజు గారు



డా॥జి.ప్రభాకర్ గారు



ఎల్.వి.సుబ్రహ్మణ్యం గారు, ఐఎఎస్

